శ్రీ రామానుజ కీర్తి కౌముది
పదవ భాగము

మొదటి ముద్రణము
వేయి ప్రతులు

అక్షయ - విజయదశమి
అక్టోబరు - 1986

రామానుజ శకము

మూల్యము
ముప్పది యైదు రూపాయలు

ముద్రణము
పద్మావతి ప్రింటర్స్
బ్రాడీపేట : గుంటూరు

# సమాలోచన సమితి

మహాకవి - సరస్వతీ పుత్ర - కళాప్రపూర్ణ
**డాక్టర్ పుట్టపర్తి నారాయణాచార్యులు**
కడప

*

వ్యాకరణ విద్యా ప్రవీణ - భాషా ప్రవీణ
**శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు, M A.**
విశాఖ పట్టణము

*

సాహిత్య రత్న - భాషా ప్రవీణ
**శ్రీమాన్ కె టి యల్ నరసింహాచార్యులు**
శ్రీ గోదా గ్రంథమాలా సంపాదకులు
ముసునూరు

*

సంగీత సాహిత్య కళానిధి
**శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు**
విజయవాడ

*

చతుర్విధ కవితా చతురానన - మహాకవి
**శ్రీమాన్ విక్రాల శేషాచార్యులు**
కలికివాయ

*

భాషా ప్రవీణ - విద్వాన్ - లలిత కవి
**శ్రీమాన్ కొమాండూరు రామానుజాచార్యులు**
కందుకూరు తాలూకా రచయితల సంఘాధ్యక్షులు
ఉలవపాడు

*

న్యాయవిద్యాప్రవీణ
**డాక్టర్ యస్. బి రఘునాథాచార్యులు, M A, Ph D**
సంస్కృత రీడర్ శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయము
తిరుపతి

*

సాహిత్య విద్యా ప్రవీణ
**శ్రీమాన్ చలమచర్ల వేంకట శేషాచార్యులు**
సంస్కృతోపన్యాసకులు
శ్రీ వేంకటేశ్వర వివేకవర్థినీ సంస్కృత కళాశాల
హైదరాబాదు

*

**శ్రీమాన్ చిలకపాటి విజయ రాఘవాచార్యులు, M A**
లెక్చరర్ - ఆంధ్ర ప్రదేశ్ రెసిడెన్షియల్ కాలేజి
నాగార్జున సాగర్ – విజయపురి సౌత్

*

**శ్రీమాన్ శ్రీపెరుంబూదూరు శ్రీరంగాచార్యులు, M A**
ఉపన్యాసకులు - శ్రీ వేంకటేశ్వర ప్రభుత్వ ప్రాచ్య కళాశాల
సాలెమ్

*

కవికోకిల - విద్వత్కవి - కావ్యకళానిధి
**శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులు**
ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ సభ్యులు
సిద్దిపేట

•

**డాక్టర్ కె సుప్రసన్నాచార్యులు, M A, Ph D**
తెలుగు ప్రొఫెసర్ ; కాకతీయ విశ్వ విద్యాలయము
వరంగల్

# ప్రముఖులు - ప్రశంసలు

**దీక్షితదాసు** — **నర్సాపురం**

'శ్రీ రామానుజ కీర్తి కౌముది' ఇతి ఖ్యాతి సుస్మిరామానుజ వి
స్ఫార స్నిర్మల కౌముదీ సదృశోమై, జ్ఞానామృత ప్రాప్తి చే
కూరన్ ధన్య మొనర్చె మజ్జని, ధనుష్కోటీ ధరాచార్యాంశ వి
స్తారా ! వైష్ణవరా ప్రచార ! పండితాచార్యా ! నమస్తే నమః

**సి. హెచ్. శ్రీరంగాచార్యులు**, M A B Ed — **జడ్చర్ల**

శ్రీ రామానుజ కీర్తి కౌముది - ఆరవ సంపుటమును పరిశీలించి, చాల సంతసించితిని ఇందలి విషయములు సమగ్రములు, రమణీయములు, విజ్ఞాన సంధాయకములు

**కె. టి. యల్. నరసింహాచార్యులు** — **ముసునూరు**

ఈ కలికాలమున ఇట్టి గ్రంథ రత్నములు వెలువరించుట - మహా సాహస మనక తప్పదు

**శ్రీరంగాచార్య**, M A — **పాలెం**

మీ కృషి నాన్యతోదర్శనీయము మరి వేరుగా చెప్పవలసిన పని లేదు

Dr PREMA NANDAKUMAR, M A, Ph D — SRIRANGAM

I have received your gift of the *Sri Ramanuja Keerthi Koumudi* Volume No VI The Volume Containts, as always, rich meterial Your own article on the Philosophy of the Alwars is presented Cogently and Conincingly Since it is my good fortune to know Tamil, I derive great pleasure and benefit by reading the footnotes which instance the Contextual *Pasurams*

# పత్రికలు - ప్రశంసలు

సప్తగిరి డిశంబరు 198

నూతికి తొంబదిపాళ్ళు నాస్తిక తత్త్వ ధోరణికి అంకితమైపోతున్న వా
ఆస్తిక బుద్ధిని కలిగించే తీరున, 'శ్రీ రామానుజ కీర్తి కౌముది'ని వెలయిస్తున్న వా
ప్రత్యేకంగా ప్రశంసిస్తున్నాను

— *యామిజాల పద్మనాభస్వా.*

ఆరాధన జనవరి 19

'శ్రీ రామ ుజ కీర్తి కౌముది' అనుటచేత, శ్రీ వైష్ణవులకే సంబంధించిన
అనుకొన నవసరము లేదు అద్వైతుల - విశిష్టాద్వైతుల సిద్ధాంతములలో కొన్ని
ఇందు (6 - వ భాగమున) చూడవచ్చును ఇందు 'శ్రీమద్రామానుజులు - శ్రీవేం
నలు' అను రచన అద్భుతముగా నున్నది

— *దోనేపూడి భాస్కరమూ*

ఆంధ్రపత్రిక 18-3

విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని గూర్చి, శ్రీ రామానుజాచార్యుల వైభవాన్ని గ
తెలిసికొనగోరువారికి ఈ గ్రంథము అత్యంతోపయుక్త మనుటలో సందేహము ల

— *డా చ రాజరాజేశ్వర*

ఆంధ్రప్రభ 6-4

శ్రీ రామానుజ కీర్తి కౌముదిలో వ్యాసాలు వైష్ణవ సంప్రదాయ విజ్ఞాన
ప్రమాణంగా సుగమంగా అందజేస్తున్నాయి వ్యాసకర్తలకు విషయంపట్ల అధి
ఉండడమే కాకుండా, రచనానుభవం కూడా సిద్ధించి ఉండడంవల్ల, వ్యాసాలు చ
రూపుదిద్దుకున్నాయి కేవలం అన్యమత నిరాసన దృష్టితో కాక, ఉత్కృ మత
లక్ష్యంతో మాత్రమే ముందుకు సాగుతున్న ఇటువంటి ప్రచురణ సంస్థ
ఆయా మత విశ్వాసాలు గలవారికి మేలు జరుగవచ్చు

— *డాక్టర్ వి వి ఎ*





శ్రీనివాసాయ నమః

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ రామానుజ ప్రభావము



శ్రీ రామానుజులు శ్రియఃపతి యాజ్ఞచే ఆదిశేషాంశతో - చేతనోజ్జీవనార్థమై, ఉభయ విభూతి నాయకులుగా అవతరించిరి. మహనీయులు శ్రీమన్నారాయణుడే పరతత్త్వమనియు, ఆతడే ప్రాప్యము, ప్రాపకము, ఉపాయము, ఉపేయము అనియు, భక్తి ప్రపత్తులే మోక్షోపాయము లనియు వారు బోధించిరి శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంతమును ప్రతిపాదించుచు, బ్రహ్మసూత్రములకు భాష్యమును రచించి, శారదాదేవిచే 'శ్రీభాష్యకారులు' అను బిరుదమును, బంగారు మయమైన శ్రీ లక్ష్మీ హయగ్రీవ విగ్రహమును బహుమానముగా పొందిరి మత సుస్థిరతకై, గీతాభాష్యాది గ్రంథములను మఱి కొన్ని రచించిరి భగవదారాధనా విధానమును వివరించుచు - 'నిత్య గ్రంథమును' రచించిరి ఇట్లు నవ నిధులవంటి నవ గ్రంథములను రచించి, శ్రీ సంప్రదాయమునకు మిగుల బలమును చేకూర్చిరి ఆసేతు శీతాచల పర్యంతము దిగ్విజయ యాత్ర చేసి, మతాంతర పండితులనేకులను పరాజితులగావించిరి పరహితమును కోరి, గురుని యానతిని మీరి, ఆలయ గోపుర మధిరోహించి, మంత్ర మంత్రార్థములను వెదజల్లిరి శ్రీరంగనాథ దేవాలయాధిపత్యము వహించిరి, అనేక దేవాలయములను పునరుద్ధరించి, కొన్ని కట్టుదిట్టములు చేసిరి

ధనుర్దాసు మున్నగువారిని సముద్ధరించిరి ఢిల్లీ నవాబును మెప్పించి
రామప్రియులను గొనివచ్చి, ఆ రామప్రియుల విగ్రహముతో బాటు
బీబీనాంచారు విగ్రహమునుకూడ మేల్కోటలో ప్రతిష్ఠించిరి ఆ దివ్య
క్షేత్రమునందే హరిజన దేవాలయ ప్రవేశము గావించిరి ఆశ్రితుల
భక్త ప్రపన్నుల నెందఱనో తరింపజేసిరి లోక కల్యాణమును కోరి
ఇకను ఎన్నియో మహాకార్యములను నిర్వహించిరి ఇట్టి యంశము
వలన, శ్రీ రామానుజ ప్రభావము అసదృశమైనదని సహృదయుల
వారికి సులభముగా బోధపడగలదు అట్టి భగవద్రామానుజ ప్రభా
వమును, ఆ యతిసార్వభౌములు ప్రవర్తింపజేసిన విశిష్టాద్వైతసిద్ధాం
తమును వేనోళ్ళ కొనియాడిన ప్రముఖ తత్త్వశాస్త్రవేత్తలనేకులుకలరు
అట్టివారిలో నొకరుగా విశ్వ విఖ్యాతి గాంచి, ఇటీవల మన స్వతంత్ర
భారతమున ఉపరాష్ట్రపతిగా, రాష్ట్రపతిగా మహోన్నత పద
లధిష్ఠించి రాణించిన డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ పండితు
అభిప్రాయములను మాత్రము ఇచట మచ్చునకు కొన్ని పొందుపఱచు
చున్నాము

'రామానుజుడు ఈశ్వర ప్రపంచ సంబంధముపై తన దృష్టిని కేంద్ర
రించి, ఈశ్వరాస్తిత్వము యథార్థమనియు, అతడు స్వతంత్రుడనియు, జీవా
త్మయు సత్యమేకాని, వాని యస్తిత్వము పరిపూర్ణముగా ఈశ్వరాధీనమై యున్నదని
వాదించును జగత్తునకు మూలాధారమైన యొక తత్త్వమున్నదనియు, అది మి
కాదనియు అతడు వచించును ముక్తి జీవులు తమ ప్రత్యేక వ్యక్తిత్వము
అవిచ్ఛిన్నముగా నుండునని యాతడు వక్కాణించును జడజగత్తును, జీవు
తమ ప్రత్యేకాస్తిత్వమును గలిగియున్నను, అందేదియు బ్రహ్మ స్వరూప
గాదు ఏలన, బ్రహ్మ మెట్టి లోపములు లేని నిత్య పరిపూర్ణుడు, జగత్పదార్థ
జడము, జీవులు అవిద్యా దుఃఖ దూషితులు కాని, వీని కన్నిటికి, ఏ
మున్నది జడ జగత్తును, జీవులును దేవుని శరీరము, దేవుని దేహముగానే

కి గల దేలస, దేవుడే వాని కాత్మయు, యజమానియు నగును బ్రహ్మమునకు గా వాని కస్తిత్వము లేదు జీవాత్మయు, జడ జగత్తును ఈశ్వర భిన్నము లేకాని, స్వాధీనములై, ఈశ్వర సేవార్థము కాక, వానికి వేరే ప్రయోజనము లేదు వు, రామానుజ సిద్ధాంత మద్వైతమే కాని, ఒక విశేషముతో గూడి యున్నది మైన పరమాత్మ, అనేకత్వము సంతరించును అది జీవ జగత్తులతో గలిసి ఉండును అందుచే అది విశిష్టాద్వైతమైనది

• రామానుజుడు వేదాంత సారమును, వేదార్థ సంగ్రహమును, వేదాంత దీపము, బ్రహ్మ సూత్ర - గీతాభాష్యము లను రచించెను. వైష్ణవ పండితు లెల్లరు మానుజ బ్రహ్మసూత్రార్థ వివరణము నంగీకరించిరి ఆదియే వైష్ణవులకు భాష్య మయ్యెను దక్షిణాపథ మెల్లెడ సంచారము చేసి, రామానుజుడనేక ల దేవాలయములను పునర్నిర్మాణము చేసి, అసంఖ్యాకులను వైష్ణవులుగా ర్చెను ఏ మహాత్ముని సంపన్నుడు తన యుగమునకు ప్రవక్తయై, తనకు లభించిన సంప్రదాయ సిద్ధమగు ప్రాచీన విజ్ఞానమును తన జీవితములో పునరనుభూతి చెందెను రామానుజునికి సహవాసము నొసగిన భక్తులు, జ్ఞానులు - నిత్య ధ్యాన వైరాగ్యము లతో తమ జీవితముల గడపిరి ఆళ్వారుల గీతములు - వారి హృదయములలో పరమేశ్వరుడు నిండారి, పొంగి, పొరలించిన మహత్తర ఆవేశ భక్తి గీతములు ఏ లన, వారికి భగవానుడనగా - జగత్కర్తయే కాదు, సన్నిహిత మిత్రుడు, మార్గదర్శియు నైనాడు జన్మ సహజమై, భక్తిభావము రామానుజునికి పరమేశ్వరు నొక వ్యక్తిగా ప్రదర్శించినది శంకర రామానుజ లిరువురును సిద్ధాంత మహా ప్రవక్తలే వారి కాధారములగు మూల గ్రంథములును సమానములే వారి వివరణ పద్ధతులు ఇంచుమించుగా సమా ప్రతిపాదనపైననే సాగినవి కాని, ఫలితములు మాత్రము విస్పష్ట భిన్నత్వమును సూచించినవి వారు చేసిన నిర్ణయములు, పరమార్థ సంగ్రహణములో వారి భిన్నములగు చూపులను ప్రదర్శించినవి రామానుజుడు సహజ మతానుభూతిని గట్టిగా నమ్మి, సృష్టి రచన వలనను, మానవు లకు గోచరించు పరమేశ్వరుని వ్యక్తీకరించు నిగూఢమగు అనుష్ఠాన భక్తిమార్గమును

ప్రకటించినాఁడు బ్రహ్మసూత్రములయందును, ఉపనిషత్తులయందును అవ్యక్త నిగూఢత్వము నందియున్న భావమును అతఁడు ఆళ్వారుల యొక్కయు, ఆచార్యుల యొక్కయు సాంగత్యముచే బహిర్గతము లొనరింపఁగల్గెను. అతఁడెన్నఁడును తానొక స్వతంత్రమగు తత్త్వమును ఉపదేశించుచున్నట్లు భావింపలేదు. సార్వకాలికమైన బ్రహ్మజ్ఞానమునే అతఁడు ప్రకటించుచున్నట్లు విశ్వసించెను."

'ఇతిహాసారంభ యుగమునుండి, యించుమించుగా - వైష్ణవోద్యమము అవిచ్ఛిన్నముగా ప్రబలిన చరిత్ర మున్నది. ఋగ్వేదమునందు విష్ణువు - పరమపదవాసియైన ఆదిత్య దేవతగా భావింపఁబడెను. వరుణ దేవతాభావము బలవత్తరమగ ఏకేశ్వరవాద లక్షణ లక్షితమై యున్నది వేదములందు మనకు శుభాశీర్వాదప్రదాయగు భగదేవతాభావ మున్నది. ఈ భగ శబ్దమునకు శ్రేయశ్శక్తి యను భావము పెంపొంది, క్రమముగా అట్టి శక్తిగలవాఁడే భగవానుఁడని తలంపబడెను. భగవదారాధనతోఁ గూడిన మతమే భాగవత మతము. భాగవత మతమును గూర్చి మహాభారతమునఁ జెప్పఁబడిన పాంచరాత్ర మతమున, వైష్ణవమత లక్షణము లన్నియు నున్నవి."

పై పంక్తులనుఁబట్టి, ప్రముఖ తత్త్వశాస్త్రవేత్తలగు డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ పండితులకు — భగవద్రామానుజులయందును, వారు ప్రవర్తింపఁజేసిన విశిష్టాద్వైత సిద్ధాంతమునందును ఎంతటి పూజ్య భావము గలదో తెలియుచున్నదిగదా!

ఇంకను భగవద్రామానుజ ప్రభావమునుగూర్చి డాక్టర్ రాధాకృష్ణ పండితుల భావనా పరంపరలను విపులముగాఁ దెలియఁగోరువారు — వారు ఆంగ్లమున విరచించిన 'ఇండియన్ ఫిలాసఫీ

**ian Philosophy)** అను గ్రంథమునుగాని, దానిని శ్రీ బులుసు టేశ్వరులు తెలుంగులో అనువదించిన 'భారతీయ తత్త్వ స్త్రము'నుగాని పరిశీలింపవచ్చును.

ఈ సప్తమికౌముది - గ్రంథ ముద్రణమునకు ఆర్థిక సహాయము ంచిన తిరుమల తిరుపతి దేవస్థానములవారికి మే మెంతయు జ్ఞులము.

— ప్రకాశకులు



# విషయానుక్రమణిక

**పూర్వకవి విరచితము**



# శ్రీనివాస స్తుతి

'భాషా ప్రవీణ'

## శ్రీమాన్ బృందావనం రంగాచార్యులు

—*—

శ్రీరమణీ మనోహర! విశేష దయారస భాసురా! మహో
దార గుణాకరా! ప్రథిత ధార్మిక సువ్రత తత్పరా! ధరా
భార సమాపనోదన శుభప్రకరా! పరిపూర్ణ నిత్య కా
మార కళా రమాధర! నమ స్సుమనస్సులు వేంకటేశ్వరా!

భూసతి నోము పంటగ - అపూర్వ మహో మహిమ న్వెలార్చు సీ
వాసి, దిగంత సీమల ప్రపన్న జనమ్ముల కొంగుబంగరై
భాసిలె - నీ కృపారస మభంగుర గంగగ గొల్చువారి వి
శ్వాస పరంపరన్ విజయవంత మొనర్చెను వేంకటేశ్వరా!

ఆలన పాలనల్ సలిపి అందరి డెందములందు నూగు వాం
ఛాలత సాగివచ్చి సుమ సంతతితో ఫలియింప నండమై
చాలిన శక్తి గూర్చె నట స్వామి! భవ న్మహనీయ సేవ లో
కాల తరింప జేయును యుగమ్ముల నుండియు వేంకటేశ్వరా!

మనమును నీ పదాల ననుమాన మొకించుక లేక నిల్పువా
రనుపమ హర్ష వర్షమున నన్నివిధమ్ముల ముగ్ధు లౌచు నూ
తన మధురానుభూతుల సదా చరియించెదరంట - ధన్యతం
గనియెదరంట నిస్తుల సుఖమ్ముల దేలుచు వేంకటేశ్వరా!

కనదురు శోభ లీనుచు జగమ్మున నద్భుత మోద సంపదల్
పెనగొన జేయు నీ మధుర వీక్షణ పంక్తియె ఆశ్రితాళికిన్
ఘనతరమైన అండ - శుభ కారణ భూత కటాక్ష మాలికా
ధనమె ధనమ్ము నిక్కముగ తాత్త్విక దృష్టికి వేంకటేశ్వరా!

చారుతరమ్ములై భువన సంతతి పాలి శుభంకరమ్ములై
సార కళాత్మకమ్ములయి సజ్జన లోక సుఖంకరమ్ములై
భూరి యశో విశేష బల పూర్ణములై విలసిల్లు తావకో
దార మహా మహోజ్జ్వల పదమ్ములు నిక్కము వేంకటేశ్వరా!

ప్రాకట సప్తశైలకులవాస! నిరంతర విశ్వ మానవా
సీక కర ప్రపూజిత వినిర్మల చారు పదాబ్జ భాస! శా
ఖాకుల దీన రక్షణ చణాద్భుత ముగ్ధ కళా విలాస! లో
కైక విశిష్ట పూర్ణ దరహాస! నమస్సులు వేంకటేశ్వరా!

ఒకపరి నీ మనోజ్ఞ మహిమోన్నత దర్శన భాగ్య మబ్బినా
సకలము లభ్యమైనటుల - సర్వ శుభమ్ముల పూర్ణ కాములై
పకపక లాడుచుండెదరు పండిత పామరు లెల్ల - ముగ్ధ తా
వక కరుణా కటాక్ష బలవర్ధితు లౌ మను వేంకటేశ్వరా!

తనయుడు దుష్టుడైనపుడు తండ్రి మహాగ్రహ మూనుచున్నను, మె
ల్లన వివరించి చెప్పుకొని లాలన సల్పెడి రీతి - ఆశ్రితా
వన ఘన దీక్షతో, మృదుల భావనతో కరుణించువంట భ
క్తుని - అపరాధపున్ ముడుపు గొంచు క్షమించుచు వేంకటేశ్వరా!

ప్రోచెడివాడ వీవు - తలపుల్ పద పంక్తుల నిల్పు వారలన్
గాచెడివాడ వీవు - శుచిగా స్తుతియించెడువారి గుండెలన్
దోచెడివాడ వీవు - నతులన్ గొని ఆశ్రితకోటి సేవలన్
జూచెడివాడ వీవు నవ శోభల గూర్చుచు వేంకటేశ్వరా!

వాసిని గన్నస్వామివి - కృపా పరిపూర్ణ కటాక్ష పంక్తితో
భాసుర లీల నీ జగతి పాలన సల్పెడి నిన్ను భక్తి వి
శ్వాస విశేష వైఖరుల సర్వజనుల్ భజియింతు రర్థులై
దోసెడు పారిజాతములతో తమి దీరగ వేంకటేశ్వరా!

ి కలుషమ్ములన్ తుడువ గల్గిన నీ చరణాంబుజమ్ము లా
ల నహించుంచి భక్తిరస ధారలతో నభిషేక సేవలన్
లిపి గడింపజాలుదురు జన్మకు తారకమైన యోగ్యతా
లమును మానవుల్ విమల భావను తాచును వేంకటేశ్వరా!

మునిజన సేవితాంఘ్రియుగమున్ గని కంఠ మెత్తి, లో
కనము ... మాలికలు చల్లగ నూగ ముదమ్మునన్ మన
మ్మున కవితా పయోనిధి అపూర్వముగా ప్రవహింప నన్నమ
య్యను మురిపించినావట మహాద్భుత లీలల వేంకటేశ్వరా!

స్వారి రెమెసర్చు కోరికల సక్తి సదల్చి భవ త్పదాబ్జ సే
వాంతి పట్ల మక్కువ నపారముగా వెలయించి పెంచి మ
గ్న్యము మెట్టి మంచి దొరవయ్యా! శ్రియఃపతి! యీ మహోన్నతా
నాము కక్కు మాకు సుకృతమ్ము వశమ్మున వేంకటేశ్వరా!

యుక్తిమైన నీ వదన శోభకు వన్నెలు దిద్ది, అంతరాం
తం కలుషమ్ములన్ కడిగి ధన్యత గూర్చును దర్శనార్థులై
రు లసుదెంచు వేళ తిరునామము - సంబరమున్ ఘటించెలే
సిరుపంబు తేజ! శేషగిరి నిత్య నిధానమ! వేంకటేశ్వరా!

హరి! సిరిజేడ! దీనశరణా! జగతీధవ! సాధుమానవా
దరణ కళా ప్రసన్న! ప్రథిత ప్రచురోజ్జ్వల కీర్తివైభవా
కర! రమణీయరూప! బుధ కౌతుక కారణ భూత! నిత్య సుం
దర కరుణారసాపగ! ఉదార మహోదయ వేంకటేశ్వరా!

ఆస రగుల్పు నీ అభయ హస్తము మానవకోటి గుండెలన్
భాసుర భావ వైభవ శుభంకర సుస్థితి కాలవాలమై
చేసిన పూల పూజలకు, చిత్త విశుద్ధతకున్ ప్రతీకగా
స సుకృతమ్ము వచ్చి వరియించిన రీతిగ వేంకటేశ్వరా!

ప్రగతి పథాన పాశవిక భావ పరంపర నుక్కడంచి, రే
బగలు ధరా మహాభ్యుదయ వైఖరి కండగ నున్న నీ దయారసా
పగ బారలించి స్వార్థ గుణ బంధుర మానవకోటి యోచనల్
తెగి పడనట్లు జేయవలె దేవర! మ్రొక్కెద వేంకటేశ్వరా!

వరుసలు బెట్టి పిల్చుకొని వత్సలతా పరిషిక్త మానసాం
బరు లయి సంచరింపగల భక్తుల చల్లని గుండెలందు సో
దర మహితానురాగ రస ధారల పొంగులె కాని, క్రౌర్యముకి
వీసెడి హెచ్చు లొచ్చుల విభిన్నత లుండవు వేంకటేశ్వరా!

ఆదియు నంతమే యెరుగనట్టి భవ త్ప్రతిభా విభూతి కీ
మేదిని దర్పణ మ్మగుచు మెచ్చుకొనం దగు రీతి వెల్లగా
నాదియు, నీది, వాని దనినన్ సబ బౌనె! త్వ దన్యమైన దిం
కేదియు లేనె లేదు పరమేశ్వర! మాధవ! వేంకటేశ్వరా!

అచల మనస్కులై మును లహర్నిశమున్ తపియించుచుండు రే
ప్రచుర మహా ప్రభావ పరివర్ధిత మూర్తిని జూడ, అట్టి ని
న్నిచట గనుంగొనం గలుగు టెట్లు మహోద్రధిమంబు లేక - నీ
సుచరిత తారక మ్మగు వసుంధర కెప్పుడు వేంకటేశ్వరా!

తిరముగ నీ కథల్ నరుల దిద్దును గాక సదా భవ స్మరో
హార రమణీయ నామ జప మందె మనస్సు వచస్సు నిల్చి సం
బరం పడుగాక! నీ దయ అపార మహోదధికిన్ సమాగమై
వరలునుగాక నిస్తుల శుభమ్ములు గూర్చుచు వేంకటేశ్వరా!

ఏల చరాచర ప్రకృతి కింతటి సత్తువ దక్కె - జీవ ధా
రా లలితాకృతుల్ నదులు లాస్య మొనర్చు టదేల? మేలి భా
వాల కవీంద్రు లేల రసవత్కవితల్ రచియించినారు - లో
కాల దొరా! నినుం గని సుఖమ్ముల దేలుట వేంకటేశ్వరా!

యని నామ గానము మదిం బులకింపగ జేయ జీవిత
స్యేయము పండ - మోము నవ తేజముతో విలసిల్ల - నూతనా
ర్నాయ సుధల్ స్రవింప కరుణన్ విరియించి కటాక్ష వీక్షణా
శ్రియుతు జేసి మా మనవి చేకొని కావుము వేంకటేశ్వరా!

లచి తలంచి శాంతి వెడదన్ బులకింపగ జేయుచుండ నూ
ాల వలయమ్మునన్ మనిగి - అంచున జేరి తరించు మార్గముచే
తెలియనివారి నొడ్డునకు దెచ్చెడి శక్తిమయుండ వీ వహో!
ులచుట యన్న నిన్ దలచి ధన్యత గాంచుటె వేంకటేశ్వరా!

ెలిచితినంచు మానవుడు కీర్తి కళా ధ్వజమున్ ధరించి శా
్రాలు మొలిపించుకొన్న గతి గర్వముతో విహరించు నిత్య సం
ాల విలయమ్ము లన్నిటిని కోరి శిరమ్మున దాల్చు తృప్తిగన్
ెలుచుట యన్న నీ దయను గెల్చుటయే గద! వేంకటేశ్వరా!

లిగినవారి కాళ్ళ బడి, గడ్డము బట్టి విధేయతా గుణ
మ్ముల వెలయించి వేడుకొని, ముచ్చట దీర్చుకొనంగ నెంచి నిన్
కలచుట మానివైచిన మదమ్ము సుఖమ్ము శుభమ్ము గల్గునా?
ులుగుట యన్న నీ కరుణ గల్గుట యొక్కటె వేంకటేశ్వరా!

ువు దయా పయోనిధివి - నీ హృదయమ్ము హిమాలయమ్ము సం
భావన సేయ నాదరణ పండిన గుండియ నీది - నిత్య సే
వా విధి గొల్చువారల కపార బల మ్మిడు నీ కరమ్ము - నీ
పావన పాద యుగ్మము శుభాలకు మూలము వేంకటేశ్వరా!

చారు మనోహర ప్రభకు సర్వదిశల్ పులకించుచుండ నోం
కార నినాద లీల త్రిజగమ్ముల ముగ్ధ మొనర్పగా నలం
కార విశేష వైభవ చకచ్చకిత మ్మగు దివ్య దర్శన
శ్రీరుచి నాస జేయుదురు సిద్ధ జనమ్ములు వేంకటేశ్వరా!

తీయని దాహమై మమత తేల్చుచు ముంచుచునుండె - ఆశయా!
ఆరని దాహమె - జిహ్వ మరియాదను గాదని రచ్చ కెక్కె - వి
స్తారము లాయె కోరికలు, సప్తగిరీశ పదాబ్జ భవ్య సే
వారతి నూగు యోగమున వర్ధిల జేయుము వేంకటేశ్వరా!

ఝరులు వెలార్చు సౌరభము వీనుల విందుగ బాడు కోకిలన్
తరు గణముల్ ఫలమ్ముల నుదారముగా నొసగున్ లసత్ సుధా
కరుడు సహస్ర సత్కిరణ కాంతుల నుర్వికి వెల్గు నిచ్చు నీ
కరుణయె సర్వ మింతకును కారణ మాగద వేంకటేశ్వరా!

గల గల పాలుచున్ విపుల కౌతుకమున్ ఘటియించి మానస
మ్ముల దనియించు కన్నుల కపూర్వ సుపర్వముగా వినూత్న పం
క్తుల రమణీయ రూప రుచితో సెలయేరు తదీయ వైఖరుల్
కొలుచును నీ మహా మహిమకున్ తలవంచుచు వేంకటేశ్వరా!

అనుపమ వైభవమ్మునకె ఆలయ మాచు సదా పవిత్ర కీ
ర్తనల ధ్వనించి వేదముల తత్త్వమునే నుతియించునట్టి స
జ్జనుల సమర్చనల్ గొనెడి సన్నిధి పెన్నిధిగాదె? ఎల్ల వా
రిని మురియించు నీ చరణ రేణు పరాగము వేంకటేశ్వరా!

ముచ్చట గూర్చు నీ భువన మోహన రూప కళా విలాసమే
అచ్చు పడె న్వలెన్ హృదయమందు భవన్నుతి సల్పు టొక్కటే
వచ్చిన మార్గమై నిలిచినన్ లభియించు ననన్త సౌఖ్యమున్
హెచ్చుగ మానవాళికి రమేశ్వర! కేశవ! వేంకటేశ్వరా!

మునులు తరించి మించి ముదము న్గనినారు త్వదీయ నామ కీ
ర్తన మొనరించి - ఆత్మకు బలమ్ము ఘటించి - జయమ్ము గూర్చు కీ
కనుల రహించు తేజము - ప్రగాఢ మనమ్మున నిన్ను గొల్చువా
రనఘులు, వారి కబ్బునట అవ్యయ సౌఖ్యము వేంకటేశ్వరా!

కొండలు గుట్టలున్ గుహలు కోటలు శోభను పుష్ప వృక్షముల్
పండిన చేలు - రుచ్య ఘన భాసుర శాఖలు - వెండి వెన్నెలన్
నిండిన రేయి - నవ్య రమణీయతలన్ విరియించు నీ మహో
న్నంద కళా ప్రవీణత కుదాహరణమ్ములు వేంకటేశ్వరా!

మానవు డాశ్రయింప దగు మార్గములన్ గరుణించి చూపు నీ
జ్ఞానము - సప్త శైల కుల ధామ మనోజ్ఞ పవిత్ర భావనా
మాన విశేష వైభవము నోచిన నోముల పంట యౌచు మం
దానిలమై శుభమ్ము లిడి ధన్యత గూర్పగ వేంకటేశ్వరా!

శంకలు మాని, నీ చరణ సన్నుతియందె మనస్సు నిల్పి, నీ
వంకనె భావనల్ మలుపు వారికి లభ్యముగానిదేమి ? ఏ
సంకుచితమ్ము లేని గుణ సంపద సొంపెసలారు వారలే
వెంకలుగా రహింతు రవ లీల శుభమ్ముల వేంకటేశ్వరా!

విలస దపూర్వ శోభల పవిత్రత గూర్చుచు నేత్ర పర్వముల్
గలుగగజేయు తావక సుఖంకర సుందర దర్శనమ్ము పం
కిల మగు జీవితమ్మునకు కేవల తారక మౌచు నిల్చు ను
జ్జ్వల దశ గూర్చు నిక్కముగ సంయమి సంస్తుత వేంకటేశ్వరా!

కరములు యుష్మదీయ పదకంజ సమర్చన కంచు నెంచి యే
నరుడు చరించి పూజల నొనర్చునో! నిత్యము వాని గుండె మం
దిర మగు ధర్మ భావనకు దివ్య పరిశ్రమయందు భవ్య సం
స్థిర ఫలదాయక మ్మగును దేవ సమస్తము వేంకటేశ్వరా!

కాదనువారు లేరనెడి గర్వముతో విహరించి క్రిందునున్
మీదును గాన కెవ్వరిని మెచ్చక పెద్దల ధిక్కరించి మ
ర్యాదకు దూరులై తిరుగునట్టి వివేక విహీను డక్కటా!
నీ దయ కెట్టు లర్హు డయి నిల్చును, గెల్చును వేంకటేశ్వరా!

నాదము గూర్చు నీ మధుర మోహన రూప విలాస లీల ఆ
హ్లాద మొసంగు నీ సురుచిరాస్య కళాత్మక దీప్తి నిత్య సూ
ర్యోదయ మట్లు నీ రసవ దుజ్జ్వల సన్నుతి సుప్రభాతమై
మేదిని పొంగజేయును తమిక్ ఘటియించుచు వేంకటేశ్వరా!

సంపము లొసంగి మా సుఖ శుభమ్ముల పెంపొనరించు స్వామి నీ
కరుణ లభింప జేసి త్రిజగమ్ముల గాచు ప్రభూ! విలాస భా
సుర చిర రూప వైభవము సుందర మోహన దృశ్య మౌచు నె
న్నరి హృదయమ్ములందు నవ లాస్య మొనర్చుచు వేంకటేశ్వరా!

తోడుగ వెంట నిల్చి దయతో నడిపించెడి తండ్రివైన నీ
ఒడన నిర్విచారముగ నిల్చిన వారి సమస్య లన్నియున్
వాడవె! వీడిపోవె భువనమ్ముల నేలెడి దేవ! నేను నీ
వాడ! కటాక్ష మాలల శుభమ్ముల బ్రోవుము వేంకటేశ్వరా!

*                    *                    *

తేనియ లూరు కైతలను తెచ్చి, భవ న్మహనీయ గాథలన్
గానము జేయ బూనుకొని కమ్మని మంజుల కావ్య ధోరణిన్
బూనికతో విశిష్ట రస ముగ్ధ పథమ్మున భక్తి తోడ 'రా
మానుజ కీర్తి కౌముది' కృతార్థత గాంచుము వేంకటేశ్వరా!



# వ్య ప్రబంధములు - సంగీత సాహిత్యములు

విద్యా భూషణ - కవితా విశారద

**శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు**

*శ్రీరామానుజ కీర్తి కౌముది సంపాదకులు*

❋

" నిత్యానవద్య మధురైః ద్రవిడ ప్రబంధైః
వేదాన్ వివర్తితవతా మవతీర్య లోకే
ఆ ద్య మంధ తమసం పరిహర్తు మారాత్
తాన్ దివ్యసూరి తిలకా ననిశం భజామః, "

## నాలాయిర దివ్యప్రబంధ వైశిష్ట్యము

ఆళ్వారుల దివ్య ప్రబంధములు కేవలము భక్తి ప్రచార కోద్యమమునకు మూల గ్రంథములుగా మాత్రమె గాక, ఉత్తమ వ్యములుగా కూడ విఖ్యాతి నార్జించినవి ఆ కావ్యములందు అనల్ప గాఁ గల కవితా శిల్పము నవలోకించి, అందలి వైశిష్ట్యమును హించిన రసజ్ఞు లందఱును - ఆళ్వారుల సహజ సాహిత్య సంపదను గ్డి కొనియాడుచు, మహా కవులైన ఆ యాళ్వారులకు భక్తి పత్తులతో జోహారు లర్పించుచున్నారు

" నైసర్గికీ చ ప్రతిభా శ్రుతంచ బహు నిర్మలమ్
అమంద శ్చాభియోగోఽస్యాః కారణం కావ్యసంపదః[1] ",

సహజ సిద్ధమైన ప్రతిభ, బహుముఖమైన శాస్త్ర జ్ఞానము, స్తృతమైన కార్య దీక్ష అనునవి మూఁడును - కావ్య నిర్మాణ

---

కావ్యాదర్శము 1 103

మునకు సంపదలు కాఁగల వని ఆలంకారికుల యభిప్రాయము కావున, ఆళ్వారు లట్టి సంపదలు సమృద్ధిగాఁ గలవారు కనుకనే, ఉత్తమ కావ్యములను సృష్టింపఁగల్గి రని స్పష్ట మగుచున్నది

ఆళ్వారుల కావ్య వైశిష్ట్యమును మనము సంపూర్ణముగ గ్రహింపవలె నన్న, ఆ కావ్యములందలి సంగీత సాహిత్య విశేషములను సమగ్రముగా సమీక్షింపవలసియుండును కాని, అట్టి విపుల సమీక్షకిట తావు లేదు కావున, ప్రస్తుతము అట్టి విశేషములను కొన్నింటిని మాత్రము పరామర్శించి, వాని సౌరభము నొకింత గ్రహింతము గావుత।

## ఆళ్వారుల కావ్య సౌందర్యము

## భారతీయ సంగీత సౌరభము

పరిమళముచే పుష్పము ప్రకాశించునట్లు, గీతాత్మకతతో కావ్యము శోభించును మనస్సునందలి సుకుమార భావములను వెలువరించుటకు మానసికములైన వివిధ వృత్తులచే, సుఖ దుఃఖములకు సంబంధించిన అనుభూతులు కాలక్రమమున తీవ్ర తమములై, అనేక భావములను కల్గించును అట్టి భావ తరంగములందలి పారుష్యము కాలుష్యము క్షాళితములు కాఁగా - మనస్సు నిర్మలమై, ప్రశాంతమై అందు పవిత్ర భావము లుదయించును అట్టి భావముల సంఘర్షణ వలన కవి కంఠము నుండి - కల కలారావముతో - స్వారస్యగా గీతము బయల్వెడలి, మహత్తరమైన ఒకానొక దివ్య సందేశమును లోకమున కందించును ఆ సందేశము కలకాలము కర్ణపుటములలో ప్రతిధ్వనించుచు, సమాజమునకు మేలు చేకూర్చును

ప్రాచీన కాలము నుండియు తమిళ వాఙ్మయమున గీత కావ్యమునకు మిక్కిలి ప్రాముఖ్య మున్నది విశిష్టమైన ఒకానొ

...త ప్రక్రియ చిరకాలమునుండియు తమిళ కవులకు అభిరుచిగా ...డుటయే ఇందులకు కారణము కావుననే 'శిలప్పదికారము'లో - ...త సంబంధమగు సాధన సామగ్రి విశేషముగా వర్ణింపబడినది. ...ను - అట నట కొన్ని గీతములు సైతము పొందుపఱుపబడినవి. గీతముల ప్రక్రియకు 'ఇశై పాట్టు' అని పేరు అనగా - 'రాగ ...లములతోఁ గూడిన గీతము' అని యర్థము

పూర్వము సంగీత సంబంధముగా 'పారిభాషిక శబ్దావళి' కూడ ...ి ఉండెడి దనియు, దానికి - అటు పిమ్మట విద్వాంసులు వ్యాఖ్యా...లు వ్రాసి రనియు 'శిలప్పదికారము' వల్లనే తెలియవచ్చుచున్నది ... వాద్య యంత్రములు, తమిళ గీత ప్రక్రియ ననుసరించి సమకూ...బడిన వివిధ రాగ తాళములు - 'శిలప్పదికారము'న వివరింపబడి... కావున, ఆళ్వారులకంటెను పూర్వమే తమిళమున గేయ కావ్య...ష్ట్లు వ్యక్త మగును

ఆళ్వారులు తమ కావ్యములలో - ప్రాచీన గీత పద్ధతినే అను...విరి వారి కవితలలో అన్నిటికంటెను ముఖ్యముగా గేయత్వ...డుటయే గొప్ప విశేషము. ఆ మహనీయులు ఆ యా ప్రాంతము... పర్యటించుచు, భక్తి ప్రబోధకములైన తమ పాశురములను ...ము చేయుచు, ప్రజలలో భక్తి భావమును పెంపొందింపఁ జేసెడివా...రు, ప్రజలుకూడ వారి పాశురములఁ బాడుచు, ఆత్మానందము...చుండెడివారనియు ఆళ్వారుల చరిత్రాంశముల మూలమున తె...లియుచున్నది ప్రసిద్ధరాళ్వారులలో నొకరగు తిరుప్పాణాళ్వారులు ...జముగ 'పాణ' జాతికిఁ జెందినవారు ఆ జాతికి కేవలము సంగీతమే ...ృత్తమైన వృత్తివిద్య. 'పాణ' అనఁగా - 'గానము' అని యర్థము ...న, ఈ 'పాణ' శబ్దము వారి యెడ సార్థకమై యమరినది. ఈ ...ప్పాణాళ్వారులకు 'గాయక సార్వభౌమ' అను నొక బిరుదము కలదు

నాథమునులు ఆళ్వారుల పాశురములను సంకలనము గావించి, వానికి రాగ తాళములను సమకూర్చి రని 'గురుపరంపరా ప్రభావ' మను గ్రంథము వలన తెలియుచున్నది ఆ పాశురములు వేద ఋక్కు-లతో సమానము లగుటచే, సహజముగా సంగీతాత్మకములై సంశోభిల్లుచుండును కావున, ఆ గీతములు దేవ గాన శైలికిఁ జెందినవిగా నాథమునులు సంభావించి, ఆ పాశురములను ఆ రీతిగనే వైష్ణవాలయములలో గానము చేయవలెనని నిర్ణయించిరి వైష్ణవాలయములలో నిట్లు ఆళ్వారుల పాశురములను గానము చేయువారే 'అరయరులు' అను పేర వ్యవహరింపబడుచున్నారు ఆ గాయకులు వైష్ణవాలయములలో మండపములం దాసీనులై, శ్రీ స్వామివారికి జరుగు ఆరాధనాది సమయములలో - ఆళ్వారుల పాశురములను గానము చేయుచుందురు. ఆలయములలో ఉత్సవ సమయము లందును, పర్వ దినము లందును ఆళ్వారుల కావ్యములందలి కొన్ని ముఖ్యమైన పాశురములను ప్రత్యేకముగ గానము చేయుచుండుట పరిపాటి జననము, వివాహము, అంత్యేష్టి మన్నగు సందర్భములలో - వైష్ణవ గృహములందును ఆళ్వారుల పాశురములు కొన్ని గానము చేయఁబడుచున్నవి ఆ పాశురములు గీతములుగా నున్నందుననే ప్రజానీకముపై విశేష ప్రభావము ప్రదర్శింపఁగల్గిన వని ఇందుమూలమున తెలియుచున్నది

ఆళ్వారుల పాశురములకు నిర్ణయింపఁబడిన రాగ తాళము లన్నియు సంగీత శాస్త్ర నియమముల కనుగుణముగా నున్న వని రాణే విద్వాంసులు సంభావించిరి కావున, ఆ పాశురములందలి సంగీత సౌరభము నొకింత గ్రహింతము గావుత!

**రాగములు** - యమునా కల్యాణి, నాట, అపుహూప, ధన్యాసి, నీలాంబరి, మోహన, మలహరి, అఠాణా, భూపాల, దేశి, అసావేరి, బిలహరి, తోడి, కేదారగౌళ, ఆరభి, శంకరాభరణము,

రంగ, భైరవి, కల్యాణి, శ్రీ, కాంభోజి, కహాన, పంతువరాళి, 'రాష్ట్ర, సావేరి, బేగడ, సురటి, కమాసు, గాంధారి, నాదనామ యు మొదలైనవి

**తాళములు** - అట తాళము, ఆది తాళము, రూపక ాళము, త్రిపుట తాళము మున్నగునవి

ఇయ్యవి - ఆళ్వారుల పాశురములలో కొన్నింటికి ఆ యా ందర్భముల ననుసరించి నిర్ణయింపఁబడిన రాగ తాళములు

భారతీయ సంగీత శాస్త్రమందలి రాగములు - భావములతో, సములతో మిక్కిలి సన్నిహిత సంబంధము గల్గి యుండును కనుక, యా భావములను, రసములను ప్రస్ఫుటింపఁ జేయుటకై, ఆళ్వా ల పాశురములకు - సంగీత శాస్త్రము నందు సుప్రసిద్ధము లగు రాగ ాళములు నలువదింటికిపైన సమకూర్పఁబడినవి అదియునుఁగాక, ఆ ాశురము లందలి కొన్ని విశిష్ట భావములను స్పందింపఁజేయుటకు ప్రత్యేకముగ కొన్ని క్రొత్త రాగములు కూడ ప్రయోగింపఁబడినవి యినను - ఈ రాగ తాళము లన్నియు ఆళ్వారుల పాశురములకు గియున్నట్లు విద్వాంసు లంగీకరించిరి

సంగీతములో నాదమునందియే సుఖము, దుఃఖము, హర్షము, షాదము, ఆశ, నిరాశ మున్నగు అనుభూతులు స్పందించును నాద ప్రభావము వల్లనే హృదయమునందలి హర్ష విషాదములు ప్రజ్వ ల్లును వివిధ రాగములవలన శ్రోతయొక్క హృదయమున వివిధ రస ములు అనుభూతికి రాగలవని దీని భావము[2] రాగము రసమునకు

---

'Ragas are eloquent Vehicles of emotion with a limitless but in articulate power of expression A genius bends then to his purpose and make them carry his message ''

— '*Ragas of Cornatic Music*', *P 161*

— **Ramachandran**

సంబంధించిన దని భావించుట కిదియే కారణము సంగీత శాస్త్రము ననుసరించి ఏ యే రసములకు ఏ యే రాగము లుపయుక్తము లగునో - ఆ యా వివరము లు ఈ క్రింద పొందుపఱుపఁబడుచున్నవి -

| రసములు - | రాగములు - |
|---|---|
| శృంగార రసము | వసంత, ఖమాసు దేవగాంధారి, సావేరి, భైరవి |
| కరుణ రసము | యదుకుల కాంభోజి ముఖారి, అసావేరి, ఆహిరి, హుసేని |
| హాస్య రసము | ముఖారి ఆరభి |
| అద్భుత రసము | బిలహరి |
| శాంత రసము | సామ |
| బీభత్స రసము | పంతువరాళి |
| భక్తి రసము | శహన, పూరీ కల్యాణి |

సంగీతశాస్త్ర సంబంధము లగు పై నియమముల ననుసరించి ఆళ్వారులు శృంగార రసమునకు సావేరి - భైరవి రాగములను, కరుణ రసమునకు ముఖారి - ఆసావేరి - హుసేని రాగములను, అద్భుత రసమునకు బిలహరి రాగమును, భక్తి రసమునకు శహన - పూరీ కల్యాణి మొదలగు రాగములను ఉపయోగించిరి, అరణ్యము నుండి తిరిగివచ్చు కృష్ణుని సౌందర్యమును చూచినంతనే ముగ్ధలైన గోపికల చిత్తవృత్తులను పెరియాళ్వారులు వర్ణించుచు, సంయోగ శృంగారమున కుపయుక్తమగు భైరవి రాగములో నొక పాశురమును రచించిరి సంగీత సౌరభముతో రస స్ఫోరకమై యొప్పారు ఆ పాశురమును పరిశీలింపుఁడు -

భైరవి రాగము - ఆది తాళము

" తళై కళుమ్ తొంగలుమ్ తదుమ్బి యెఙ్గుమ్
తణ్ణుమై యెక్కమ్ పత్తర్ తాళ్ పేలి
కుళల్ కళర్ కీళ ఱు మాకి యెఙ్గుమ్
కోవిన్దన్ వరుకిన్ఱ కూట్టమ్ కణ్డు
మళై కొలో వరుకిన్ఱ తెన్ఱు శొల్లి
మఙ్గైమార్ శాలక వాశల్ పత్తి
నుళై వనర్ నిర్పనరాకి యెఙ్గుమ్
ఉళ్ళమ్ విట్టూణ్ మఱన్దొళి న్దనరే 3 "

భక్తి రసమును ప్రస్ఫుటింపఁజేయుటకు భక్త కవులు శహానా రాగమును తఱచుగా నుపయోగించుట పరిపాటి ఈ శహానా రాగము భక్తి రసమును పరిపుష్టము గావించి, శాశ్వతా స్పదింపఁ జేయఁగలదని వారి యభిప్రాయము ఈ కారణము వల్లనే తొండరడి ప్పొడి యాళ్వారుల 'తిరుమాలై' దివ్య ప్రబంధమునందలి పాశురము లన్నియు శహానా రాగము తోడనే గానము చేయఁబడుచున్నవి మచ్చుకు ఒక పాశుర మిట చాలును

శహానా రాగము — రూపక తాళము

" పచ్చై మామలై పోల్ మేని పవళవాయ్ కమల చ్చెఙ్గణ్
అచ్చుదావ మరరేఱే ఆయర్ తమ్ కొళున్దే యెన్ఱుమ్
ఇచ్చువై తవి రయాన్పోయ్ ఇన్దిరలోక మాళుమ్
అచ్చువై పెరినుమ్ వేణ్డేన్ అరఙ్గమాన గరుళానే 4 "

రాత్రిం బవళ్ళలో ఎనిమిది యామములకును - ఆ యామ సమ యములందలి వాతావరణము ననుసరించి అనుసరించు రాగములు

3 పెరియాళ్వార్ తిరుమొళి 3-4 1
4 తిరుమాలై 2

సంగీత శాస్త్రమున వివరింపఁబడినవి ఉదా: కాలీనములైన రాగ ములలో - సుకుమారములైన స్వరము లుండును సూర్యోదయ సమ మందును, అటు పిమ్మటను గానము చేయు రాగములలో - శ స్వరము లు, తీవ్ర స్వరము లు విశేషముగా నుండును అసావేరి, తో మొదలగునవి ప్రాతః కాలీన రాగములుగా - పూరీ కల్యాణి, ( మొదలగునవి సాయంకాలీన రాగములుగా - కల్యాణి, కేదారగౌ భూపాల మొదలగునవి రాత్రివేళ గానము చేయఁదగిన రాగములు శాస్త్రములు నిర్దేశించుచున్నవి ఆళ్వారుల పాశురములలో నుపయో గింపఁబడిన రాగములను పరిశీలించిన యెడల, వారు సమయ సంద ముల ననుసరించియే ఆ యా రాగములను సమకూర్చి యున్న స్పష్టము కాఁగలదు కావున, ఆళ్వారులు శాస్త్రీయ సంగీత నియ మ లను సైతము పాటించి యుండి రనియే వ్యక్త మగును

## ఆళ్వారుల కావ్యములు - వాని రూప లావణ్యములు

కవి యైనవాఁడు - తన యుగమునందలి ప్రజా జీవితము దృష్టిలో నిడుకొని, తన హృదయాంతరాళమునందలి యనుభూతుల ప్రేరేపింపఁబడు సిద్ధాంతముల కనుగుణముగా - తన కవితకు శా రూపమును నిర్ధారణ చేయును కవిశేఖరు లగు ఆళ్వారులును తమ తమ యుగములలోఁగల జనతను తమ తమ దృక్పథములఁ నిడుకొని, తమ తమ కావ్యములకు రూప కల్పనము గావించి ఆ సందర్భమున వారు - ఆ నాఁటి పరిస్థితులనుఁబట్టి, తమ తమ కా ములలో - గీతమునకే ప్రాముఖ్య మొసంగిరి,

'అసలు' - కవియొక్క భావనా పరంపరలే గీత కావ్యమున ఆత్మ తుల్యములు కావున, అట్టి భావనా పరంపరల తీవ్రతన బట్టియు, ప్రబలతనుఁ బట్టియు కావ్యము తన తమ భేదములత శ్రేష్ఠమైనదిగా ప్రకాశించును గీతి కావ్యములలో - ముఖ్యము

కవియొక్క భావనా ప్రపంచము స్పష్టముగాఁ గన్పట్టును. అందు జీవితమునకు సంబంధించిన బాహ్యక్రియా కలాపములు గౌణముగ నుండును.

భావ ప్రకటనమునకు శాస్త్రములలో రెండు పద్ధతులు నిర్దేశింపఁబడినవి. కవి - తన భావములను యథాతథముగ సూటిగా ప్రకటించుట ఒక పద్ధతి. అట్లు గాక వస్తువునందుఁగాని, ఒక వ్యక్తియందుఁగాని తన భావములను ఆరోపించుట మరియొక పద్ధతి. ఆళ్వారుల కావ్యములలో ఈ రెండు పద్ధతులును స్పష్టముగా గన్పట్టును. మొదటి పద్ధతిలో - వారు తమ ఇష్టదైవమునకు స్వీయ భావములను నేరుగా నివేదించిరి. రెండవ పద్ధతిలో - తాము ఒక గోపికనుఁగాని, ఒక నాయికనుగాని మధ్యగా నిడుకొని, తమ హృదయమునందలి వ్యాకుల భావమును వ్యక్తీకరించిరి. ఇట్లు ఆళ్వారుల గీతి కావ్యములు - శుద్ధ గీతి కావ్యములుగా, ఆఖ్యానాత్మక గీతి కావ్యములుగా రెండు రూపములు ధరించియున్నవి.

### శుద్ధ గీతి కావ్యము -

ఆళ్వారుల ఆత్మ నివేదన సంబంధములగు పాసురములు శుద్ధ గీతి కావ్య శ్రేణికిఁ జెంది, వానిలో వారి భావనా పరంపరలు బాగుగా అభివ్యక్తము గావింపఁబడినవి. ఆ కావ్యములను పరిశీలించునపుడు - ఆత్మజ్ఞానము, నామ మహిమ మున్నగు విషయములను ఆళ్వారులు మనకు స్వయముగా బోధించుచున్నట్లు అనుభూతి కలుగును. ఇట్టి శిష్ట విషయములను స్పష్టీకరించు భాషయు - సరళముగను, సుబోధముగను ఉండుట మరియొక గొప్ప విశేషము. ఆ పాశురములలోఁ గన్పట్టు దైన్యమునందును, ఆత్మ నివేదనమునందును తాత్త్విక [illegible]రుము లనేకములు అంతర్గతములుగా నున్నవి. దైన్యముతోఁ గూడి

ల స్థానము గౌణము. రాధ, కృష్ణుడు, గోపికలు అను వారి శృంగారానము లందు ప్రాముఖ్యము పొందినవి. ఈ భావములు పరిపూర్ణ స్వతంత్రములై, రస స్ఫోరకములై సముల్లసించుచుండును. తమ విరహ వేదనను వ్యక్తీకరించుటకు ఆళ్వారులు రాధను, యశోదను ...ద్దుగా నిడుకొని, తమ యొక్క వేదనమును వారి మాటల మూలమున వెలువరించిరి. ఇట్టి విరహ రూపము ఆళ్వారుల పాశురములలో స్పష్టముగా గానున్నను, ఆ మహనీయు లనుసరించిన విధానము మాత్రము అపూర్వమైన దనుట నిర్వివాదాంశము. అన్ని ప్రకాశనములు ప్రత్యక్షము గాకున్నను - వివిధ పాత్రల యొక్క భావములందే ఆళ్వారులు తమ భావనా పరంపరలను మేళవించి, ఆ పాత్రల మూలమున వాని ధ్వనింపజేసిరి. గోపికల పల్కులందే ఆ మహనీయుల భావములు స్ఫుటించుచు, పాఠకులను - శ్రోతలను గిలిగింతలు పెట్టుచుండును. నమ్మాళ్వారు లొక పాశురములో - నాయిక (గోపిక) యొక్క విరహ వేదనను వర్ణించుచు, ఆమె తన విరహ వ్యథను గద్గద స్వరముతో ట్లు వెల్లడించిరో చూడుడు -

"ప్రపంచ మంతయు నిద్రించుచున్నది. అంధకార మంతటను వ్యాపించినది. నిశా సమయము గడచిపోవుచున్నది. ప్రియుని వియోగముచే గల్గిన పరితాపమువలన హృదయ సంచలనము వృద్ధి యగుచున్నది. కాని, ఇంతదనుక నా ప్రియుడు రాడయ్యెను. కావున, కెట్టి దశ సంప్రాప్తింపనున్నదో!"[6]

---

"ఊరెల్లామ్ తుఞ్జి ఉలకెల్లామ్ నళ్ళిరుళాయ్
నీరెల్లామ్ తేఱి ఓర్ నీళవాయ్ నీణ్డదాల్
పారెల్లామ్ ఉణ్డ నమ్పెరుమాన్ వారానాల్
ఆరెల్లే వల్వినైయేన్ ఆవిగాప్పారినియే"

— తిరువాయ్మొళి (5-4-1)

ఇట్టి భావనా పరంపరలు ఆళ్వారుల ఆఖ్యానాత్మక గీతి కావ్యములలో అధికముగాఁ గన్పట్టును. భగవంతుని తమ ప్రియునిగా భావించి, తమ్ము నాయికగాఁ దలంచుకొని, ఆ పరమాత్మయందు తమకుఁ గల్గిన విరహ వేదనను పై రీతిగా ఆళ్వారులు తమ పాశురములలో వ్యక్తీకరించిరి. ఇట్టి పాశురములు మధుర భక్తికి మచ్చు తునుకలుగా మనము భావింపవచ్చును.

### ప్రబంధ కావ్యము – ఖండ కావ్యము –

ప్రబంధ కావ్యములలో – ఏదేని ఒక కథా వస్తువు ప్రధానముగా నుండును. అందు పూర్వాపర సంబంధము విధిగా నుండును. ప్రధాన కథా కథనములో – ప్రకృతి వర్ణనమునకు, దేశ కాల చిత్రణమునకు సముచిత స్థాన ముండును. ఇట్టి ప్రబంధ కావ్యము విషయ ప్రధానము గల దగుటచే, ఆ విషయమునకు వివిధ వర్ణనములు అంగములుగా శోభిల్లు చుండును. ఇయ్యది – 'మహా కావ్య' మనియుఁ 'ఖండ కావ్య' మనియు రెండు తెఱంగులుగా నుండును. మహా కావ్యమున నేదేని ఒక జీవిత వృత్తము సమగ్రముగా వర్ణింపఁబడును. ఖండ కావ్యమున జీవిత వృత్తాంతమునందలి ఏదేని ఒక యంశము మాత్రమే వర్ణింపబడును.

పన్నిద్దరాళ్వారులలో – ఏ యొకరును మహా కావ్యమును రచించి యుండలేదు. వారిలో కొందఱు కృష్ణునియందు ప్రగాఢమైన భక్తి భావముగలవా రున్నారు. అట్టివారిచే రచింపఁబడిన కృష్ణభక్తి కావ్యములలో – భావావేశము బాగుగా అభివ్యక్త మగుటకు గీతములే చక్కఁగా ఉపయుక్తములైనవి. మహా కావ్య నిర్మాణ సృష్టివలె, కృష్ణ భక్తి గల కవుల సృష్టి – విషయ గతము కాదు. ఏ యొక మహా సందేశమునుఁగాని, ఏ యొక జీవిత వృత్తాంతమునుఁగాని ప్రతిపాదించుట వారి లక్ష్యము కాదు. వారి హృదయము కృష్ణలీలలందే చాలవఱకు

కేంద్రీకరింపబడినవి. అనుకనే వాఙ్మయ భావనా పరిధు లన్నియు – వారి పాశురములలో ప్రతిబింబింపబడి[illegible] కావ్యమునకు [illegible] వస్తు పరిచయము, సమన్వయ దృష్టియు ఆవశ్యకములు ఇందువలన, ఆ హృదయమునందలి భావనా పరంపరలు మహా కావ్యమున ప్రతిబింబింపనేరవు ఆళ్వారులు మహా కావ్యమును రచింపకుండుటకు ఇదియే కారణము

ఖండ కావ్యమున జీవిత వృత్తమునందలి ఏదో యొక భాగమో చిత్రింపబడును ఇందు చరిత్రాంశములు పరిపూర్ణముగా నర్థింపబడకున్నను – ఇందలి కథా భాగమునకు మాత్రము ప్రాధాన్యము కలుగదు ఇందు ప్రాసంగిక కథలు మిక్కిలి తక్కువగా నుండును ఇట్టి ఖండ కావ్యమున కథాత్మకతతో బాటు – గీతాత్మకతకు ప్రాధాన్య ముండును ఆండాళు రచించిన 'తిరుప్పావై', నమ్మాళ్వారుల 'తిరువిరుత్తమ్', తిరుమంగై యాళ్వారుల 'పెరియ తిరుమొళి' దివ్య ప్రబంధములు ఈ ఖండ కావ్యముల కోవకే చెందియున్నవి

**జానపద గీతములు :–**

ఆళ్వారులు తమ తమ ప్రాంతములలో ప్రచురితము లగు జానపద గీతములను తమ తమ రచనలలో పొందుపఱచియున్నారు ఈ గీతములు సహజ సుందరములై, సుకుమార భావ సమన్వితములై, ఆహ్లాద జనకములుగా నుండును ఇట్టి గీతములలో – గ్రామీణుల [illegible] కన్నులకు గట్టినట్లు చిత్రీకరింపబడినది ఈ గీతములకు వ్యావహారిక భాషయే ఉపయోగింపబడినది కృష్ణ లీలలను వర్ణించుటకు జానపద గీతములే మిక్కిలి ఉపయుక్తములని ఆళ్వారులు తలంచి విస్తృతముగా – వారి కావ్యములందు జానపద గీతములే సందర్భోచితముగా పొందుపఱచబడినవి. ఈ గీతములు [illegible] భాగము

...తో, సాహిత్య సంపత్తితో రచింపఁబడినందునచే పండిత పామర ...కము లగుచున్నవి.

...దేశమున జోల పాటలు, లాలి పాటలు మొదలగు ...గీతము లనేకములు సుప్రసిద్ధములై యున్నవి అట్టి ...

జో అచ్యుతానంద! జో జో ముకుందా!
రావె పరమానంద రామ గోవిందా। ॥జో జో॥

తొలుత బ్రహ్మాండంబు తొట్టె గావించు
నాలుగా వేదాలు గొలుసు లమరించి
ఒరపైన ఫణిరాజు పాను పమరించి
చెలియ బోలికలోన చేర్చి లాలించి ॥జో జో॥

ఏడువకు నా తండ్రి! యేమి కావలెనో।
మేలైన వారములు మెడను వేసెదను
దోబూచు లాడేవు! దొంగి చూచేవు!
గొల్లవా రిళ్ళన్ని కొల్లి గొట్టేవు! ॥జో జో॥

...జోలపాట మిక్కిలి సుప్రసిద్ధమైనది ఈ జోలపాటవలెనే ...ళ్వారులు తమిళమున కొన్ని జోలపాటలను రచించి యున్నారు ...ఁగు జోలపాటలలో - 'జో జో' అను శబ్దము పునరావృత మగు ...తమిళమునందును - 'తాలేలో' అను శబ్దము వీరి జోలపాట ...పునరావృత మగుచుండును పెరియాళ్వారులు రచించిన ఇట్టి ...పాటలలో - అన్నిటికంటెను ముఖ్యముగా - కృష్ణుని ఊయలలో ...యశోద పాడిన జోలపాట యొకటి అధిక ప్రచారములో ...దది ఆ పాటలలో కొందటి సంక్షిప్త లిపి -

...డిక్కట్టి ఎయిర మిద్దై కట్టి
...పొన్నాల్ శెయిదవణ్ణ చ్చిఱు తొట్టిల్

పేణి యునక్కు ప్పిరపన్ విదు తన్దాన్
మాణి క్కుర్ళనే తాలేలో - వైయ తాళన్దానె తాలేలో "7

పశువులను, పక్షులను ప్రబోధించుచు — ఆళ్వారులచే రచింప
పాశురములు జానపద గీతము లనియే భావింపవచ్చును తిరు
ఈ యాళ్వారుల పాశురములలో - అనేకము లిట్టి జానపద గీత
నేటికిని తమిళ ప్రదేశమున ప్రచారమం దున్నట్లు తెలియు
ది స్వప్నసీమలో తనను కృష్ణుడు వివాహ మాడిన వృత్తాంత
వ్యక్తీకరించుచు — ఆండాళ్ రచించిన పాశురములు జాన
గీతములవలెనే గానము చేయబడుచున్నవి మచ్చుకు ఒక
రము -

"వారణ మాయిరమ్ శూళ వలమ్ శెయిదు
వారణ నమ్బి నడక్కిన్ఱా నెన్ఱెదిర్
పూరణ పొఱ్కుడమ్ వైత్తుప్పుఱ మెఙ్గుమ్
తోరణమ్ నాట్టక్కనా క్కణ్డేన్ తోళీ నాన్ "8

**క్తకములు :-**

ఆళ్వారుల ముక్తకము లు సర్వ సాధారణముగా తెలుగులో
ువులవలె నుండును ఏ పద్యమున కాపద్యమే పరిపూర్ణార్థ
కొంగూడి యుండుట - చాటు పద్యముల ముఖ్య లక్షణము. గీతి
వ్యములకును, ముక్తకములకును, చాలవఱకు పోలిక కానవచ్చును
, ఈ రెంటికిని మౌలిక మగు భేదము కలదు అట్టి భేదము
లో స్పష్టముగాఁ గన్పట్టును సాధారణముగా ముక్తకములందలి
ద్యములకు పూర్వాపర సంబంధము ఉండదు. ముక్తక కావ్యము

పెరియాళ్వార్ తిరుమొళి 1 8-4
నాచ్చియార్ తిరుమొళి, 6 – 4

నకు విభావానుభావాదుల పరిపుష్టి ఆవశ్యకమైనను, రసము పరిపూర్ణముగా నుండవలసివచ్చినను పూర్వాపర సంబంధములు కల్పింపఁబడవు గీతి కావ్యములో భావములను అభివ్యక్తము గావించు సందర్భమున గాన వచ్చు ఆవేశము ముక్తకములలో నుండదు ముక్తకములలో కళా పక్షమునకే ప్రాధాన్య మధికముగా నుండును చమత్కృతి ఉక్తి వైచిత్ర్యము మున్నగువానిని ప్రదర్శించునపుడు - కవి మిగుఁ జాగరూకత వహించును ఇవి యన్నియు కళా పక్షమునకుఁ జెంది వగుటచే, కవి యొక్క ప్రతిభావిశేషములను చాటునవిగా నుండును గీతి కావ్యములో భావోద్రేకము, ఆత్మ నిష్ఠ అనునవి రెండును ప్రాధన్యము వహించును కాని, ఇవి ముక్తకములలో - గౌణముగ ఉండును. ఇదియే ఈ రెంటికినిఁ గల సామాన్య భేదము

ఆళ్వారుల దివ్య ప్రబంధములలో - 'ఇయఱ్పా' విభాగవ నందలి రచనలలో - ముక్తకములే అధిక సంఖ్యలో కానవచ్చున వీనికి ఇతర పాశురముల వలె రాగాదులు నిర్దేశింపఁబడ యుండలేద ముదలాళ్వారుల దివ్య ప్రబంధములందును, నమ్మాళ్వారుల 'తిరువిఁ త్తమ్', తిరుమళిశైయాళ్వారుల 'తిరుచ్చన్ద విరుత్తమ్', తొండర ప్పొడియాళ్వారుల 'తిరుప్పళ్ళి యెళుచ్చి' దివ్య ప్రబంధము లందుఁ ఉపయోగింపఁబడిన వృత్తములు ముక్తక కావ్యమునకు సంబంధిం యున్నవి వీనిలో కొన్ని పాశురములు పూర్వాపర సంబంధము గలి యున్నట్లు స్థూలదృష్టికిఁ గన్పట్టకున్నను, సూక్ష్మదృష్టికి మాత్రమ వాని పూర్వాపర సంబంధములు గోచరించుచునే ఉండును వీనిఁ కొన్ని పాశురములు రాగ తాళ బద్ధములై యున్నందున, అవి 'రా తాళ బద్ధ ముక్తకము' లని వ్యవహరింపఁబడుచున్నవి కాని, ( యన్నియు ముక్తకములే యయ్యును - గీతి కావ్యములై ప యెక్కువ తొగ్గి యున్నవి

## జాతీయములు - లోకోక్తులు

లోకమున అసంఖ్యాకముగాఁ గల అనుభవ పూర్వకమైన యంశము నీతులు వ్యావహారిక భాషలో - చిన్న చిన్న వాక్యములుగా సంపాదింపఁబడి, లోకోక్తు లనియు, జాతీయము లనియు రెండు విధములుగా ప్రచలిత మగుచున్నవి. వీనిలో - లాక్షణికత, అర్థ గాంభీర్యము, ఉక్తి వైచిత్ర్యము మున్నగునవి అద్భుతముగా నుండును. మనసు, ప్రాణిమను సంతరింపఁజేయుటలో - ఇయ్యవి గొప్ప ప్రాముఖ్యము వహించి యున్నవి. మానవ సమాజమునకు చిరకాలముగాఁ గల అనుభవములను సరళమైన సూక్తులతో - సూటిగా మనకు బోధించుచుండుటయే ఇందులకు కారణము అదియునుఁగాక, ఆధ్యాత్మిక జ్ఞాన దాయకములుగా కూడ విఖ్యాతి నార్జించినవి. కావున, ఇయ్యవి దేశ కాల సీమల నతిక్రమించియు ప్రచలితములు కాఁగల్గుచున్నవి. మానవ హృదయము నాకర్షించు శక్తి గల ఇట్టి జాతీయములు, లోకోక్తులు ఆళ్వారుల కావ్యములలో అనేకములు ప్రయోగింపఁబడినవి.

జాతీయములు :

(౧) గీటు రాతిపై బంగారము ఒరపిడి చేసినట్లు[9]

(౨) తల్లిని తలంపునకుఁ దెచ్చుకొని దుఃఖించువాఁడు పిల్లవానితో తుల్యుఁడు[10]

---

9 "ఉరైక్కల్ కొణ్డు మెళుకెత్తినాల్ మెయ్ పడిత్తోల్"
— పెరియాళ్వార్ తిరుమొళి 5.4.5

10 "అరుళ్ నినైన్దే యళుంగుళవి అదువేపోల్ ఇరున్దేనే"
— పెరుమాళ్ తిరుమొళి 5.1

(౩) సంగీతము రానివాని పాట వలె [11]

(౪) ఇరు వైపులనుండి - ముందు, మధ్యలో వేయఁబడు మేకులవలె [12]

(౫) పాలలో నేయి వలె.[13]

**లోకోక్తులు :-**

(౧) వంధ్యకు సంతాన సుఖ మేమి తెలియును ?[14]
(తెలియదని భావము)

(౨) ఇరుగు పొరుగు వారితో వైరము మంచిది కాదు [15]

(౩) ఉత్తములైన ప్రభువును దర్శించుట - దైవ దర్శనము తో తుల్యము [16]

(౪) బల మున్నంత వఱకును బంధువులు బలగలవలె రక్షింపఁ గావుదురు [17]

---

"పాణాదార్ పాట్టు" — పెరియ తిరుమొఴి : 11-7-4

ఇరుపాడెరికొళ్ళియినుళ్ ఎఱుమ్బే పోల్ " — పెరియ తిరుమొఴి : 11-8-4

"పాల్ నెయ్యే నెయ్యనిన్ " — తిరువాయిమొఴి : 8 1 7

"మక్కళ్ పెఱాద మలడ వల్లేనేర్ వాళ్ట్గాయ్ ' — పెరియాళ్వార్ తిరుమొఴి : 4-1

"అరుకిరున్దార్ తమ్మై యవి యామెణ్ణాదు దాన్ ' — పెరియాళ్వార్ తిరుమొఴి : 2-8 3

'తిరువుడై మన్నరై క్కాణిల్ తిరుమాలై క్కణ్డేనే ' — తిరువాయిమొఴి : 5-8

'ఇక్కి ...న్దెల్ అప్పెరళ్ణోర్ కువ్వెప్పర్ ' — తిరువాయిమొఴి : 8 7

(౭) పెద్దల కటాక్షముతో లభింపరాని దేమందును ?[8]

(సర్వ సంపదలు సమకూరు నని సారాంశము)

## వర్ణన వైచిత్ర్యము

### ప్రకృతి వర్ణనము

మానవునకు ప్రకృతి ఆదికాలమునుండియు సహచారిగ నే యున్నది. అట్టి సహకృతి అల్పమైనది కాదు. పుట్టినది మొదలు గిట్టుట వరకును గల మానవ జీవిత పరిధిలో - ప్రకృతియు అతనితో కలిసి మెలిసి, అతని భావములను వికసింపజేయుచు, ఆనందానుభవమునకు అవకాశము గల్గించుచునే యున్నది.

విశాలమైన ప్రకృతి ప్రాంగణమున విహరించు కవియే అపూర్వ కావ్యములను రచింపగల్గును. కావుననే -

"ప్రకృతికిన్ కావ్య ప్రణేతక్ కవుల్"

అని, సారస్వత ధర్మ మర్మజ్ఞులు పల్కిరి. ప్రకృతిలో అశేషముగా గల చేతనాచేతనములతో మానవ హృదయమునకు రాగాత్మకమైన సంబంధమును గల్పింపజేయుటయే కవికి కావ్యరచనలో గల ముఖ్యోద్దేశము. కావున, కావ్యములో ప్రకృతి వర్ణనము విడివడుటకు వీలుపడని విషయము.

ఆళ్వారు లీ విషయమును పరిపూర్ణముగ గ్రహించినవారగుటచే, తమ కావ్యములలో అచ్చటచట ఆయా సందర్భముల ననుసరించి, ప్రకృతిని అనేక విధములుగా వర్ణించి యుండిరి. వారు భక్తి

8 "పెరియార్కాట్ పట్టర్కాల్ పెఱాద వయన్ పెఱుమాళ్"

— తిరువాయిమొళి 10-6-10

ప్రచారము గావించుటకు అనేక ప్రదేశములలో పర్యటించినవారగుటచే, భక్తి ప్రబోధకములైన వారి కావ్యము లందును ప్రకృతి వర్ణనము స్వయం ప్రకాశక మయ్యెను. ఇందువలన, ప్రకృతికి సంబంధించిన వర్ణనములు ఆళ్వారుల కావ్యములలో విశేషముగ కానవచ్చును.

## ప్రకృతి చిత్రణములో వివిధ రూపములు

మానవునిలో మేధస్సు, బుద్ధి, అనుభవము, జ్ఞానము సంస్కార ప్రభావముల ననుసరించి, భిన్న భిన్నములుగా నుండును. అట్లే, కవికిని ప్రకృతి విషయకమైన చైతన్యము అప్రయత్నముగా చేర్పడును. అతడు ప్రకృతిని అనేక దృక్పథములతో నాలోకించును. స్వతంత్రమైన భావనాబలముతో దానిని బహు భంగులుగా చిత్రించును. ఒకపుడు ఆలంబన రూపముగను, మఱియొకపుడు ఉద్దీపన రూపముగను అతడు ప్రకృతిని వర్ణించును. ఉద్దీపనమునకు అంతర్గతముగా నుండు ప్రకృతిలో - మానవీయములైన భావములను జోడించుటకై, సంకుచితమైన శాస్త్రీయ పరిభాషలో బంధించుట అతనికి కష్టముగా దోచును. ఒకపుడు కవులు భావములను ఆధారముగా నిడుకొని, భావ జగత్తులో దాని ప్రక్రియను సంవేదనాత్మకమైన దానినిగా చిత్రించుచుందురు. మఱియొకపుడు - మానవీయతనుగాని, మానవ సంబంధమునుగాని చూపియందు ఆరోపించుచుందురు. అంతియ కాదు - మఱియొకపుడు ఉపమాన రూపముగ ప్రకృతి సౌందర్యమునకు ఉపాదానములను అసంఖ్యాకముగ సంపాదించుచుందురు. అట్టి కవుల కావ్యములలో - కల్పిత ప్రయోగము లన్నియు స్పష్టముగా గన్పట్టుచుండును.

సర్వ సామాన్యముగ కావ్యములలో - ప్రకృతికి సంబంధించిన రూపములందు - ఆలంబనము, ఉద్దీపనము, అలంకారము, మానవీ

ణము, నీతి - ఉపదేశము, పరమ తత్త్వము అనునవి ముఖ్యముగ కానవచ్చును

ఆళ్వారుల కావ్యములలో - ప్రకృతికి సంబంధించిన పై రూపము లన్నియు వర్ణింపఁబడినవి అందునను - ఉద్దీపన రూపమునకు ఆళ్వారులు విశేషమైన ప్రముఖ్య మొసంగినట్లు విశద మగును

**ఆలంబన రూపము -**

ఆలంబన రూపమున ప్రకృతి - కవికి సాధనముగాఁ గాక, సాధ్యముగనే సిద్ధ మగును కనుక, కవి - ప్రకృతిని పరిశీలించుటకు ప్రయత్నించును అతని మనస్సు - ప్రకృతిని దర్శించుటయందే నిమగ్న మగును అతఁ డాత్మానందము నంది, ఆ యానందమున లీనుఁడై, మానసికమైన ముక్తావస్థను పొందును

ఆళ్వారుల కావ్యములలో - ప్రకృతికి సంబంధించిన అట్టి ఆలంబన రూపమే విశేషముగ కానవచ్చును తొండరడిప్పొడి యాళ్వారులు ప్రాతః కాలమును ఎంత సహజ సుందరముగా వర్ణించిరో చూతము -

“సూర్యుఁడు పర్వత శిఖర మధిరోహించినాఁడు గాఢాంధకారము దూర దూరగమైనది మాధుర్యమైన ప్రాతః కాలమున, మధుపూరితమైన పుష్ప సముదాయముపై భ్రమరములు ఝుంకారము చేయసాగినవి. ఏనుగుల గుంపులు సముద్రమున ఉవ్వెత్తుగా లేచు తరంగముల వలె, వాలములవంటి తమ చెవులను ఇటు నటు కదలించుచు పోవుచున్నవి కుసుమిత లతా కుంజముల నుండి మంద మారుతము వీచుచున్నది సుందరములైన సూర్య కిరణములు సర్వత్ర వ్యాపించుచున్నవి అందువలన, మినుకు మినుకుగా నుండు నక్షత్రముల కాంతి యంతయు అంతరించినది పోక చెక్కలందుఁగల మొగ్గల

గుత్తులు పగిలి, విడిపోవుచున్నవి పక్షి సముదాయము నుండి కలకలా రావము వినఁబడుచున్నది అందమైన కమలములు విచ్చి, ఎగురుచున్నవి ఆవులను మేపుటకై, అరణ్యమునకుఁ బోవు గోపబాలకుల సమూహమునుండి మురళీ నాదము కూడ వినవచ్చుచున్నది మధురమైన ఆ గీతము యొక్క రాగాలాపనము ఆకాశపథమం దంతటను వ్యాపించినది ఇప్పుడు తెల్లవారినది శ్రీరంగనాథా! ఇఁక మేలుకొనుము "[19]

### ఉద్దీపన రూపము -

ప్రియునిఁ గలియుటకు ప్రకృతి - నాయికను ప్రోత్సహించుచున్నట్లు తిరుమంగై యాళ్వారులు వర్ణించిరి పరిశీలించుడు -

"సాయం సమయమైనది హృదయ రంజకమైన ఈ సమయమున - సౌరభమును వెదజల్లుచు వచ్చు శీతల సమీరణము నాయిక యొక్క వక్షోజములను స్పృశించినపుడు - నాయిక మనస్సులో ప్రియునిఁ గలియుటకు గిలిగింతలు పెట్టుచున్నది "[20]

విరహావేదనతో నిరంతరము దుఃఖించు నాయిక - ప్రకృతితో ఏకాత్మ్యమును స్థాపించును చేతనము, అచేతనము అను భేదమును మఱచి, ప్రకృతిని తన సఖిగాఁ దలంచుకొని, తన యావేదనను సఖీ రూపమైన ప్రకృతికి నివేదించును అప్పుడు ప్రకృతియు - ఆ విరహిణికి

---

19 తిరుప్పళ్ళి యెళుచ్చి 9 నుండి 11 వరకు

20 "వస్తునదకియేన్ - నమ్ పుగుస్దాయ్ పుగుస్దళ్పన్ వణ్ణమ్ ఎన్
శిన్దనైక్కినియాయ్ తిరువే ఎన్నారుయిరే
అన్దిరణియాళ్ అలోగినిం ప్రిరగళ్ కలన్దు అవై [illegible]మ్
శెన్దళల్ ప్పడైయుమ్ తిరునాలియమ్మానే'

— పెరియ . తిరు 3-6-1

అంతరంగిణి యగును. ఆమె ఒకప్పుడు కోయిలతోడను, మఱియొక ప్పుడు భ్రమరములతోడను తన ప్రియుని కడకు సందేశమును బంప యత్నించెను. ఆండాళ్ తన ప్రియునకు సందేశ మందించి రావలసినదని ఒకసారి కోయిలను ప్రార్థించెను[21]. మఱియొకప్పుడు మేఘముల ప్రార్థించుచు - 'విరహిణియైన ఒక అబలను ఈ విధముగా నొప్పించుట న్యాయమా?'[22] అని, తన ప్రియుని అడిగిరండని ప్రార్థించెను

### అలంకార రూపము :-

ఆళ్వారులు ప్రకృతిని అలంకార రూపమునఁగూడ విశేషముగ వర్ణించియున్నారు. ఆ మహనీయులు తమ ఆరాధ్య దైవము యొక్క సౌందర్యమును వర్ణించుటకు - సర్వ సాధారణముగ - పరంపరాగతములైన ఉపమానముల నన్నింటిని ఉపయోగించిరి. ఉపమాలంకారమునకు, ఉత్ప్రేక్షాలంకారమునకు ఆ మహా కావ్యములలో విశేష ప్రవేశము లభించినది

---

21) ఎత్తిసైయుమ్ అమరర్ పణిన్దేత్తుమ్ ఇరుడికేసన్ వలికొయ్య
ముత్తన్న వెణ్ ముఱువల్ సెయ్యవాయన్ ములైయు మూడినేన్
పత్తలర్ కావిల్ మణిత్తడమ్ కణ్ పడై కొళ్ళుమ్ ఇళఙ్గుయిలే ఎన్
తత్తువనై వరక్కూగిత్తియాకిల్ తలై అల్లాల్ కైమ్మాఱిలేనే'
— నాచ్చియార్ తిరుమొళి 5 6

22) 'విణ్ణీల మేలాప్పు విరిత్తాఱ్పోల్ మేగఙ్గాళ్
తెణ్ణీర్ పాయ్ వేఙ్గడత్తు ఎన్ తిరుమాలుమ్ పోన్దానే
కణ్ణీర్గళ్ ములైక్కువట్టిల్ తుళిసోరచ్చోర్వేనై
పెణ్ణీర్మై ఈడళిక్కుమ్ ఇదు తమక్కోర్ పెరుమైయే"
— నాచ్చియార్ తిరుమొళి 8.1

గుత్తులు పగిలి, విడిపోవుచున్నవి పక్షి సముదాయము నుండి కలకలం రావము వినఁబడుచున్నది అందమైన కమలములు విచ్చి, ఎగురుచున్నవి ఆవులను మేపుటకై, అరణ్యమునకుఁ బోవు గోపబాలకుల సమూహమునుండి మురళీ నాదము కూడ వినవచ్చుచున్నది మధురమైన ఆ గీతము యొక్క రాగాలాపనము ఆకాశపథమంతటను వ్యాపించినది తెల్లవారినది శ్రీరంగనాథా! ఇఁక మేలుకొనుము "[19]

### ఉద్దీపన రూపము -

ప్రియునిఁ గలియుటకు ప్రకృతి - నాయికను ప్రేరేపించుచున్నట్లు తిరుమంగై యాళ్వారులు వర్ణించిరి పరిశీలించుఁడు -

"సాయం సమయమైనది హృదయ రంజకమైన ఈ సమయమున - సౌరభమును వెదజల్లుచు వచ్చు శీతల సమీరణము నాయిక యొక్క వక్షోజములను స్పృశించినపుడు - నాయిక మనస్సులో ప్రియునిఁ గలియుటకు గిలిగింతలు పెట్టుచున్నది "[20]

విరహావేశముతో నిరంతరము దుఃఖించు నాయిక - ప్రకృతితో ఏకాత్మ్యమును స్థాపించును చేతనము, అచేతనము అను భేదమును మఱచి, ప్రకృతిని తన సఖిగాఁ దలంచుకొని, తన విరహావేదనను సఖీ రూపమైన ప్రకృతికి నివేదించును అపుడు ప్రకృతియు - ఆ విరహిణికి

---

19 తిరుప్పళ్ళి యెళుచ్చి 9 నుండి 11 వఱకు

20 "వన్దనదడియేన్ వన్ పుగున్దాయ్ పుగున్దప్పిన్ వణ్ణమ్ ఎన్
శిన్దనైక్కినియాయ్ తిరువే ఎన్నారుయిరే
అన్దళిరణియార్ అశోగిన్ ఇళన్దళిర్గళ్ కలన్దు అవై ఎమ్మై
శిన్దిక్కప్ పణ్ణియుమ్ తిరునాలియమ్మానే '

— పెరియ తిరుమొళి 8-6-1

తరంగిణి యగును. ఆమె ఒకపుడు కోయిలతోడను, మఱియొకపుడు మరములతోడను తన ప్రియుని కడకు సందేశమును బంప యత్నించెను. ఆండాళ్ తన ప్రియునకు సందేశ మందించి రావలసిన దని సారి కోయిలను ప్రార్థించెను [21] మఱియొకపుడు మేఘములను ర్థించుచు - 'విరహిణియైన ఒక అబలను ఈ విధముగా వ్యథ టుట న్యాయమా?'[22] అని, తన ప్రియుని అడిగిరం డని ప్రార్థించెను

### లంకార రూపము ..

ఆళ్వారులు ప్రకృతిని అలంకార రూపమునఁగూడ విశేషముగ చియున్నారు. ఆ మహనీయులు తమ ఆరాధ్య దైవము యొక్క ందర్యమును వర్ణించుటకు - సర్వ సాధారణముగ - పరంపరాములైన ఉపమానముల నన్నింటిని ఉపయోగించిరి. ఉపమాలంకామునకు, ఉత్ప్రేక్షాలంకారమునకు ఆ మహా కావ్యములలో విశేష వేశము లభించినది

---

ఎత్తిశైయుం అమరర్ పణిన్దేత్తుం ఇరుడీకేశన్ వలిశెయ్య
ముత్తన్నవెణ్ ముఱువల్ శెయ్యవాయుమ్ ములైయుం అళకళిన్దేన్
కొత్తలర్ కావిల్ మణిత్తడమ్ కణ్పడై కొళ్ళుం ఇలజ్గుయిలే ఎన్
తత్తువన్ వరక్కూగిత్తియాకిల్ తలైయల్లాల్ కైమ్మాఱిలేనే'
— నాచ్చియార్ తిరుమొళి [illegible]

"విణ్ణీల మేలాప్పు విరిత్తాఱ్పోల్ మేగజ్గాళ్
తెణ్ణీర్పాయ్ వేజ్గడత్తు ఎన్ తిరుమాలుమ్ పోన్దానే
కణ్ణీర్గళ్ ములైక్కువట్టిల్ తుళిశోరచ్చోర్వేనై
పెణ్ణీర్మై ఈడళిక్కుమ్ ఇదు తమక్కోర్ పెరుమైయే"
— నాచ్చియార్ తిరుమొళి 8.1

కృష్ణ సౌందర్యమును వర్ణించు సందర్భములలో - ఆళ్వారులు మానములను కొన్నింటిని ప్రయోగించిరి తిరుమంగై యాళ్వా ...తను ఇష్ట దైవమును వర్ణించిన తీరును గాంచుడు -

"బంగారిముతో సమానమైన దేహ కాంతి - మరకత మణి ...వలె నున్నది అందమైన తులసి మాల - ఇంద్ర శోభను ఇనుమ ...డించేయుచున్నది ఎఱ్ఱని పగడములు ఆ భగవానుని వదన వర్ణము ...ను, నేత్రములు వికసించిన కమలముల వలెను ఉన్నవి ముఖ వర్ణము - ...ఆకాశమున సంచరించు నల్లని మేఘమువలె నున్నది."[23]

తిరుమంగై యాళ్వారులు మఱి యొక పాశు., ఒక ఉపమా ...ములతో - పాశుర భావమును విచిత్రముగా సెల్లు వ్యాప్తి ...వించిరి -

" కృష్ణుని కరములు కమలముల వంటివి ముఖము కూడ కమ ...ము వంటిదే నేత్రములును కమలముల వంటివే చరణములు ...తము కమలముల వంటివే "[24]

---

పెరియ తిరుమొழి 8.2-1,3,8.

మైవణ్ణ నఱుఙ్గుఞ్జి కుழల్ పిన్ తాழ
    మకరమ్ శేర్ కుழై యిరుపాడి లజ్గి యాడ
ఎయ్ వణ్ణ వెఞ్జిలై యేతుకై యా ఇఙ్గే
    ఇరువరాయ్ వన్దారెన్ మున్నే నిన్ఱార్
కైవణ్ణమ్ తామరై వాయ్ కమలమ్ పోలుమ్
    కణ్ణిణైయు మరవిన్ద మడియుమ్మ్ అదే
అవ్వణ్ణత్తవర్ నిలైమై కణ్డుమ్ తోழీ
    అవరైనామ్ దేవరెన్ఱఞ్జినోమే."

— తిరునెడుందాండగమ్ 21.

•నవీకరణము :-

ప్రకృతిలో చేతన వ్యక్తిత్వము నారోపించుటయే మానవీ
ణము మానవునకు వలెనే ప్రకృతిని బాహ్యమైన రూప కల్ప
నం చేయుట - ప్రాచీన కాలము నుండియు సరిపాటిగా నున్నట్టిదే
నాధారము గావించుకొనిన కావ్య నిర్మాతలు - ప్రకృతిలో
ంగ ప్రియత్వమును, మానవ వ్యాపారమునుఁగూడ అనుభవము
చెప్పియున్నారు అంతియు కాదు - అందమైన నాయికలో -
ం భావముల నాలోకించి, ప్రకృతిని బహు భంగులుగా ప్రశం
సిరి కవిచే సంభావింపఁబడిన ప్రకృతి - ప్రేమతో, ప్రకృతిక
ంబంధించిన కార్య కలాపములతో నిలిచిపోలేదు తత్సంబంధములైన
ంరాగ, భయ, విషాదాది భావములను సైతము పరిపూర్ణముగా
ందియున్నది

ప్రకృతిలో మానవ చైతన్యము నారోపించుచు - సమ్మా
రులు కొన్ని సన్నివేశములను తమ కావ్యములలో వర్ణించిరి,
ృమించు సూర్యునిఁ గాంచి, ఆ మహనీయులు చేసిన వర్ణన
ు -

"చాల కాలమువఱకు విశాల సామ్రాజ్యమును పాలించి,
ముగా శాసించిన సూర్యరాజు కూడ, తుదకు అంతరించిపోవు
గ్నాఁడు "[15]

---

"శిరర కాజ్ఞంతన్ కెజ్గొర్ శిలనాక్ కెలి ఇక్కుశిన్ద
పారర కొత్తు పత్తైన్దదునాయిఱు పారశన్ద
పేరర శేయమ్ విఱుమ్బరశే యెమ్మై నీత్తు వఱ్త్త
ఓరర శేయదుళాయ్ ఇరుళాయ్ వన్దుఱు గిన్దదే"

— తిరువిరుత్తమ్ : 80

## నీతి ఉపదేశము

మానవుఁడు ప్రకృతి యొక్క కార్య కలాపములను అనేక విధముల అదృశ్యముగ భావించి, బలమును, జ్ఞానమును, సాంత్వనమును పొందును అతఁడు ప్రకృతిలో నీతిని గాంచును ఉపదేశమును వినును ప్రకృతి కేవలము తత్త్వ ముపదేశించుచున్నట్లే అతనికి తోచును ఆ ప్రకృతియే అతని కొక గురువుగాఁ గన్పట్టును మానవునకు నీతిని, ఉపదేశమును అందించుటకు ప్రకృతి గురువీర మైనట్లు ఆళ్వారులలో కొందఱు వర్ణించిరి ఇట్లు వర్ణించినవారిలో కులశేఖరాళ్వారులు అగ్రగణ్యులు. ఆ మహానీయుల మహోపదేశము లవశ్య గమనార్హములు -

'అరుణ వర్ణము గల కమలము కడ దీపము వెలిగించి పెట్టినను, ఆ కమలము వాడిపోదు కేవలము ఆకాశమునందలి సూర్యుని కిరణ ప్రసారము వల్లనే అది వాడిపోవును అట్లే, భక్తుఁడు కూడ భగవదనుగ్రహము పైననే ఆధారపడి యుండవలెగాని, మఱి యొకనిపై ఆధారపడియుండుట నిరర్థకము" [28]

"ఆకాశమునందలి విహంగము పదే పదే ఆకాశముపై విహరించునట్లే, భక్తుఁడును భగవంతునియందే ఆధారపడి యుండవలెను

---

28 'సెన్దళతే వన్దళత్తై చ్చెయ్‌విడినుమ్ సెఙ్గమలమ్
అన్దరమ్ సెఙ్గదిరో ఱ్ఱల్లాలలరావాల్
వెన్దుయర్ వీట్టా విడినుమ్ విత్తువక్కోట్టమ్మా ఉన్
అన్దమిల్ శీర్క్కల్లాల్ అఙ్గాళైయ మాట్టేనే

— పెరుమాళ్ తిరుమొళి 6.0,

పక్షికి ఆకాశమే ఆధారమైనట్లు, నిస్సహాయుఁడైన భక్తునకు భగవానుఁడే ఆశ్రయణీయుఁడు "[27]

## పరమాత్మ సాక్షాత్కారము -

ప్రకృతియందలి రహస్యములను ఆమూలాగ్రముగ గ్రహించిన కవిశేఖరునకు - ఆ ప్రకృతియే పరమ తత్త్వమును దర్శింపఁజేయును విశ్వాత్మను దర్శించిన కవిశేఖరుఁడు - ప్రకృతిలో ఒకే విధమైన చేతన తత్త్వము వ్యాప్తినందియున్నట్లు గ్రహింపఁగల్గును అతఁడా పరమ తత్త్వమును ఒకానొక చేతన శక్తిగాఁ దలంచును అట్టి చేతన శక్తికి ప్రకృతియే అంగమనియు ఆతఁడు గ్రహించును

ఆళ్వారులు విశ్వాత్మను దర్శించిన మహాకవులు కనుకనే ప్రకృతి యందలి పరమ తత్త్వమును తమ కావ్యముల మూలమున మనకు దర్శింపఁజేసియున్నారు పై యాళ్వారుల భావనా పరంపరలను పరిశీలించుఁడు -

" ఓ భగవానుఁడా! సరసోజ్జ్వలము - సౌదామినీ రూపము నగు విజయ పతాకమును ఎగురవేయుచు, వజ్ర రూపియైన విజయ దుందుభిని మ్రోయించుచు, గగన మండల మధ్య భాగమునఁ దిరుగు మేఘ

---

27 "వెఙ్గటిణ్ కళిఱదర్త్తాయ్ పిత్తుప కోట్టమ్మానే
ఎఙ్గుప్పోయుయ్గేన్ ఉన్నిణై యడియేయరై యల్లాల్
ఎఙ్గుమ్ పోయ్క్కరై కాణాదు ఎఱికడల్ వాయ్ మీణ్డేయుమ్
వఙ్గత్తిన్ కూమ్బేఱు మాప్పఱవై పోన్ఱేనే "

— పెరుమాళ్ తిరుమొఴి ౫-౫

పంక్తి — నా మనః ఫలకముపై నీ రూపమునే చిత్రించి, నిను జ్ఞప్తికి దెచ్చుచున్నది [28].

ఈ రీతిగా ప్రకృతిలో పరమ తత్త్వమును దర్శింపఁ జేసిన పన్నిరాళ్వారులు అందఱకును ఆరాధనీయులు ఇచట ప్రకృతిలో పరం తత్త్వ మనఁగా -

"అణో రణీయాన్ మహతో మహీయాన్
ఆత్మా గుహాయాం నిహితోఽస్య జంతోః
తమ క్రతుం పశ్యతి వీత శోకో
ధాతుః ప్రసాదా న్మహిమాన మీశమ్ "

అను ఉపనిషద్వ్యాఖ్యానుసారము - అణువులో అణువునై, మహత్తుల మహత్తునై విరాజిల్లు పరమాత్మయే అట్టి పరమాత్మను ప్రకృతిలో దర్శింపఁగలవారు మిక్కిలి సుకృతాత్ములు అట్టి సుకృతవంతులు లభించు ఆనందము వికృతి రహితమైనది వారి కృతి రత్నములు వి మైన మహోపకృతులై విరాజిల్లుట సహజము

"జయంతి తే సుకృతినో రస సిద్ధాః కవీశ్వరాః
నాస్తి తేషాం యశః కాయే, జరా మరణజం భయమ్ "

28 "ఎళిల్ కొణ్డు మిన్నుక్కొడి యెడుత్తు వేశ
త్తోళిల్ కొణ్డు తాన్ ముళఙ్గిత్తోన్దుమ్ - ఎళిల్ కొణ్డ
నీర్ మేగమన్న నెడుమాల్ నిఱమ్బోల
కార్వానమ్ కాట్టుమ్ కలన్దు "
— మూన్ఱామ్ తిరువన్దాది 86



# శ్రీ రామానుజ వైభవము

వ్యాఖ్యానకర్త

'సుధీమణి'

**శ్రీమాన్ కందాడై శ్రీనివాసాచార్యులు,** బి యస్‌సి

పరిష్కర్త

'విద్యాభూషణ - కవితా విశారద'

**శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు**

***శ్రీ రామానుజ కీర్తి కౌముదీ సంపాదకులు***



"మేషార్ద్రా సంభవం విష్ణోః దర్శన స్థాపనోత్సుకమ్
తుండీర మండలే శేష మూర్తిం రామానుజం భజే"

## అవతారిక

శ్రీమన్నారాయణుని దివ్య లీలా విలాసములు అవాఙ్మానస గోచరములు ఆ జగన్నాథుని ఆజ్ఞ ననుసరించియే పిపీలికాది బ్రహ్మ పర్యంత మగు సకల లోకము అనువర్తించుచుండును

'యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత !
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్.'[1]

అనెడి భగవద్గీతా వచనానుసారము – ధర్మోద్ధరణార్థమై, భగవంతుతో కొందఱు మహనీయులు భూలోకమున కారణ జన్ములు అవతరించుచుందురు

1 భగవద్గీత 4 - 7

అందులకు నిదర్శనముగ ఒకానొకపుడు, శ్రీమన్నారాయ
పరివార - పరికరము లగు అనంత గరుడ విష్వక్సేనాది నిత్యసూర
శంఖ - చక్రా ద్యాయుధములు భూ మండలమున ఆళ్వారాచా
లుగా అవతరించి, ధర్మోద్ధరణము గావించిరి

పన్నిద్దరాళ్వారులు తమ తమ మహిమలను అభివ్యక్తి
గావించుచు, శ్రీ వైష్ణవ ధర్మమునకు ఆధార భూతము లగు
ప్రబంధములను రచించుటేగాక, ప్రజానీకమున భక్తి భావ
పెంపొందించి, తిరిగి శ్రీ వైకుంఠము నలంకరించిరి

తదుపరి నాథమునులు - లుప్తమునైన ఆళ్వారుల దివ్యప్ర
ములను నమ్మాళ్వారుల అనుగ్రహ విశేషమున నుద్ధరించి,
బహుళ వ్యాప్తి గావించిరి అనంతరము వారి పౌత్రు లగు యామ
చార్యులు - ఆళవందారులుగా ప్రసిద్ధి గాంచి, శిష్య ప్రశిష్య
గూడి, శ్రీరంగమున విరాజిల్లుచుండిరి అట్టి సమయమున -

అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుఁడు, వైకుంఠ నాథ
నగు శ్రీమన్నారాయణుఁడు - దివ్య మణిమయ సింహాసనమున
భూ నీళా సమేతుఁడై వేంచేసి, అనంత గరుడ విష్వక్సేనాది
సూరులు, ముక్త పురుషులు సకల విధ పరిచర్య లొనర్చుచు -
గానము సేయుచుండ, ఆనందింపక, చింతాక్రాంతుఁడై యుం
అట్టి స్థితిలో - అనంతుఁడు శ్రీమన్నారాయణుని వీక్షించి, స్వా
దేవర వారి ముఖ కమలము కమలి చిన్నవోయి యుండుటకు క
మేమియో! ఆనంద రసార్ణవమున నోలలాడదగు సమయమున
ఋా రుండుటకు హేతు వేదియో! దాసున కెఱుంగ చెల్లు
భయ భక్తులతో ప్రార్థింప, ఆ భక్త వత్సలుఁడు కరుణా ర
లొలుకు పలుకులతో నిట్లనియె -

'భోగిరాజా! అనాదికర్మవాసనానసులైన జీవాత్మలు జనన
రణ దుఃఖములనుండి విడువఁబడి, ఉజ్జీవించుటకై, నేను భూ లోక
న అవతారము లనేకములు ధరించితిని తదుపరి నా యాజ్ఞచే
ష్వక్సేనాది నిత్యసూరులు లోకరక్షణార్థమై ఆళ్వారులుగా నవత
రిరి కాని, నా మనోరథము సిద్ధింపలేదు చేతనులు ఉజ్జీవింపక,
సంసారులై నశించుచుండు విషయము స్మృతికి గోచరింప, విచా
ము కలిగెను ఇపుడు మఱల నొక సారి వారి ఉజ్జీవనార్థము ఏదేని
ఉపాయమును యోచించుచున్నాను అట్టి చేతనుల నుద్ధరించుటకు
సమర్థుఁడవు కావున, నీవు భూ లోకమున నవతరించి, చేతనులకు
రాత్మ మార్గము నుపదేశింపవలయును' అని ఆజ్ఞ నొసఁగెను

ఆదిశేషుఁ డంతట – 'స్వామీ! దేవరవారి ఆజ్ఞ దాసునకు
రోధార్యము కాని, పిపీలికాది బ్రహ్మపర్యంతము లోక మంతయు –
సృష్టి స్థితి లయకారకు లగు దేవరవారి మాయచే ఆవరింపఁబడి
యున్నది. కనుక, నిత్య విభూతికిని, లీలా విభూతికిని అధిపతులగు దేవర
ారు – ఆ విభూతి ద్వయముపై అధికారమును దాసున కొసంగితిరేని,
దివ్యో దొక యుపాయమున తమ యభీష్టమును నెరవేర్ప యత్నింతు'
ని సవినయముగా విన్నవించెను అంతట శ్రీమన్నారాయణుఁడు –
ఆదిశేషునకు అతఁడు కోరినట్లే ఉభయ విభూతి నాయకత్వ మొసంగి,
భూలోకమున నవతరింప నియమించెను

## ఆదిశేషుఁడు భూ మండలమున
## రామానుజులుగా అవతరించుట

భగవ న్నియమనానుసారము ఆదిశేషుఁడు భూ మండలమున
కేతెంచి, ఆసూరి కేశవసోమయాజి, కాంతిమతి యను పుణ్యదంపతు
లకు కుమార రత్నముగా – పింగళ సంవత్సర చైత్ర శుద్ధ పంచమీ

వాసరయుక్తమగు మేషమాస ఆర్ద్రా నక్షత్రమున, (క్రీ శ
7) భూతపురి యని ప్రఖ్యాతి గాంచిన శ్రీపెరుంబూదూరులో-
త గోత్రమున జన్మించెను.

ఆళవందారుల ముఖ్య శిష్యులును, పెద తిరుమల నంబిగా
సిద్ధులు నగు శ్రీశైలపూర్ణులు[2] - తమ పెద్ద చెల్లె లగు కాంతి
కి పార్థసారథిస్వామి యనుగ్రహ విశేషమున పుత్రుడు పుట్టినట్లు
ఎంతయు సంతసించి, శ్రీపెరుంబూదూరున కేతెంచి, ఆ శిశువునకు-
రామానుజులు'[3] అని నామకరణము చేసిరి

కేశవాచార్యులు తమ తనయునకు ఆయా సమయములలో[4]
ప్రాశనము, చౌలము మొదలగు సంస్కారములు జరిపించి,
వాసము మొదలు 8 - వ సంవత్సరమున, ఒక శుభ ముహూర్త
ఉపనయనము గావించి, వేద వేదాంగములను సాంగోపాంగ
తామే ఆ బాలునకు బోధించిరి పది యాతేండ్ల ప్రాయమునకు
నుజులు సంపూర్ణ జ్ఞాన తేజో విరాజితులు కాగా, అపుడు
నుజులకు కేశవాచార్యులు 'తంజమాంబ' యను కన్యతో వివా
జరిపించిరి

---

శ్రీశైల పూర్ణులు - (క్రీ శ, 973 - 1073)
వీరు రామానుజుల మేనమామగారు తిరుమల వంశమునకు మూల పురుషులు
జన్మస్థానము తిరుపతి శ్రీ వేంకటాచలపతి వరప్రసాదమున జన్మించినవారు
యామునాచార్యుల శిష్యులు వీరికి తిరుమల నంబి' యను నామాంతరము కలదు

శ్రీ రామానుజ నామాంతరములు
1 లక్ష్మణాచార్యులు 2 లక్ష్మణయోగివర్యులు 3 లక్ష్మణ మునులు 4 యతి
రాజులు 5 యతీంద్రులు 6, యతిపతులు 7 శ్రీభాష్యకారులు 7 ఇళయాళ్వా
రులు 9 ఏంబెరుమానారులు 10 ఉడయవరులు 11 భూతపురీ నాయకులు 12 భూత
పురీమునులు 13 విభూతిద్వయ నాయకులు 14 తిరుప్పావై జీయర్ 15, గోదాగ్రజులు
8 శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంత స్థాపనాచార్యులు మున్నగునవి

వివాహానంతరము తండ్రి యగు కేశవాచార్యులు పరమపదింప రామానుజులటు పిమ్మట సకుటుంబముగ కాంచీ పురము చేరి, అచట మహా పండితుఁ డగు యాదవ ప్రకాశుని వద్ద వేదాంత శాస్త్రమును అధ్యయనము చేయసాగెను

## రాజ కుమార్తెకు పట్టిన బ్రహ్మరాక్షసుని రామానుజులు పారద్రోలుట

ఆ తరుణమున నొకపుడు - కాంచీపుర రాజకుమార్తెను బ్రహ్మ రాక్షసుఁ డావేశించి బాధించుచుండెను ఎందరో మాంత్రికు లేతెంచి, ఆ రాజకన్య నావహించిన బ్రహ్మ రాక్షసుని పారద్రోలుట కెంతగా ప్రయత్నించినను విఫల మయ్యెను అంతట, యాదవ ప్రకాశుఁడు మహా మంత్ర శాస్త్రవేత్తగా రాజు విని, ఆతని రప్పించెను కాని, ఆ యాదవ ప్రకాశుని మంత్ర తంత్రములు బ్రహ్మ రాక్షసుని యెడ నిష్ఫలము లాయెను బ్రహ్మ రాక్షసుఁడు యాదవప్రకాశుని ధిక్కరించి, గడ గడ వణకుచున్న ఆతని చూచి, సూటిగా - 'ఓ యాదవా బ్రాహ్మణుఁడవై జన్మించుటకు నీవు చేసిన పూర్వ పుణ్య మేమి బ్రహ్మ రాక్షస జన్మ నొందుటకు నేఁ జేసిన పాప మేమి?' యని ప్రశ్నించెను ఆ ప్రశ్నలకు యాదవుఁడు ప్రత్యుత్తరము తీయఁజాలక మిన్న కుండెను

బ్రహ్మ రాక్షసుఁ డంతట గంభీర స్వరముతో - 'యాదవా పూర్వ జన్మమున నీవు మధురాంతక మను అగ్రహారపు చెఱువు గట్టునఁ గల పుట్టలో ఉడుమువై పుట్టియుంటివి ఒకానొక దినమున వేద వేదాంగ పారంగతుఁ డగు నొక వైష్ణవుఁడు - మార్గ మధ్యమున గల ఆ సరస్సులో స్నాన మాచరించి, ఆ సరస్తీరమున వంట చే

కొని, శ్రీ మన్నారాయణునకు నివేదనము గావించిన ఆ యన్నమును భక్తితో భుజించి, ఆ భుక్త శేషమును నీ పుట్టవద్ద విడచి వెళ్ళి పోయెను క్షుద్బాధా పీడితుఁడ వగు నీవు - ఆ భుక్తాన్న శేషమును భుజించిన కారణమున, ఈ జన్మమున నీవు బ్రాహ్మణోత్తముఁడ వైతివి ఇఁక నా సంగతి యేమన, వేద శాస్త్ర విశారదుఁడనై, విద్వద్బ్రాహ్మణుఁడనుగా విఖ్యాతి గాంచిన నేను - ఒకానొక యజ్ఞమున వాటిల్లిన మంత్ర క్రియాది లోపము వలన, బ్రహ్మ రాక్షసుఁడ నైతిని తదుపరి, కాంచీపురోద్యానమున ఈ రాజకన్య నావేశించి తిని నీ శిష్యుఁడును, సర్వ లక్షణ సంపన్నుఁడు నగు రామానుజుఁడు - తన పాదముచే నన్ను స్పృశించి, పాదోదకము నొసఁగి నా కనుజ్ఞ నిడిన యెడల, నే వెడలి పోయెద' నని పలికెను

ఇది యంతయు ఆకర్ణించిన రాజచంద్రుఁడు - రామానుజుల నాహ్వానించి, అంజలి ఘటించి, తన తనయ నావేశించిన బ్రహ్మ రాక్షసుని పారద్రోల వేడెను అంతట రామానుజులు - ఆ రాజ కన్య శిరముపై తమ పాద ముంచి, ఆమెకు తమ పాదోదక మొసఁగి, ఆ కన్య నావహించిన బ్రహ్మరాక్షసుని వెడలి పొమ్మని ఆజ్ఞాపించెను అంతట బ్రహ్మరాక్షసుఁడు - తన ఆత్మకు అధోగతిఁ గల్గించిన శరీరమును వదలి, దివ్య శరీర ధారుఁడై, దివ్య విమానమున దివ్యధామము చేరెను అపుడు మహారాజు - సంతోషాతిరేకమున, రామానుజులను ధన కనక వస్తు వాహనములతో ఘనముగా సత్కరించెను అట్టి సత్కార ద్రవ్యము నంతటిని రామానుజులు - తమ గురు వగు యాదవ ప్రకాశునకు సమర్పించిరి.

## యాదవునకు రామానుజులయందు అసూయ జనించుట

రామానుజ ప్రభావము వలన రాజ కన్యకు స్వస్థత చేకూరిన ఘటనముచే, యాదవప్రకాశునకు రామానుజలయందు అసూయ ంచెను ఒకనాఁడు యాదవప్రకాశుఁడు రామానుజులకు తైత్తిరీయో షత్తు చెప్పుచు, 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' అను వాక్యమున ర్థము చెప్పెను రామానుజు లంతట వెంటనే లేచి, 'సత్య నాది వాక్యములు పరబ్రహ్మ గుణములను చెప్పుచుండ, శ్రుతి క్యమునకు మీ రేల అపార్థము చెప్పుచుంటి' రని ప్రశ్నించిరి ాదవు డా మాటలను వాక్యము విని, క్రోధోద్రిక్తుఁడై, రామాను ను అనేక విధముల దూషించెను అంతట రామానుజులు గురు వాసమును వీడి, తమ నివాస గృహమున కేగిరి

## యాదవుని దురాలోచనము

ఇట్లుండ, రామానుజులు తన వద్ద శాస్త్రాధ్యయనము వదలి ళ్ళినందులకు యాదవుఁ డొకింత చింతించి, రామానుజుఁడు సామా న్యుఁడు కాఁడనియు, సాక్షాత్తు దివ్య పురుషుఁ డనియు, తన మత ను నిర్మూలింపవచ్చిన వాఁడనియు యాదవుఁడు నిర్ణయించి, ర్బుద్ధిగలవాఁడై, ఒకనాఁడు శిష్యులతో సమాలోచనము చేసి, రామానుజుని హత్య గావించుటకు ఉపాయ మాలోచించెను, కాని హ్మహత్యా పాతకమునకు వెఱచి, కాశీ క్షేత్రమున - గంగా దిలో, మణికర్ణికా ఘట్టమున త్రోసివైచి, 'రామానుజుఁడు గంగా దిలో కాలు జారిపడి మునింగెచె' నని పుకారు పుట్టించినచో ాపము సంభవింపదని భావించి, రామానుజులను సాదరమున రావించి,

'రామానుజా! నీవు మహా ప్రాజ్ఞుఁడవు నావద్ద నీవు శాస్త్రాధ్యయనమును వదలి వేయుట మేలు కాదు శిష్యు లందఱిలో నుండే నా కెక్కువ మక్కువ శేషించిన విద్యలనుఁగూడ నేర్చుకొని నీవు ఖ్యాతి నందఁగా - ఆనందింపవలెనని నా ఆకాంక్ష' అని యాదవుఁడు పలుక, అవి యన్నియు కపట వాక్యములని రామానుజులు తెలుపక, అట్లే మఱల యాదవుని వద్ద శాస్త్రాధ్యయనము చేయసాగిరి.

## యాదవుఁడు రామానుజులను హత్య గావింప యత్నించుట

అంతట నొకనాఁడు - గంగా స్నానము మాఘ మాసమున విశేష ఫలప్రద మగుటచే, కాశీ క్షేత్రమునకు బయలుదేరవలసినదని యాదవుఁడు రామానుజులతో పలికెను రామానుజులు తల్లి యాజ్ఞ గైకొని, యాదవునితో గంగా స్నానమునకు బయలుదేరిరి యాదవుఁడు సకల శిష్యులతో కాశీ యాత్రకు పయన మయ్యెను యాదవుని కుటిలతను, కుతంత్రములను ఎఱింగిన గోవిందుఁడు - రామానుజుల కా సంగతిని చెప్పవలెనని తలచి, అట్టి తరుణమునకై వేచియుండెను కాశీ యాత్రలో - యాదవుఁడు శిష్యులతోఁ గూడి, వింధ్యారణ్యమున రామానుజులను తప్పించి, ముందుగా నేగెను మార్గమున దూరముగా వచ్చుచున్న రామానుజులను వారి పినతల్లి కుమారుఁడగు గోవింద భట్టరు [4] చూచి సమీపించి, 'రామానుజా! నీవు జాగరూకుఁడవై

4. గోవింద భట్టరు (క్రీ॥ శ॥ 1026 - 1131)

వీరు రామానుజుల పినతల్లిగారి కుమారులు జన్మస్థానము శ్రీపెరుంబూదూరుకు సమీపమునఁగల మధురమంగల గ్రామము వీరికి గోవిందమిశ్ర అనియు నామాంతరము కలదు వీరు వైరాగ్య సంపన్నులు రామానుజులు వీరికి సన్యాసాశ్రమమును ప్రసాదించి, 'ఎమ్బార్' అను నామము నుంచిరి

గుండు' మని హెచ్చరిక చేసి, యాదవుని దురాలోచనమును తెలియఁజేసి వెళ్ళెను

రామానుజు లా మాటలను విన్నంతనే, మార్గమును వదలి, ఒక చెట్టు మొదల నిలబడి శ్రీ మన్నారాయణుని చరణారవిందములను ధ్యానింపసాగిరి ఇంతలో గొప్పవర్షము రాగా, ఆ వర్షమువల్ల యాదవుఁడు పీడితుఁడై, శిష్యులతోఁగూడి, సాయం సమయమునకు మెల్లగా ఒకచోట చేరెరు అంతట - మార్గమున రామానుజులు లేక, గోవిందుఁడు ఒంటరిగా వచ్చుట యాదవుఁడు చూచి, 'రామానుజులను వీడి ఒంటరిగా నిచటికి వచ్చితివా? అతఁడెచ్చట నున్నాఁడు?' అని యడుగ, అప్పుడు గోవిందుఁ డాతనితో - 'గురువరా! రామానుజులు నాకంటెను ముందుగానైన వెళ్ళియుండవచ్చును లేక వెనుకనైన వచ్చుచుండవచ్చును' అని విన్నవించెను

అంతట యాదవుఁడు శిష్యులను పిలిచి, ఆ దుర్గమారణ్య మార్గమున రామానుజులను వెదకుఁడని ఆజ్ఞాపించెను శిష్యులు రామానుజులను కానక, 'అయ్యా! అరణ్య మంతయు గాలించితిమి కాని, రామానుజులు కానరాలేదు' అని విన్నవించిరి అప్పుడు యాదవుఁడు కొంత తడవు విచారము నంది, రామానుజుని ఏ మృగమో భక్షించి యుండునని మఱికొంత తడవుకు లోలోన సంతసించి' కారుచీకటులు క్రమ్ముకొనఁగా - అచట నిద్రించెను

## కంచి వరదరాజస్వామి లక్ష్మీ సహితుఁడై కిరాత దంపతులుగా రామానుజులకు దర్శన మొసఁగుట

అంతట, భక్త వరదుఁడైన వరదరాజస్వామి - పెరుందేవీ సహితుఁడై, బోయ వేషము ధరించి యేతెంచి, రామానుజులను గాంచి, 'అయ్యా! ఒంటరిగా ఈ భయంకరారణ్యమున నచట

మేలు కాదు ఎందులకు పోయెదవు?' అని యడుగ' రామానుజులు - 'నేను కాంచీపురమునకుఁ బోవుచున్నా' నన, అతఁడు - 'మేమును అచ్చటికే పోవుచున్నారము కావున మీ వెంబడి వచ్చితిమేని, సులభ మార్గమున జనవచ్చును. అయినను - ఇది రాత్రి సమయ మగుటచే, ఇక నడచుట మంచిది కాదు గాన, కొంత విశ్రమించుట మే లని ఒక చెట్టు క్రిందఁ జేరి, అట రామానుజులను నిద్రఁ బుచ్చిరి

అంత ఆ రాత్రి నాలవ జాముఁ ఆ బోయెత దాహము గొని జలము కోరినంత, బోయఁ డచ్చట నొక బావిని గురుతుగఁ జెప్పి, రామానుజులను నీరు దెమ్మని పలుక, ధీరు లగు ఆ రామానుజులు వెళ్ళి, నీరు గొని వచ్చి, అచ్చట వారినిఁ గానక, ఎందు బోయిరో యని వెదకుచుండ, సూర్యోదయ మగుటచే, తమకుఁ గన్పట్టు ఆలయ గోపురాదులనుఁ గని, ఆశ్చర్య మొంది, అచ్చటి జనులవలన అది కాంచీపురమని తెలిసికొని, ఆశ్చర్య చకితులై, 'ఎచ్చటి వింధ్యారణ్యము! ఎచ్చటి కాంచీపురము! ఎచ్చట నిద్రించుట! ఎచ్చట మేలుకొనుట!' అని విభ్రమముఁ జెంది, ఇది యంతయు వరదరాజుల లీలా విశేషమని భావించి, తమ నివాస గృహమున కేఁగి, తల్లి యగు కాంతిమతితో - జరిగిన వృత్తాంతమును నివేదింప, అప్పు డామె - వరదరాజస్వామికి అంతరంగికులును, వైశ్యకులాలంకారులునైన తిరుక్కచ్చినంబికి[6] నివేదింప నియమించెను 'రామానుజ' లట్లే ఆ నంబిని

---

6 తిరుక్కచ్చినంబి -

వీరి జన్మస్థానము పూన్దమల్లి నివాసము కాంచీపురము వీరికి కాంచీపూర్ణు లను నామాంతరము కలదు వీరు పెరియనంబి శిష్యులు వరదరాజస్వామికి ఆజన్మాంతము సేవ గావించి, ఆ స్వామికి అంతరంగిక భక్తులుగా ప్రసిద్ధి గాంచిన వైశ్యకులాలంకారులు వరదరాజాష్టకమును రచించిన పరమ భాగవతోత్తములు రామానుజుల హితమును కోరినవారు

ంచిరి వారు ప్రస్తుతాంశమును గ్రహించి, 'నాయనా! రామానుజా!
రాత దంపతులు - వరదరాజులు, పెరుందేవీతాయారులే వారికి
ప్రాత్రమైన ఆ శాలాకూప తీర్థమును స్వర్ణ కుంభములో గొని తెచ్చి,
కైంకర్యము చేయు' మని రామానుజులను ఆజ్ఞాపించిరి రామా
లట్లే ప్రతినిత్యము అమితానందముతో వరదరాజస్వామిని
ంచుచుండిరి

## యామునులకు రామానుజుల వృత్తాంతము తెలియుట

నాథమునుల పౌత్రులును, శ్రీమన్నారాయణుని సింహాసనాంశ
అవతరించినవారును, ఆళవందారు లని ప్రసిద్ధి గాంచినవారును
యామునాచార్యులు - విశిష్టాద్వైతసిద్ధాంత ప్రవర్తకులై,
ంగమున సేవచేసియుండిరి వా రొకనాడు తిరువాయి మొళిని
ంచుచు - 'పొలిగ, పొలిగ' యను పాశురమును పఠించి,
ర మగ్నులై, శిష్యులను పిలిచి, శిష్యులారా! సర్వ లక్షణ సంశో
డు, విష్ణు భక్తుడు, సర్వ శాస్త్రార్థ తత్త్వజ్ఞుడు నగు యువకుం
కిశమం దున్నను నాకు తెలియఁజేయుఁడని నియమించిరి శిష్యు
అట్టి వానిని గాలించి ఆ ప్రాంత మంతటను అన్వేషించి, రామా
వృత్తాంతము ను యామునులకు వివరించిరి అప్పటి యామునా
్యులు రామానుజులను చూడ వేడ్క గలవా రయ్యును, అస్వస్థతచే
చూడజాలకపోయిరి.

## యాదవుని గంగాస్నానము - గోవిందుని శైవాచారము

యాదవ ప్రకాశుఁడు కాశీ క్షేత్రమున గంగా నదిలో స్నాన
రించుచుండెను ఆతని శిష్యులలో నొకఁ డగు గోవింద భట్ట
గంగాస్నానము చేయుచుండ, ఇంతలో నప్పుడా నీటినుండి
దభట్టరుకు శివలింగ మొకటి లభించెను దాని నాతఁడు తెస

గురువునకుఁ జూప, ఆ యాదవుఁడు సంతసించి, 'మాఘ స్నానమునగా నీకు కాశీ విశ్వేశ్వరుఁడు ప్రసన్నుఁ డయ్యె' నని గోవిందునిఁ బలికి, మాఘ మాసాంతము వఱకు అచటనే కాలము గడపి, అనంతరము అచటినుండి కాంచీపురమునకు మఱలి వచ్చెను

గోవిందాచార్యుఁడును యాదవునితో కాంచీపురి కేతెంచి గురువువద్ద అనుజ్ఞ హైకొని, అచటికి సమీపమునఁగల స్వగ్రామ వ మధుర మంగల గ్రామమున కేఁగి, గంగా ప్రవాహమునుండి తెచ్చి శివ లింగమును ఆ గ్రామముననే ప్రతిష్ఠించి, విభూతి, రుద్రాక్ష మొదలగు శైవ చిహ్నములు ధరించి, కాళహస్తికి వెళ్ళి, అచట ఁ పతికి సేవఁజేయుచుండెను.

## యాదవుఁడు రామానుజులను శాస్త్రాధ్యయనమునకు మఱల ఆహ్వానించుట

వింధ్యారణ్యమునుండి రామానుజులు కాంచీపురమునకు ముగా చేరినట్లు యాదవుఁడు విని, సంభ్రమాశ్చర్య చకితుఁ ధీమంతుఁడగు రామానుజునితో వైరము తగదని తలచి, శిష్యుల ద్వా రామానుజులను మఱు రావించి, ఆయనకు తన అభిప్రాయ వె గించెను శాస్త్ర పండితులలో నపుడచట యాదవుని కంటెను మిం వా రెవరును లేనందున, రామానుజులు ఆ యాదవ ప్రకాశుని యథాప్రకారము శాస్త్రాధ్యయనము చేయసాగిరి.

## యామునులు రామానుజులను చూచుటకు కంచి కేతెంచుట

రామానుజుల అతిమానుష వైభవమును వినిన యామును వారిని చూడ వేడుకతో, శ్రీరంగమునుండి కంచి కేతెంచి, ం

రాజస్వామిని సేవించి, ఆ స్వామికి మంగళాశాసనము గావించి, సన్నిధి వద్ద - తూర్పు పడమర మండపమున, కాంచీపూర్ణులతో వేంచేసి యుండ, యాదవప్రకాశుఁడు శిష్యబృందముతో - వరదుని సన్నిధికి ప్రదక్షిణముగా వచ్చుచుండెను వానిలో - రామానుజులను చూపు మని యామునులు తిరుకచ్చినంబి నడిగిరి అప్పుడు కాంచీపూర్ణులు - ఆచార్యవర్యా! ఆ బృందములో ముందు నడచు ఏకదండ సన్యాసియే రామానుజులకు గురువగు యాదవప్రకాశుఁడు ఊర్ధ్వపుండ్రధారియై, ఆకర్ణాంత విశాల నేత్రుఁడై, ఆజాను బాహుఁడై, మధుర మందహాస వదనారవిందుఁడై, బ్రాహ్మణ బాలకుల నడుమ వచ్చుచున్నవాఁడే రామానుజాచార్యులు' అని తెలిపిరి యామునులు రామానుజులను నేత్ర పర్వముగ గాంచి, అతని జ్ఞానాభివృద్ధికై,

"లక్ష్మీశ! పుండరీకాక్ష! కృపాం రామానుజే తవ
నిధాయ స్వమతే నాథ! ప్రవిష్టం కర్తు మర్హసి" 6

ఓ లక్ష్మీనాథా! పుండరీకాక్షా! రామానుజునియందు నీ పరిపూర్ణ కటాక్షముంచి, నీకు సమ్మత మగు శ్రీవైష్ణవ సంప్రదాయమున ప్రవేశింపఁజేయు' మని వరదరాజులను ప్రార్థించి, రామానుజులను కలియఁజాలక, శ్రీరంగ మేగి, రామానుజుల అభ్యుదయము నాకాంక్షించి, స్తోత్ర రత్నమును రచించిరి

## యాదవుఁడు కప్యాస శ్రుతికి అపార్థము చెప్పుట

ఒకనాఁడు రామానుజులు యాదవప్రకాశునకు తలయంటుచు, శాస్త్రార్థములను వినుచుండిరి యాదవుఁడు - 'తస్య యథా

6 ప్రపన్నామృతము 7 - 32
7)

కప్యాసం పుండరీక మేవ మక్షిణీ' అను శ్రుతికి[7] - 'పరమాత్మ
యొక్క నేత్రములు కోతి పిఱ్ఱల వంటి ఎఱ్ఱనైన నేత్రములు' అ
అపార్థము చెప్పెను. ఈ విపరీతార్థమునకు వ్యాకులము నంది,
రామానుజుల నేత్రములనుండి, వేడియైన అశ్రుధారలు యాదవు
తొడలపైఁబడి, చురుక్కు మనఁగా - ఆయన తల ఎత్తి, 'దుఃఖించు
చుంటి వేల?' అని ప్రశ్నించెను. అంత రామానుజులు - 'తామ
శ్రుతికి చెప్పు విరుద్ధార్థములను విని, విచారము నందుచుంటి' న
తెలిపిరి. యాదవుఁడు ఆగ్రహోదగ్రుఁడై, సరియైన యర్థమును నీ
వివరింపు' మని పలికెను. రామానుజు లంతట -

"కప్యాస ఇతి వాక్యస్య వక్ష్యే హ్యర్థం శ్రుణు ద్విజ!
గంభీ రాంభసి జాతస్య ప్రోద్య ద్భానుకరై స్తథా
సంఫుల్ల దళ పద్మస్య సదృశే లోచనే హరేః
తస్యా శ్రుతే రేష ఏవార్థో వక్తవ్యః శాస్త్ర విత్తమైః" [8]

బ్రాహ్మణోత్తమా! కప్యాస మను వాక్యమునకు అర్థము
నేఁ జెప్పెద వినుము. 'కప్యాస' వాక్యమునకు - లోతగు నీటినుం
పుట్టి ఉదయించుచున్న సూర్యుని కిరణములచే చక్కఁగా వికసించి
పద్మములవంటి నేత్రములుగల శ్రీ మహావిష్ణువు' అని వివరిం
తాము చెప్పిన పోలిక పొసఁగ దనిరి.

ఈ సముచిత వ్యాఖ్యానమునకు సంతసింపవలసిన యాదవుఁ
మత్సర గ్రస్తుఁడై, మూర్ఖ చిత్తుఁడై, రామానుజులను అనేక
ముల దూషించెను. అంతట రామానుజులు ఆ యాదవుని

---

7 ఛాందోగ్యోపనిషత్తు : 1 - 6 - 7

8 ప్రపన్నామృతము 8 - 18 - 14

వేదాంత శాస్త్రాధ్యయనమును [illegible]ంచిపూరుల నియమా
నానుసారము వరదరాజ స్వామికి తీర్థ కైంకర్యము చేయుచు గిరి

## స్తోత్రరత్న శ్రవణము

శ్రీ రంగమున యామును లీ వృత్తాంతమును విని, తమ శిష్యులగు పెరియనంబిని[1] పిలిచి, రామానుజులు వినునట్లు స్తోత్ర రత్నమును పఠింప నియమించిరి. పూర్ణాచార్యులు వెంటనే కాంచీపురమున కరిగి, వరదరాజస్వామి సన్నిధిలో స్తోత్ర రత్నము ననుసంధించుచుండ, స్వర్ణ కుంభముతో తీర్థ కైంకర్యము చేయు రామానుజు లీ శ్లోకము నాకర్ణించిరి

'స్వాభావికా నవధికాతిశయే శిత్వత్వం
నారాయణ త్వయి న మృష్యతి వైదికః కః
బ్రహ్మ శివ శ్శత మఖః పరమ స్స్వరాడి
త్యేతేతి యస్య మహిమార్ణవ విప్రుష స్తే"

శ్రీమన్నారాయణా ! స్వాభావికమును, అవధిలేని అతిశయమును కల నీ సర్వ జగన్నియమన సామర్థ్యము - నారాయణుఁడవగు నీ యందే తగి యున్నది కాని, ఇం కెవ్వరియందును తగదు. బ్రహ్మ, ఈశ్వరుఁడు, దేవేంద్రుఁడు మొదలుగాఁగల దేవత లందఱును నీ మహిమయందలి కణములే'.

ఈ శ్లోక భావమును రామానుజులు గ్రహించి, మిక్కిలి సంతసించి శ్లోకము నెవరు రచించిరని పూర్ణాచార్యులను ప్రశ్నించిరి. ఆ మహనీయులను దర్శింపఁజేయుఁడని రామానుజులు కోరగా, సంత

---

[1] పెరియనంబి

వీరి జన్మస్థానము శ్రీరంగము. వీరికి శ్రీ పరాంకుశదాసులు, మహాపూర్ణులు, పూర్ణాచార్యులు అను నామాంతరములు కలవు.

సమున పెరియనంబి అందుల కంగీకరింప, ఇరువురును శ్రీరంగక్షేత్ర మున కేగిరి

మాయావినోది యగు శ్రీరంగనాథుడు - యామున, రామానుజుల సమాగమము సంభవించిన దో - లీలా విభూతికి ముప్పు వాటిల్లునని తలచి, ఆళవందారుల నాహ్వానించి, పరమ పదము నిచ్చితినని పలికెను రాచవ్రణముతో అప్పటికే బాధ ననుభవించుచున్న యామునులు - ఎనిమిదవ దినమున పరమ పదమునకు వెళ్ళగలనని విన్నవించి, మఠమునకు మరలి వచ్చి, పరతంత్రు లగుటచే తమ కోరిక తీరకయే పరమపదించిరి రామానుజులును, మహాపూర్ణులును కావేరీ తీరమున గుంపులు గుంపులుగా చేరి, అతి దుఃఖతులై యున్న శ్రీ వైష్ణవులను చూచి కారణ మడుగ, అట యామునాచార్యుల పరమపద గమన వార్తను విని, ఇరువురును దిగ్భ్రాంతి చెంది లేచి, మిగుల దుఃఖించి, సేద దీరిన వెంటనే వెడలి, ఆళవందారుల చరమ విగ్రహమును సేవించిరి

## రామానుజ ప్రతిజ్ఞ

శ్రీ రామానుజులు ఆళవందారులను పాదాది కేశాంత పర్యంతము సేవించుచు, ముడుచుకొని యున్న ఆళవందారుల మూడు వ్రేళ్ళను చూచి, ఆశ్చర్య చకితులై, అచటి శ్రీవైష్ణవులతో - 'స్వాములారా! ఇవి మున్నును ఇట్లే యుండెనా?' అని యడుగ, అచ్చటి వైష్ణవులు - 'ఎప్పు డిట్లు లేదు, ఇప్పుడే ఇట్లయ్యెను ఇందులకు కారణము నెఱుంగ మీరే సమర్థులు' అని పలికిరి ఆ పలుకులు విని, పరేంగితజ్ఞు[10] లగు రామానుజులు - ఈ రీతిగా ప్రతిజ్ఞ చేసిరి -

---

10 పరేంగితజులు = ఇతరుల మనోభావములను గ్రహింపగల్గినవారు

'నేను శ్రీవైష్ణవ మత మవలంబించి, దానిని పరిపుష్టి గావించి, ాయా మోహితు లగు జనులను పంచసంస్కారపరులఁ గావించి, వ్య ప్రబంధాధ్యయన పరులుగను, ప్రపత్తి పరులుగను చేసి ంతు నని పలుక, యామునుల వ్రే లొకటి యథాప్రకారము పోయెను

'సకలార్థములు గ్రహించి, తత్త్వజ్ఞాన పరముగా బ్రహ్మసూత్ర ష్యమును ప్రజల శ్రేయస్సు నభిలషించి రచింతు' నని రామాను లు పలుక, యామునుల రెండవ వ్రేలు విడిపోయెను

'లోకోపకారకులగు వ్యాస పరాశరులు - జీవేశ్వరాదులను, రి స్వభావములను భగవత్ప్రాప్తికి మార్గములను వివరించుచు, రాణరత్నమగు విష్ణుపురాణమును రచించిన మహాప్రాజ్ఞులు అట్టి ్యాస పరాశర నామములతో ఇరువురును తీర్చి దిద్ది, పరాశరునిచే ష్ణ సహస్రనామ స్తోత్రమునకు 'భగవద్గుణ దర్పణ ప్రకాశిక' యను ్యాఖ్యానము నొకదానిని రచింపఁజేయఁగల' నని రామానుజు లన్నం నే, యామునుల మూఁడవ వ్రేలు విడిపోయెను ఆత్మ విజ్ఞాన ధను గు రామానుజు లిట్లు యామునుల కోరికలను గుర్తించి, వారి కోరి లను సఫలముగావింపఁగలనని ప్రతిజ్ఞ చేసిరి

తదుపరి రామానుజులు - ఆశ్చర్యానంద నిమగ్నులైన శ్రీవైష్ణ ులకు అభివందన మాచరించి, కాంచీపురికిఁ బోవ నుద్యుక్తులు కాగా, గారిని స్వాములు - శ్రీరంగనాథులను సేవించి పోగోరిరి అపుడు ామానుజులు - 'స్వాములారా! యామున - రామానుజ సమాగ ంమే జరిగి యున్నచో, ఇరువురము పరమ పదమునకు సోపానములు ర్మించియుండెడివారము ఆ మాత్రము అవకాశము కల్గించని ర్దయుఁడైన శ్రీరంగనాథుని సేవింపఁజాల' నని పలికి, తిరిగి కాంచీ ురికి విచ్చేసిరి. మఱునాటి ఉదయము కాంచీపూర్ణులను దర్శించి, జరి

గిన వృత్తాంతమును నివేదించి, రామానుజులు మఱల యథా ప్రకారము వరదరాజస్వామికి తీర్థకైంకర్యము చేయసాగిరి

## రామానుజుల మనోవేదన

వరదరాజస్వామికి మిక్కిలి ప్రీతి పాత్రు లగు కాంచీ పూర్ణులను రామానుజులు గురువుగా భావించి, వారి నొకనాఁడు తమ గృహమునకు ఆతిథ్యమున కాహ్వానించిరి కాంచీపూర్ణు లందుల కంగీకరించిరి అంతట తమ ధర్మపత్ని యగు తంజమాంబచే బహువిధము లగు భోజన పదార్థములను సిద్ధము చేయించి, తిరువారాధనమును పూర్తిగావించి, కాంచీపూర్ణుల రాకకై నిరీక్షించుచుండిరి కాని, ఎంతకును వారు విచ్చేయకున్నందున, 'కుల గౌరవమును పాటించి, వారు నాపాటుకు వచ్చెదరో లేదో!' యని సంశయించి, కాంచీపూర్ణుల కొఱకు దక్షిణ మార్గమున వెళ్ళె ఇంతలో కాంచీపూర్ణులు కరిగిరికి ఉత్తర మార్గమున వేంచేసి, వారి దేవేరిని యన్నమిడు మని యారగించి, త్వరిత గతిగా - మఠమునకు విచ్చేసిరి అంతకు మున్ను రామానుజులు కాంచీపూర్ణులను మఠమునఁ గానక, మరలి వచ్చి, భార్యనుఁ జూచి కారణ మడుగ, ఆమెయు - తిరుక్కచ్చినంబి యారగించిన తావును శుద్ధి చేసిన కతమున, స్నానము చేసితి నని పలుక, రామానుజులు గురు ప్రసాదము లభింపక పోయినందులకు మిగుల చింతించి, భార్య యొనర్చిన యకృత్యమునకు సహింపకుండెను

## రామానుజుల ధర్మసందేహములు

## వరదరాజుల సమాధానములు

ఒకనాడు రామానుజులు తిరుక్కచ్చినంబినిఁ జూచి, మీరు వరదునితో మాటాడునపుడు నా మనమునఁగల భిన్న సందేహములకు

సమాధానములను ఎందునిచే తెలిసికొని నా కానతీయవలెనని ప్రార్థించుచు, తమ ధర్మ సందేహములను వివరించి చెప్పిరి ఆ కాంచీపూర్ణులును[8] అట్లే యని సమ్మతించి, రామానుజుల ధర్మ సందేహములను వరదరాజులకు విన్నవించిరి. అపుడా దేవరాజులు —

"అహమేవ పరంబ్రహ్మ, జగత్కారణ కారణం
క్షేత్రజ్ఞేశ్వరయో ర్భేదః సిద్ధ యేవ మహామతే!
మోక్షోపాయో న్యాస మేవ జనానాం మోక్ష మిచ్ఛతాం
మద్భక్తానాం జనానాం చ నాంతిమస్మృతి రిష్యతే
దేహావసానే భక్తానాం, దదామి పరమం పదం
పూర్ణాచార్యం మహాత్మానం సమాశ్రయ గుణాశ్రయం
ఇతి రామానుజాచార్యాయ వయోక్తం ఎద సత్వరమ్ "॥

పరతత్త్వమైన నేనే పరబ్రహ్మను సకల జగత్తులకు నేనే కారణుడను ఆత్మ - పరమాత్మల భేదము స్వతస్సిద్ధము ప్రపన్నులకు ప్రపత్తియే మోక్షోపాయము నా భక్తునకు అంతిమ స్మరణముతో నిమిత్తము లేదు దేహావసానమున నేనే మోక్షము నొసంగెదను. మహాత్ముడగు పూర్ణాచార్యుని ఆశ్రయింపుమని రామానుజులకు వెంటనే తెలియజేయుము' అని యిట్లు సమాధానములు తెలుప, ఈ విశేషములను కాంచీపూర్ణులు సత్వరము రామానుజుల కెఱింగించిరి. అంతట రామానుజులును సంతుష్టాంతరంగులై, పెరియనంబి నాశ్రయించుటకై శ్రీరంగమునకు పయనమైరి.

---

8. ప్రపన్నామృతము 10 - 63 నుండి 66 వరకు

## రామానుజులు మహాపూర్ణులవద్ద పంచసంస్కారములు పొందుట

శ్రీరంగమున వైష్ణవస్వాము లెల్లరును ఒకచో సమావేశ
యామునాచార్యుల యనంతరము రామానుజాచార్యులే ఆచార్య స్థ
మున కర్హులని ఏకగ్రీవముగ నిర్ణయించి, మహాపూర్ణులను
ప్రసిద్ధిగాంచిన పెరియనంబిని ఆహ్వానించి, రామానుజులకు పం
సంస్కారముల గావించవలెననియు, పూర్వాచార్యుల గ్రంథమ
నెరుక పఱచి, వారిని కాంచీపురమునుండి శ్రీరంగమునకు తోడ్కొ
రావలసిన దనియు పెరియనంబిని ప్రార్థించిరి

మహాపూర్ణు లందులకు సంతోషముతో అంగీకరించి, సకుటు
ముగ బయలుదేరి కాంచీపురమునకు వచ్చుచుండ, మార్గమధ్యమ
గల మధురాంతకాగ్రహారమునకు వారు వచ్చియున్నట్లు రామా
జులు తెలిసికొని, యెదు రేగి, వారిని దర్శించిరి వా రిరువురును
స్పరము ఆశ్చర్య చకితు లైరి రామానుజులు మహాపూర్ణుల పాద
లపైఁ బడి, పంచసంస్కారపరుని గావించి రక్షింపుఁడని ప్రార్థిం
మహాపూర్ణు లందుల కంగీకరించి, కాంచీపురమున వరదరాజుల స
ధిలో పంచసంస్కారములు కావింతునని పలుక, అపుడు రామా
జులు - 'స్వామీ! దేహ మశాశ్వతము ఇంతకు మున్నొకప
యామునులను దర్శింపఁ బోవ, వా రపుడే పరమపదించిరి విధి
నెఱుంగము కావున, కృపతో పంచసంస్కారములను వెంటనే చేఁ
డని ప్రార్థించిరి

రామానుజుల ఆర్తిని గమనించిన మహాపూర్ణులు - ఆ మ
రాంతకమునఁగల కోదండ రామాలయమున, వకుళ వృక్షము క్రిం
రామానుజులకు యథా విధిగా పంచసంస్కారములు కావించి, ఆ

ష్ఠమై, అర్చా రూపిమైన వరదరాజస్వామి నొసంగిరి పంచ స్కార సంశోభితులైన రామానుజులు - తమ ఆచార్యులగు మహా ర్ణులను పూజించి, వారితో కాంచీపురికి విచ్చేసి, తమ గృహా లో అర్థ భాగము నివాసమునకై వారి కొసంగి, వారి సన్నిధిలో - విడ దివ్య ప్రబంధములు, వ్యాస సూత్రములు అధ్యయనము ముచు, ఆఱు మాసములు గడపిరి

## కాంతిమతి యపచారములు

ఇట్లుండ నొకనాఁడు రామానుజులు - తమకు తల యంటుట వైష్ణవ బ్రహ్మచారి రాఁగా, అతఁడు మిగుల ఆకలి గొని న్నట్లు గ్రహించి, భార్యను పిలిచి, అతనికి చద్ది యన్నము బెట్టు ఆజ్ఞాపింప, ఆమె - రాత్రి సాదము ఏమియు లేదని నుడివెను కట రామానుజులు సందేహించి, ఇంటిలోనికి వెళ్ళి చూడఁగా, పురకు చాలినంత చద్ది యుండుటను చూచి, ఆగ్రహోదగ్రులై, ర్యను కఠినముగ దండించిరి

మఱియొకనాఁడు తంజమాంబ - నీటికై బావి కేగెను. అప్పుడే పూర్ణుల భార్యయగు విజయమాంబయు నీటికై బావి కడకు నెను. వా రిరువురును తమ బిందెలకు త్రాడు గట్టి, ఒకేసారి లో వేసిరి వా రట్లు నీటిని తోడుకొనుటలో - మహాపూర్ణుల ర్య బిందెనుండి, రామానుజుల భార్య బిందెలోనికి నీటి బిందువులు వచ్చి పడెను ఆచార్యుని భార్య తనకు పూజనీయురాలు అను రూప జ్ఞానమును మఱచి తంజమాంబ - విజయమాంబను పరుష ములతో దూషించెను ఇందులకు విజయమాంబ మిగుల వగచి, ామున కేగి, పూర్ణాచార్యుల కీ వృత్తాంతమును నివేదింప, వారు

భార్యపై ఆగ్రహించి, రామానుజులకు తెలియక ముందే, కుటుంబ సమేతముగ శ్రీరంగమున కేగిరి తదుపరి రామానుజులు తమ గృహమున ఆచార్యులను వెదకుచు, జరిగిన వృత్తాంతమును ఇరుగు పొరుగు వారి వలన గ్రహించి, క్రోధారుణిత నేత్రులై, భాగవతాపచారము చేయుచున్న భార్యను మిక్కిలి కోపించి, ఆమెను పుట్టినింట వదలి వేయుదునని పలికిరి అంత, భయ విహ్వలయై దుఃఖించుచున్న తంజమాంబను చూచి జాలిపడి, మిన్నకుండిరి

ఒకనాఁడు – వరదరాజస్వామి కైంకర్య నిమగ్నులైన రామానుజుల నొక వైష్ణవ పండితుఁడు - ఆకలి దప్పులచే బాధపడుచు, భోజనము నర్థించెను అపుడు రామానుజు లాతనితో - 'ఇది వరదరాజుల ఉత్సవ సమయము గనుక, నే నిపుడు మా యింటికివచ్చు అవకాశము లేదు కావున, మీరు మా యింటికి వెళ్ళి, మీ సంగతిని నా మాటగా నా భార్యకు తెలియఁజేసి, ఆమె యిడు భోజనమును భుజించి, మరల నిచటకు వేంచేయుఁ'డని పలికెను ఆ వైష్ణవ పండితుఁడట్లే రామానుజుల గృహమున కేతెంచి, వారి భార్యయగు తంజమాంబతో ప్రస్తుతాంశమును సవినయముగ చెప్పఁగా, ఆమె విని, 'నిన్ను పంపినవారినే అన్న మడుగు' మని పలికి, కోపముతో ఇంటి తలుపులను తటాలున వైచెను

వైష్ణవుఁడు తిరిగి రామానుజుల వద్దకు వచ్చి, జరిగిన వృత్తాంతమును నివేదింప, రామానుజులు మిగుల విచారము నంది, హితముగ వర్తించని సతిని పరిత్యజించి, సన్యసించుట విధి విహితమని తలంచి, గృహమున కేతెంచి, తమ కాంతయగు తంజమాంబను యుక్తితో పుట్టినింటికి పంపివైచిరి

## రామానుజులు సన్యసించుట

అనంతరము రామానుజులు తమ గృహారామక్షేత్రములను
న ధాన్యములను విడిచి వైచి, విరక్తులై, శ్రీ వరదరాజస్వామి
ననుమతితో - 32 సంవత్సరముల ప్రాయమున (క్రీ శ 1049),
ోక కల్యాణార్థము అనంత సరి స్త్రీరమున సన్యసించిరి ఇందులకు
రదరాజులు మిగుల సంతసించి, సకల మర్యాదలతో రామానుజులను
ొడ్కొని రమ్మని, తమ సమస్త పరివారముతో కాంచీపూర్ణులను
ంపిరి వారితో కూడి రామానుజులు బయలుదేరి వచ్చి, వరదరాజు
ను భక్తితో సేవించిరి వరదరాజులు రామానుజులను సముచితముగ
మ్మానించి, సంతోషమున వారికి 'యతిరాజులు' అను నామకరణాము
వించి, వారి నొక మఠమున ప్రవేశపెట్టుమని కాంచీపూర్ణ నాజ్ఞా
ంచిరి

ఈ రీతిగ రామానుజులు – అనుకూలవతి కాని అర్ధాంగిని విడ
డి, భగవ దాజ్ఞ చే సన్యసించి, వరదరాజులచే నొసంగఁబడిన మఠ
ంన ప్రవేశించి, కాంచీపురవాసులను, పరిసరప్రాంతీయులను ధర్మ
త్పరులఁ గావించుచు, సంతోషముగ కాలము గడుపుచుండిరి

ఇట్లుండ, రామానుజుల మేనల్లుఁడగు 'దాశరథి'[2] - మొదట

---

2, దాశరథి

వీర జన్మస్థానము కాంచీపురమునకు సమీపమున, ఆ ఖింఛమంగల గ్రామము
వీరు కందాడై వంశమునకు మూలపురుషులు వాధూల గోత్రము వీరికి - ముదలి
యాణ్డాన్ రామానుజన్ పొన్నడి శ్రీవైష్ణవ దాసర్, తిరుమల పూర్వన్ అను
నామాంతరములు కలవు వీరు రామానుజుల మేనల్లుఁడు వారికి అంతరంగిక
శిష్యులై, వారిచే - త్రిదండ ఎమానులుగ భావింపఁబడిన పరమ భాగవతోత్తములు
రామానుజుల వద్దనే వేదాంత శాస్త్రములను అధ్యయనము గావించి, రహస్యత్రయ'
మను గ్రంథమును రచించి, పేరు గాంచిన వైదుష్య సంపన్నులు

శిష్యుఁడుగా చేర, పిదపరి, కూరనాథుఁడు రామానుజుల నాశ్రయించెను

## రామానుజులకు యాదవుఁడు శిష్యుఁ డగుట

మహనీయులుగా, మహా మహిమోపేతులుగా ఖ్యాతి గాంచి విరాజిల్లుచున్న యతిరాజుల నొకనాఁడు - యాదవప్రకాశుని తల్లి రామానుజ మఠమున సేవించి, రామానుజ సూక్తులు విని, రామానుజ సిద్ధాంతమునందు అభిరుచి గల్గినదై, 'నా కుమారుఁడుకూడ యతిరాజుల నాశ్రయించిన బాగుగా నుండుననితలంచెను తలంచుటే కాదు - వెంటనే తమ యాశ్రమమున కేతెంచి, తనయుఁడగు యాదవునకు తన యభిమతము నిట్లు తెలియఁజెప్పెను -

"నాయనా! యాదవా! రామానుజులు సామాన్యులు కారు ధర్మ సంరక్షణార్థము భగవదాజ్ఞాబద్ధులై, ఆదిశేషాంశతో అవతరించిన మహానుభావులు ఆ యతిరాజులు అందఱి శ్రేయమును అభిలషించువారు విశాల హృదయులు సత్త్వగుణ సంపన్నులు. కరుణాంతరంగులు కేవల పాండిత్యము, ఆచార వ్యవహారములు నిరర్థకములు పరమార్థ దృష్టి యున్నపుడే అట్టివి ఫలవంతములు కాఁగలవు శ్రీమన్నారాయణుఁడే సృష్టి స్థితి లయములకు కారణ భూతుఁడు బ్రహ్మరుద్రేంద్రాదు లందఱును అట్టి శ్రీమన్నారాయణుని అంశతో నుదయించినవారే పరాశరాది మహర్షులు - జగన్నాథుఁడగు శ్రీమన్నారాయణుని ఆశ్రయించియే మోక్ష పదవి నందఁ గల్గిరి కనుక, నీవును యతిరాజుల నాశ్రయించి, జన్మమును సార్థకము గావించుకొనుట మేలు."

తన మేలును కోరి, మాతృమూర్తి బోధించిన ఈ హితోక్తులకు యాదవుఁ డాకర్ణించి, 'అమ్మా! నీ వాక్కులు వాస్తవములు

అది నా జీవిత శేషమునకు రాచబాటలు. నీ ఆజ్ఞను అవశ్యము శిరసావహింపవలసినదే. ఇం దేవమాత్రముకూడ సందియము లేదు. కాని, ఇంతకు మున్ను నేఁ జేసిన మహాపాపములకు ప్రాయశ్చిత్తముగ, నేను ముందుగా భూప్రదక్షిణము చేయవలసియున్నది. కాని, వార్ధక్యమువలన నేనిపు డందులకు సమర్థుఁడను కాఁజాలకున్నాను' అని, యాదవప్రకాశుఁడు బదులు పలికెను. తనయుని మాటలను తల్లి విని, 'నాయనా! భగవదంశ సంభూతులగు యతిరాజులకు ప్రదక్షిణము చేసినచో, భూప్రదక్షిణము చేసిన ఫలము లభించు' నని ఉపాయము తెలిపెను. అపుడు యాదవుఁడు సంశయగ్రస్తమానసుఁడై, మాతృమూర్తి యాజ్ఞానుసారము రామానుజుల సన్నిధి కేఁగెంచి, 'యతిరాజా! నీవు శంఖ చక్రములను, ఊర్ధ్వపుండ్రములను ధరించి, నిర్గుణ పరబ్రహ్మమునకు సగుణత్వము నాపాదించితివి కదా! దీనికి శాస్త్ర ప్రమాణము లేవేని కలవా? ఉన్నచో - వివరింపు' మనఁగా - రామానుజు లా మాటలు విని, ఆతని ధర్మసందేహములను నివారించుటకు కూరేశుని నియోగించిరి.

కూరేశుఁడు ఆచార్యుల ఆజ్ఞను శిరసావహించి, యాదవప్రకాశునితో నిట్లు పలికెను - 'ఓ విద్వాంసుఁడా! శంఖ చక్ర ధారణమునకు, పరబ్రహ్మ సగుణుఁడనుటకు, శ్రీమన్నారాయణుఁడే పరతత్త్వమనుటకును శ్రుతి స్మృతీతిహాస పురాణములలో ప్రమాణము లనేకములు కలవు' అని, శ్రుతులు, పరాశర సంహిత, మహాభారతమునందలి భీష్మ పర్వము, లింగ పురాణము, స్కాంద పురాణము, విష్ణు పురాణము, శ్రీమద్భాగవత పురాణము, పద్మ పురాణము, పరాశర స్మృతి, అథర్వ శిఖోపనిషత్తు, మహోపనిషత్తు, అగ్ని పురాణము, బ్రహ్మాండ పురాణము, ఈశ్వర సంహిత, శేష ధర్మము, మోక్ష ధర్మము, విష్ణు ధర్మోత్తరము మున్నగు వాని నుండి ప్రమాణములను

విన్నవింప, అపుడు యాదవుఁడు మరల రామానుజులను దర్శించి, వెడలి పోయెను

ఆనాటి రాత్రియందే యాదవుని స్వప్నమున వరదరాజులు సాక్షాత్కరించి, సంశయగ్రస్త మానసుఁడై యున్న అతనితో - 'యామునా! నీ జనని రామానుజులను గుఱించి చెప్పిన మాటలు సత్యములు కనుక, యతిరాజుల నాశ్రయించుటకంటెను నీకు మోక్షో పాయము వేఱేదియు లేదు. కనుక, నీవు విచారమును వీడి, వెంటనే రామానుజుల నాశ్రయింపు మని పలికి, అంతర్థాన మయ్యెను

యాదవుఁడు స్వప్న వృత్తాంతమును సైతము విశ్వసింపఁ జాలక, కాంచీపూర్ణులకడ కేగి, తన మనమునందలి సంశయములను వరదరాజులకు విన్నవింప వేడుకొనెను అంతట కాంచీపూర్ణులు యాదవుని వృత్తాంతమును వరదరాజులకు విన్నవింప, ఆ స్వామి, 'కాంచీపూర్ణా! తన తల్లి స్వయముగా వాత్సల్య భావమున బోధించి నను, నేను స్వప్నమున అనుగ్రహముతోఁ జెప్పినను అతని కింకను స్థిమితము చిక్కలేదు ఇప్పటికైనను మించినది లేదు, వెంటనే రామానుజుల నాశ్రయించి, మోక్షసామ్రాజ్యమును పొందుమని నా మాటలుగా యాదవప్రకాశునితోఁ జెప్పు' మనెను

కాంచీపూర్ణులు వరదరాజుల కరుణాంతరంగమును యాదవున కెఱింగింప, అపు డా యాదవుఁడు సంశయమును వీడి, రామానుజుల సన్నిధికిఁ జేరి, భక్తితో ప్రదక్షిణ మాచరించి, పాదములపైఁ బడి, దయతో రక్షింపవేడెను దయాసముద్రు లగు యతిరాజులు యాదవ ప్రకాశులను లేవనెత్తి, ఆదరమున మౌంజీబంధనాదులఁ జేసి, పంచ సంస్కారములు గావించి, సన్న్యాసాశ్రమము నొసఁగి, 'గోవిందదాసుఁ' డను దాసనామము నుంచిరి. ఆ గోవిందదాసునకు రామానుజ సంయ

ంద్రులు స్వయముగా వైష్ణవ గ్రంథముల నుపదేశించి, యాదవుఁడు మున్ను గావించిన శ్రీవైష్ణవ దూషణ పరిహారార్థమై, ఏదేని ఒక గ్రంథమును రచింపు మనిరి గోవిందదాసుఁడు యతిరాజుల ఆజ్ఞాను సారము 'త్రిదండ సన్యాస విధి' యగు సన్యాసి ధర్మములు గల 'యతి ర్మ సముచ్చయ' మను నొక గ్రంథమును రచించి, యతిరాజులకుఁ ూప, వారు దానిని కటాక్షించిరి గోవింద దాసుఁడు ఆచార్య కైంక ర్యము చేయుచు, తన జన్మమును ధన్యము గావించుకొని, దేహావ ానమున మోక్ష సామ్రాజ్యమును పొందెను

## రామానుజులు గోవిందుని సముద్ధరింప యత్నించుట

మున్ను కాశీ యాత్రకు తమతో బయలుదేరివచ్చిన తమ పిన ల్లి కుమారుఁడగు గోవిందాచార్యుఁడు, కాశీ క్షేత్రమున గంగా దిలో తనకు శివ లింగము లభించిన యనంతరము - గురువగు ాదవప్రకాశుని బోధచే శివభక్తుఁడై, ఆ శివ లింగమును తన గ్రామమున ప్రతిష్ఠించి, అటు పిమ్మట కాళహస్తికి చేరి, అచట పూజా దురంధరుఁడై యున్నట్లు మున్నే తెలిసె గదా! అట్టి విందార్యుని సరిదిద్దుటకై, రామానుజులు - తిరుమలలో నున్న తమ నమామ యగు శ్రీశైలపూర్ణుల కొక లేఖ వ్రాసి, దానిని తమ ్యుల మూలమునఁ బంపిరి

## రామానుజులు శ్రీరంగమునకు వేంచేయుట

అట శ్రీరంగమున శ్రీవైష్ణవు లందఱును శ్రీ రామానుజ భవమును విని, వారి నెట్లైన శ్రీరంగమునకు రప్పించవలసినదని రంగనాథుని ప్రార్థించిరి శ్రీరంగనాథుఁ డంత, రామానుజులను

శ్రీరంగమునకు పంపఁగోరుచు నొక లేఖ వ్రాయించి, ఒక శ్రీవైష్ణవోత్తముని ద్వారా వరదరాజులకు పంపెను కాని, దానిని వరద రాజులు నిరాకరింప, చతురుఁడగు శ్రీరంగనాథుఁడు - ఆళవందారుల పుత్రులును, 'తిరువరంగ ప్పెరుమాళ్ అరయరు' అను పేరు గాంచిన వారును అగు వరరంగాచార్యులను పిలిచి, 'ఓ దేవగాన విశారదా! నీవు కాంచీపురమున కేగి, నీ నృత్యగాన విశేషములచే ఎట్లైనీ వరద రాజులను మెప్పించి, ఇతర బహుమానము లేవియేని గైకొనక, ఉపాయముగ యతిరాజులను పారితోషికముగా స్వీకరించి రావలెనని ఆజ్ఞాపించి పంపిరి శ్రీరంగనాథుని ఆజ్ఞానుసారము వరరంగాచార్యులు కాంచీపురి కరిగి, అచట సురుచిర వేషమును ధరించి, వరదరాజులను సేవించి, పూదత్తాళ్వారుల పాశురములను దేవగానమున చక్కఁగా అభినయించుచు పాడిరి శ్రీ భూదేవీ సమేతుఁడైన వరదరాజులు పరవశుఁడై, ఆ వరరంగాచార్యులకు అమూల్యములగు స్వర్ణాభరణములను బహూకరించెను కాని, వరరంగుఁడు వానిని స్వీకరింపక, 'నేను కోరినదానిని సాదరముగ నాకు ప్రసాదింపుఁ' డని ప్రార్థించెను

అపుడు వరదరాజులు - ఏదేని నీ యభిమతమగుదాని కోరు కొనుమని వరరంగునితో పలికెను దానికి వరరంగాచార్యులు - 'శ్రీరంగనికోఱకు యతిరాజులను ప్రసాదింపవలెనని నా కోరిక. ఇంతకంటెను మఱే కోరికయు నాకు లే' దని పలికెను అందులకు వరద రాజులు అనేక విధముల చింతించి, 'రామానుజులను తప్ప, ఇతర మేదేని ఇచ్చెద' ననిరి అపుడు- వాక్చతురుఁడైన వరరంగార్యులు - 'స్వామీ! ఆడితప్పుట పాడిగాదు, ఆ పైన మీ యిష్ట' మని నిష్ఠురముగఁ బలుక, వరదరాజు లపుడు రామానుజులను రావించి, శ్రీరంగమునకుఁ బోవ ననుజ్ఞ నొసంగెను రామానుజు లంతట వరరంగార్యునితోఁ గలిసి పయనమై, శ్రీరంగమున కరిగిరి

ఈ శుభవార్తను శ్రీరంగనాథుడు విని, సంతోషాతిరేకమున మహాపూర్ణులను రావించి, 'ఛత్ర చామరములతో, శ్రీవైష్ణవ బృందముతో, పురజనులతో, పరిజనులతో నీవు బయలుదేరి వెళ్ళి, రామానుజులను మహా వైభవమున మా సన్నిధికి వేంచేపుచేసికొని రావలె' నని ఆజ్ఞాపించెను. రంగనాథుని ఆజ్ఞానుసారము మహాపూర్ణులు సకల సన్నాహములతో రామానుజులకు ఎదురేగి, అచట వారికి స్వాగత మొసంగి, గారిని వెంట నిడుకొని, రంగనాథుని సన్నిధికి చేర్చిరి.

అపుడు రామానుజులు శ్రీరంగరాజ చరణారవిందములకు భక్తితో - సాష్టాంగ దండప్రణామము లాచరించిరి. శ్రీరంగనాథుడంతట, 'యతిసార్వభౌమా! చేతనాచేతనములను నేటివఱకు నేను రక్షించుచుంటిని. నే నిక విశ్రమింప నెంచితిని. కనుక, నీవు లోకమునందలి జనులను శేషభూతులనుగా నొనర్చుకొని పాలింపుము. ఇపుడే ఈ ఉభయ విభూతులను స్వాధీనము గావించుచున్నాను. నీ విచటనే యుండి, సన్నిధి కార్యక్రమముల నన్నిటిని పర్యవేక్షించుచుండవలె' నని పలికి, రామానుజులకు 'ఉభయ విభూతి నాయకులు' అను నామ మొసంగెను.

రామానుజులు శ్రీరంగనాథునకు మరల భక్తితో ప్రణమిల్లి, 'ఇది యంతయు మహాపూర్ణుల యనుగ్రహ విశేష' మనిరి. పూర్ణాచార్యులది విని, 'రామానుజా! పూర్వము నమ్మాళ్వారులు తిరువాయిమొళిలో - భూలోకమున కొంతకాలమునకు మహాత్ముడొకడు జన్మించి, మిమ్ముల నందఱను తరింపజేయును. అతనివలన కలి దోషములు నశించు' నని సెల విచ్చిరి. అందువల్లనే రంగనాథుడు నీకు ఉభయ విభూతి నాయకత్వము నొసంగెను. కనుక, నీ విచటనే యుండి, జనులను రక్షింపు' మని పాయించిరి. రామానుజు లంతట, 'శ్రీరంగ

నాథా! నీ యాజ్ఞానుసారము సేవ చేయుట కంటెను ఇక నాకు కావలసిన దేమున్నది!' అని భక్తితో విన్నవించి, నీలమేఘ శ్యాముఁడు, పీతాంబర ధరుఁడు, శేష శయనుఁడు నగు శ్రీరంగనాథుని పాదాది కేశ పర్యంతము ఆనంద బాష్పములు జాలువార సేవించి, భక్తితో ప్రణాతులిడి, తీర్థ శఠకోపములను స్వీకరించి, గరుడ మండపమున కూర్చుండిరి తదుపరి, రంగనాథుని పరిచారిక వర్గము నంతటిని రావించి, శ్రీరంగనాథుని కైంకర్యములను భక్తితో, అప్రమత్తతో నిర్వర్తించుచుండుడని హెచ్చరించి, సేవలకై సమర్థులగు మఱి కొందఱను నియమించిరి తదుపరి, శ్రీరంగనాథుని ఆజ్ఞపై, సకల మర్యాదలతో తమకు నిర్దేశింపఁబడిన మఠమున ప్రవేశించి, చేతనోద్ధరణము గావించుచుండిరి (ఈ మఠమే నేఁడు 'శ్రీరంగ రామానుజ జీయర్ మఠ' మను పేర సుప్రసిద్ధమై యున్నది )

## గోవిందార్యుఁడు మఱల వైష్ణవుఁ డగుట

ఇంతకు మున్ను రామానుజులచే పంపఁబడిన వైష్ణవులు శ్రీరంగమున కేతెంచి, రామానుజులను దర్శించి, గోవిందార్యులు మఱల శ్రీవైష్ణవుఁడైన విధమును రామానుజుల కిట్లు విన్నవించిరి -

'తమ కోరికపై శ్రీశైలపూర్ణులు కాళహస్తికి వేంచేసి, అభిషేక తీర్థము తెచ్చు గోవిందుని చూచిరి అతఁడు వీరిని చూచియు పలుకరింపఁడయ్యెను పెదతిరుమలనంబి తిరిగి తిరుమలకుఁ బోయిరి కొన్ని దినములకు పిమ్మట మాతో తిరిగి కాళహస్తికి వేంచేసి, యామునాచార్య విరచితమైన 'స్వాభావికానవధికా' అను శ్లోకమును ఒక పత్రముపై వ్రాసి, దానిని గోవిందుఁడు వచ్చు దారిలో పడవైచిరి గోవిందుఁడు వచ్చి, ఆ శ్లోకమును చూచి, 'ఓ వైష్ణవోత్తమా మీ తత్త్వార్థములు క్రిందికి జారిపడిన' వని పరిహాసము గావించుచు,

ఆ పత్రము నీయఁగా, శ్రీశైలపూర్ణులు - 'నాయనా! మేము జారువారము కాము చ్యుతి లేని అచ్యుతుని ఆశ్రయించిన వారమని చెప్పఁగా, సమాధానము చెప్పఁజాలక, గోవిందుఁడు వెడలి పోయెను శ్రీశైల పూర్ణులు తిరిగి తిరుమలకు విచ్చేసిరి"

రామానుజులీ యుదంతము ను విని, శ్రీశైలపూర్ణుల - గోవిందార్యుల సంభాషణమునందలి యంతరార్థమును సభాసదులకు వివరించి, శ్రీశైలపూర్ణులను ప్రస్తుతించి తదుపరి విశేషములను తెలియఁగోరిరి శ్రీవైష్ణవులును యతిరాజుల జగద్గురుత్వమును కీర్తించి, 'రామానుజ యతిసార్వభౌమా! మూఁడవ పర్యాయము తిరుమల శ్రీనివాస భగవానుని సేయుమనమున, శ్రీశైలపూర్ణులు మాతో కాళహస్తికి విచ్చేసి, కాళహస్తీశ్వరుని అర్చనార్థము గోవిందుఁడు ఏ తోటకో పాటలీ పుష్పములు సంగ్రహించునో అచట నొక చెట్టు సీడన వారు సుఖాసీనులై, తిరువాయిమొళి దివ్యప్రబంధ వ్యాఖ్యానమగు భగవద్విషయమును సాయించుచు డిరి ఇంతలో - గోవిందుఁడు వీరికి అప్రవక్షిణముగ వచ్చి, అదియే చెట్టు నెక్కి, పూవులు కోయుచుండెను పిమ్మట శ్రీశైలపూర్ణులు, తిరువాయిమొళి ద్వితీయ శతకము - రెండవ పదిలోని నల్గవ పాశురమునకు - 'శ్రీమన్నారాయణునకే పుష్పములతో పూజసేయఁదగునుగాని, ఇతరులకు తగ' దని సహేతుకముగ వివరించిరి. నమ్మాళ్వారుల శ్రీసూక్తులకు మనసు మారిన గోవిందార్యుఁడు - వెంటనే చెట్టునుండి క్రిందికి దుమికి, రుద్రాక్షమాలను త్రెంపివైచి, శరీరమునఁ గల భస్మమును బాగుగా తుడిచివైచి, పుష్పములను పారవైచి, 'శరణాగతుని రక్షించి కటాక్షించుఁ' డనుచు శ్రీశైలపూర్ణుల పాదములపై వ్రాలెను. ఇది వినిన శైవులు - రయమున నేతెంచి, 'మా యోపాయమున మా గురువును మోసగించెదరా?' యని కలహించిరి అంతట గోవిందుఁడు - 'తెలియని

తనము వలన శివుడే పరబ్రహ్మయని మీకు వచించితిని కాని, నారాయణుడే పరాత్పరుడని నేను కనుగొంటిని కనుక, ఇక మీతో నాకు పని లేదు తొలంగి పొండని ఆ శైవులకు చెప్పి, వారిని పంపి వైచెను

తదుపరి, మహాత్ములగు శ్రీశైలపూర్ణులు గోవిందుని వెంట నిడుకొని తిరుమల కేగి, అట నాతనికి పంచసంస్కారములు గావించి, నాలాయిర దివ్యప్రబంధముల నుపదేశించి, అర్థపంచకమును బోధింప, గోవిందార్యుని నిరంతరము గురుసేవ మొనరించి తేజరిల్లుచుండె' నని శ్రీవైష్ణవ స్వాములు రామానుజులకు విన్నవించిరి శ్రీ రామానుజులు మిగుల సంతసించి, ఆ స్వాములను సత్కరించిరి

## రామానుజులు పెరియనంబివద్ద విశేషార్థములు గ్రహించుట

ఆళవందారులు పరమపదించుటకు ముందు - ఒకనాడు శ్రీరంగనాథుని సేవించుచుండ, రంగనాథుని మెడనుండి ముత్యాల హార మొకటి జారిపడెను అపుడు శ్రీరంగనాథుడు అర్చకునితో- 'ఈ ముత్యాల హారమును యామునుల కంఠసీమ నలంకరించి, తీర్థము, శఠకోపము ఈయవలె ననియు, ఈ ఆళవందారులకు ఏడవ దినమున పరమపదము ననుగ్రహించుచుంటి ననియు పలికిరి అపుడు ఆళవందారులు రామానుజుల రాకను దృష్టిలో నిడుకొని, 8-వ నాటివఱకు తా మీ లీలావిభూతిలో నుండుటకు అనుజ్ఞ నీయవలసినదని రంగనాథు నర్థించిరి కాని, అందులకు రంగనాథుడు అసమ్మతిసూచకముగ మౌనము వహింప, 'మహాప్రసాద' మని మఠమునకు విచ్చేసి, తమ ముఖ్యశిష్యులగు పంచాచార్యులను రావించి, రామానుజులకు పంచసంస్కార పూర్వకముగ ద్వయమంత్రార్థము, ద్రావిడ దివ్యప్రబంధము, దర్శన

విషయములగు నిగమాంత విశేషములు బోధించుటకు మహాపూర్ణులను, తిరుమంత్ర - ద్వయ - చరమశ్లోకార్థముల నుపదేశించుటకు, శ్రీమ ద్రామాయణ విశేషార్థములు వివరించి చెప్పుటకు శ్రీశైలపూర్ణులను, భగవద్విషయమును బోధించుటకు 'తిరుమాలై యాండాన్'[13] అను నామాంతరముగల మాలాధరులను, పంచమోపాయ నిష్ఠను ప్రసాదించుటకు తమ పుత్రులగు తిరువరంగ పెరుమాళరయర్లను నియమించిరి.

ఒకనాడు మహాపూర్ణులు - తమవద్ద వినమ్రులై నిలిచి, [illegible] ర్థముల ననుగ్రహింపుడని ప్రార్థించిన యతిరాజులకు - ద్వయ మంత్రార్థమును, న్యాస తత్త్వమను మహా శాస్త్రమును, నారాయణ పరతత్త్వ నిర్ణయాత్మకమైన పురాణ నిర్ణయ శాస్త్రమును, గీతార్థ సంగ్రహమును, వ్యాస సూత్రములను, శ్రీ పాంచరాత్రాగమశాస్త్ర విశేషములను ఉపదేశించిరి. తదుపరి, తమ కుమారులగు పుండరీకాక్షులను రామానుజులకు శిష్యునిగా జేసి, 'రామానుజా! గోష్ఠీపురమున కేగి, గోష్ఠీపూర్ణులవద్ద[14] మరికొన్ని విశేషార్థములను పొందుమని చెప్పి పంపిరి

---

13 తిరుమాలై యాణ్డాన్.

వీరి జన్మస్థానము అళగర్ కోయిల్. వీరికి మాలాధరులు, జ్ఞానపూర్ణులు మున్నగు నామాంతరములు కలవు.

14 గోష్ఠీ పూర్ణులు.

వీరి నివాసము గోష్ఠీ పురము. దీనిని 'తిరుక్కోట్టియూరు' అనియు వ్యవహరింతురు. గోష్ఠీ పూర్ణులకు - 'గోష్ఠీ పురీశర్' అనియు తిరుక్కోట్టియూరు నమ్బి యనియు నామాంతరములున్నవి. వీరు యామునాచార్యుల శిష్యులు. వీరికి రామానుజుల యందు ప్రీతి అధికము

## రామానుజులు గోష్ఠీపూర్ణులవద్ద తిరుమంత్రమును గ్రహించుట

రామానుజులు గోష్ఠీపురమున కేగి, గోష్ఠీపూర్ణుల పాదపద్మములకు ప్రణమిల్లి, తిరుమంత్రార్థ మనుగ్రహింపు డని ప్రార్థించిరి. ఇంతలో - 'గృహస్థులుగా నుండి, వివిధ వ్యాపకములతో సతమతమగు ఈ గోష్ఠీపూర్ణుల కెట్లు భగవద్గుణానుభవము లభించె' నని రామానుజుల కొక సందేహము కలిగెను. ఇది గ్రహించిన గోష్ఠీపూర్ణులు - 'ముముక్షువుకు సంసార వాంఛ నశించవలె'నని పలుక, రామానుజులు తిరిగి పెరియనంబి సన్నిధి కేతెంచి, వారిని ఆ వాక్యార్థము నడిగిరి. దానికి వారు - 'యతిరాజా! నీవు బాహ్య సన్యాసి' వని వారి ఊహ. వారు -

"పంకా దుత్పతితం కీటం, కీటం పంకా న్నలిప్యతే
లోకా దుత్పద్యతే జ్ఞానీ జ్ఞానీ లోకం న లిప్యతే"

బురదనుండి పురుగు పుట్టును కాని, అది - ఆ బురదను అంటి యుండదు. అట్లే, లోకము నుండి జ్ఞాని జనించును కాని, అతఁడు లోకమును అంటి యుండఁడు' అనునట్లు, వారు - అంతరంగ సన్యాసులు కనుక, మఱియొకసారి వారివద్ద కేగు'మని పంపిరి.

అట్లే మఱల రామానుజులు వారి వద్ద కరుగ, వారు - సాయం సమయమున జలమును నిలఁబెట్టి, 'అది నశించినను, అహంకార - మమకారములు నివృత్తి కావలె గనుక, వెడలి పొ'మ్మని, రామానుజులను త్రిప్పి పంపిరి. రామానుజు లంతట నిరాశతో శ్రీరంగమునకు తిరిగి వేంచేసిరి. రామానుజులు పదునేడుమారులు తిరుక్కోట్టియూరికి పోయి వచ్చుచుండి, తమ కోరిక ఫలించని కారణమున, గోష్ఠీపూర్ణుల శిష్యులఁ జూచి, వారితో తమ కోరికను మిక్కిలి ఆర్తితో విన్నవింప,

కును గోష్ఠీపూర్ణుల కా విషయమునుం దెలిపిరి అందులకు గోష్ఠీ
పూర్ణులు సంతసించి, త్రిదండ పవిత్రములతో మాత్రము రావలసిన
రామానుజులకు కబురు పంపిరి

అంత పదునెనిమిదవమారు - రామానుజులు పరమ హర్షముతో
కూరత్తాళ్వారును,[16] దాశరథియు వెంటనంటి రాగా, గోష్ఠీపూర్ణుల
సన్నిధికి వెళ్ళిరి గోష్ఠీపూర్ణులు ఈ ముగ్గురను చూచి, 'ఈ రాక
' ఏ.ని రామానుజులను ప్రశ్నింప, ఆ ప్రశ్నయందలి యంతరార్థ
ము గ్రహించిన రామానుజులు గోష్ఠీపూర్ణులతో - 'దండమును,
తమను వైకొని తాము దాసుని రమ్మంటిరిగదా! అట్లే వచ్చితి'
విన్నవించిరి గోష్ఠీపూర్ణులు - 'దండ మెవరు? పవిత్ర మెవరు?'
రామానుజులను ప్రశ్నింప, దండము దాశరథి యనియు, పవిత్రము
కూరత్తాళ్వానయు విన్నవింప, 'అట్లయిన నే బోధించు తిరుమంత్ర
స్వార్థములను ఈ యిరువురకుం దప్ప, మరెవ్వరికిని ఉపదేశింపరా'
శాసించి, తిరుమంత్రార్థము నుపదేశించిరి

గోష్ఠీపురమందలి నృసింహస్వామికి ఉత్సవ సమయ మది
యగుటచే, స్వామిని సేవించుటకు నానాదేశములనుండి భక్తులు
గోపతండములుగా నేతెంచిరి అట్టివారి నెల్లజూచి, రామానుజులు

కూరనాథుండు - (క్రీ శ 1 10 1116)

కాంచీపురమునకు సమీపమునంగల 'కూర' మను గ్రామము వీరి జన్మస్థానము
న గోత్రము వీరు భాగ్యవంతులు, వండితులు పరమ భాగవతోత్తములు వైరాగ్య
పూర్ణులు రామానుజుల నాశ్రయించి, వారు శ్రీరంగమునకు వేంచేయంగా, వారిని విడనాడ
లేమ లక్ష్మి వంతయు బీదలకు వంచిపెట్టి అచట భిక్షాటనముతో కాలము గడిపిన
నిష్ఠా గరిష్ఠులు రామానుజులకు పవిత్రమువంటి వారు వీరిని శ్రీవత్సాంక మిశ్రు
, కూరత్తాళ్వారులనియు వ్యవహరింతురు వీరు - ఎంగ స్తవములనే గాక, 'కూరేశ
' మను గ్రంథమును మరి కొన్ని ధ్యాన శ్లోకములను రచించిరి

ఉజ్జీవింపఁజేయనెంచినవారై, ఆలయ గోపుర మధిరోహించి, యాత్రికులగు ఆ భక్తుల నెల్లల నాహ్వానించి, వారికి తిరుమంత్రమును, మంత్రార్థమును బోధించి, తాము ధన్యులైనట్లు తలంచిరి.

గోష్ఠీపూర్ణు లిది విని, కోపోద్రిక్తులై, రామానుజులను పిలిపించి 'నేను చెప్పిన దేమి? నీవు చేసిన దేమి? గురుద్రోహికి నరకమే ఫలమని యెఱుంగవా?' అని ప్రశ్నించిరి. రామానుజు లపుడు - 'ఆచార్యవర్యా! తమ యాజ్ఞ నుల్లంఘించిన నాకొకనికే గదా నరకము! కాని, తమ యనుగ్రహ విశేషమున, మంత్ర - మంత్రార్థముల గ్రహించు జను లెల్లరును పరమ పదమును పొందుదురుగదా యని వానిని వెల్లడించితి' నని ప్రత్యుత్తర మిచ్చిరి. ఇది విని గోష్ఠీపూర్ణులు రామానుజుల కృపా గుణమునకు మిగుల సంతసించి, వారికి 'ఎంబెరుమానారే! (మన్నాథ!) అని పేరిడి, వారిని ఆలింగనము గావించుకొని 'నేటినుండి శ్రీవైష్ణవ సిద్ధాంతము-రామానుజమత'మనుపేర కీర్తింపబడుగాక!' అని మంగళాశాసనము గావించి, మున్ను శ్రీరంగనాథుఁడు - పండితోత్తములచే నెన్నబడిన ఒక వైష్ణవోత్తముని నా వద్దకు చరమశ్లోకోపదేశమునకై పంపెద నని పలికిరి. కనుక, అట్టి చరమశ్లోకమును నీ కిపుడు ఉపదేశింతును. దీనిని నీవు అప్రాకృతుల కుపదేశింపరాదు. సజ్జనుఁడైనను - సంవత్సర కాలము పరీక్షించి ఉపదేశింపవలెను. ఉపదేశము పొందువారి అర్హతనుఁబట్టి, ఆఱు మాసములు కాని, కనీసము మూఁడు మాసములు కాని - పరీక్షించి, మంత్రోపదేశము చేయవచ్చు'నని గోష్ఠీపూర్ణులు సెలవిచ్చి రామానుజులకు చరమశ్లోకమును అర్థసహితముగ నుపదేశించి, తమ కుమారుఁడగు సౌమ్యనారాయణుని యతిరాజుల శిష్యునిగాఁ జేసి, తిరువరంగప్పెరుమాళరయరుల వద్ద మఱికొన్ని విశేషార్థములు గ్రహింపుమని చెప్పి, తాము ధన్యులైనట్లు తలంచిరి.

## రామానుజులవద్ద కూరేశులు
## చరమశ్లోకార్థమును పొందుట

ఒకనాడు కూరేశులు - యతిరాజులను చరమ శ్లోకార్థము
దేశింపుడని ప్రార్థించిరి ఒక సంవత్సర కాలము ఆచార్య శుశ్రూష
వారికే చరమార్థము నుపదేశింపవలెనని గోష్ఠీపూర్ణుల ఆజ్ఞయని
రానుజులు తెలుప, 'శరీర మస్థిరము, సంవత్సర కాలము తాళజాల'
నాథులు వ్యాకులపడుచుండ, 'ఆచార్య సన్నిధిలో - మాసోప
ము ఒక సంవత్సర ఆచార్య సేవకు సమ' మని రామానుజలు
ప, కూరేశులు సంతసమున మాసోపవాసము నాచరించి, చరమ
ర్థము ననుగ్రహించిరి తదుపరి, రామానుజులను సేవించి, చరమ
ర్థమును సాయింపుడని వేడెను అంతట రామానుజు లా కూరే
శరణాగతి ప్రతిపాదకమైన చరమ శ్లోకమును ప్రసాదించిరి.

అటుపిమ్మట 'దాశరథి'యు చరమశ్లోకార్థమును సాయింపు
గ, రామానుజు లాతనిని గోష్ఠిపూర్ణులను ప్రార్థింప నియ
రి, దాశరథి - గోష్ఠిపూర్ణులకు ఆఱు మాసములు సేవఁ జేసినను
పూర్ణులు ప్రసన్నులుగాక, విముఖులై యుండిరి, కాని, చివరకు
ంచి, 'నాయనా! నీవు రామానుజుల సంబంధివలెనున్నావు, నీ
? యని ప్రశ్నింప, దాశరథి - 'స్వామీ! నా పేరు దాశరథి
రు చరమార్థమును గ్రహించుటకై, మా ఆచార్యులగు
రామానుజ యతిశేఖరులు పంపఁగా వచ్చియున్నవాడ' నని విన్న

గోష్ఠిపూర్ణులు - 'నాయనా! విద్యామద, ధనమద, అభిజన
బలనంబడు మూఁడు మదములను వీడి, రామానుజులను శరణు
ు ఆయన నీకు చరమార్థము నుపదేశింపఁగలఁడని తెలుప,
థి తిరిగి శ్రీరంగ మేగి, రామానుజులకు ఈ విషయమును విన్న
ఇది యిట్లుండ -

మహాపూర్ణుల పుత్రిక యగు అత్తుళాయమ్మకు అత్తవారింట పోరు ఏర్పడెను. దాని కామె ఖిలపించుచు వచ్చి, అత్తవారింట పనులు చేయఁజాలనని తన అశక్తతను విన్నవించి, తోడుగా నొక వ్యక్తిని పంపుఁడని తండ్రిని ఆమె ప్రార్థించెను. దానికి వారు - 'అమ్మా! నీవు మీ యన్నయగు రామానుజులవద్దకు వెళ్ళినచో, నీ యత్తవారింట పనులు చేయుటకు తగిన వానిని నియమింపఁగల' రని చెప్పి పంపిరి. అపుడు అత్తుళాయమ్మ - తండ్రి యాజ్ఞ చొప్పున రామానుజుల సన్నిధి కేగి, తన వృత్తాంతమును విన్నవించెను. అంతట, చరమార్థము నిమిత్తము ప్రార్థించుచున్న దాశరథిని, అత్తుళాయమ్మ అత్తవారింట పనులు సేయ నియోగించిరి. ఆచార్యుల ఆజ్ఞను దాశరథి శిరసావహించి, అత్తుళాయమ్మతో బయలుదేరి వెళ్ళి, అచట - ఆమె అత్తవారింట - వారు చెప్పెడు పనులను చేయుచుండెను.

ఇట్లుండ, ఒకనాఁడు - దాశరథి - పాత్రపరిశోధనము చేయుచు, అరుగు మీఁద వైష్ణవులు చేయు శాస్త్రచర్చను వినుచుండిరి. ఇంతలో - ఒక శ్లోకము కొకరు అపార్థము చెప్ప, దాశరథి అది విని, బయటికి వచ్చి, ఆ యర్థము సరియైనది కాదనియు, వేరగు అర్థము కలదనియు విన్నవింప, వారు కోపించి, 'వంటచేయువానికి శాస్త్రచర్చ యేల?' అని యాక్షేపించిరి. కాని, వారి యాక్షేపణమును దాశరథి లెక్క సేయక, శ్లోక వాక్యము యొక్క పూర్వాపరములకు అర్థమును చక్కగా అన్వయించి సాయింప, అత్తుళాయమ్మయు, తదితర బంధుజనులు, శ్రీవైష్ణవస్వాములు అందఱును దాశరథుల పాండిత్యప్రకర్షమునకు సంతుష్టులై, వారిని పూజించి, వారి పాదములపైఁ బడి, వారిని క్షమింప వేఁడుచు, తమ స్వగృహమున కేఁగుఁడని విన్నవించిరి. దానికి దాశరథి - 'ఇచటికి నన్నెవరు పంపిరో, వారివద్దనుండి నాకు పిలుపు వచ్చిననేగాని నేను వెడలిపో' నని స్పష్టముగఁ జెప్పివైచిరి. ఈ వృత్తాంతము శ్రీరంగమున

మానులకు తెలిపి, వెంటనే దాశరథిని రమ్మని కబురుపంపి, ... యమును పీడిన తమ మేనల్లుని రాకవలన సంతసించి, అతని కపు... ంవార్థము నుపదేశించిరి

## రామానుజులు సంప్రదాయ రహస్యములను మఱికొన్ని గ్రహించుట

రామానుజులు పెరియనంబి వద్ద సంప్రదాయ విశేషములను శ్రీపూర్ణులవద్ద తిరుమంత్రార్థమును గ్రహించిన పిమ్మట, మాలాంల వద్ద భగవద్విషయమును, వరరంగార్యులవద్ద పంచమోపాయము ను గ్రహించినవారై, వైష్ణవ లోకమున నొక మణి వలె ప్రకా చుచు, చేతనోత్తారకులై యుండిరి

## ఒక వైష్ణవుడు రామానుజులకు విషాన్నము పెట్టించుట

ఇట్లుండ, రామానుజుల అభ్యుదయమును సహింపజాలని ఒక వైష్ణవున కొక దుర్బుద్ధి పుట్టెను. శ్రీరంగనాథుని సన్నిధి కైంకర్య ము చక్కగ జరుపుడని తత్పరిచారకులకు రామానుజులు నియ మింప, అందొక వైష్ణవుడు ద్వేషాసూయలు గలిగి, విషమిశ్రితాన్న ము రామానుజులకు మాధూకరముగ నిడుమని తన భార్య నాదే శించెను ఎప్పటివలె రామానుజులు మాధూకర వృత్తి కొఱకు రాగా, ఆ భార్య గడగడ వణకుచు, మాధూకరమిడి, వారి పాదములు నమస్కరింప, రామానుజులు సందేహించి, ఆ యన్నమును ఒక కుక్కకు పెట్టగా అది మృతిజెందెను అందువలన, ఆ నాటినుండి రామానుజులు మాధూకరమును విరమించి ఉపవసించియుండిరి

ఈ వృత్తాంతమును గోష్ఠీపూర్ణులు విని, శ్రీరంగమునకు విచ్చేయ, రామానుజులు వారిని కావేరీ తీరమున సేవించి, ఎండచే ఉడుకెత్తియున్న ఇసుకపై సాష్టాంగముగ వ్రాలి, ప్రణామమాచరించి లేచుచున్న, గోష్ఠీపూర్ణులును ఏమియు మాటాడక ఊరకుండిరి అపుడు రామానుజులను పరివేష్టించియున్న శ్రీవైష్ణవులలో నొకరగు కిడాంబి యాచ్చాన్[16] మిగుల పరితపించి, తాను దిగువ వ్రాలి, తనపై యతిరాజులను వేంచేపు చేసికొనెను గోష్ఠీపూర్ణులది చూచి, రామానుజుల శరీర సౌకుమార్యాదుల నెఱింగి ప్రవర్తింపు, 'కిడాంబియాచ్చాన్' తగిన వారని, ఆ కైంకర్యమున కాతనిని నియమించిరి

## రామానుజులు గద్యత్రయమును రచించుట

శ్రీరామానుజులు - శరణాగతి గద్యము, రంగనాథ గద్యము, వైకుంఠ గద్యము అను గద్యత్రయమును భావమధురముగను, భక్తిబంధురముగను రచించి, దానిని శ్రీరంగమున శరణాగతి మండపము నందలి 'ఏకశేర్తి' యందు వేంచేపు చేయఁబడిన శ్రీరంగనాథునకు, శ్రీరంగనాచ్చియారుకు విన్నవించిరి

## రామానుజులు యజ్ఞమూర్తిని జయించుట

అంత కొంతకాలమునకు యజ్ఞమూర్తి యను నొక అద్వైత సన్యాసి - ఏకదండధారియై, దేశమునంగల పండితుల నేకులను జయించి,

---

16 కిడాంబి అచ్చాన్ - (క్రీ శ 1057 - 1157)

ఇతడు రామానుజుల అంతరంగ శిష్యులలో నొకడు వేదాంత శాస్త్ర పారంగతుడు ఆత్రేయగోత్రజుడైన ఇతని 'వేదాంతోదయ' అను బిరుదము కలదు ఇతడు 'విజ్ఞాన స్తుతి' యను గ్రంథమును రచించెను, అందు ఇతడు శ్రీవైష్ణవ సిద్ధాంత విశేషములను వివరీకరించెను ఇతడు 74 సింహాసనాధిపతులలో నొకడుగా ప్రసిద్ధుడు

శ్రీనివాసునకు పుష్పకైంకర్యము చేయు సహాయము లేనందని మీరాలఁ
లేరా ? ' యని ప్రశ్నించిరి

అనంతాళ్వారు[17] లప్పుడు వెంటనే లేచి తమకు ఆ కైంకర్యము
నను గ్రహింపవలెనని వేడిరి. రామానుజులు సంతోషముతో - 'అనం
తాళ్వా, (మొనగాడు) అని మంగళాశాసనము గావించి, ఆ యనంతాళ్వా
రును తిరుమలకుఁ బంపిరి. అనంతార్యులు సకుటుంబముగ తిరుమల కేగి,
'రామానుజ బృందావన' మను పేర నొక పూలతోటను పెంచి,
ఆచార్యాజ్ఞానుసారము శ్రీనివాసునకు పుష్ప తులసీ దామముల నను
దినము సమర్పించు చుండిరి.

ఈ వృత్తాంతమును రామానుజులు విని, మిగుల సంతసించి,
శ్రీ వేంకటాచలమునకు వేంచేసి, శ్రీనివాస భగవానుని దర్శించి,
తమ పేరిట బృందావనమునుఁ గాంచి, ఆనంద భరితులై, అనంతా
ర్యాదులను అభినందించి, అటనుండి బయలుదేరి దేహళీ నగరము
నందలి త్రివిక్రముని సేవించి, మార్గ మధ్యమునఁ గల దివ్య దేశముల
సేవించుచు, అష్ట సహస్ర గ్రామము చేరిరి

ఆ గ్రామమున ధనవంతుఁడైన యజ్ఞేశుఁడును, ఉంఛ
వృత్తిచే జీవించు వరదార్యులు అను ఇరువురు శిష్యులును గలరు.
రామానుజులు వారిరువురికిని తమ రాకను తెలియఁజేయుటకు
ఇరువురు శిష్యులను పంపిరి. యజ్ఞేశుఁడీ వార్తను విని, సంతోషాంత
రంగుఁడై, రామానుజులను పూజించుటకు వస్తు సేకరణ సేయుచుండె
గాని, మార్గాయాస శోషితులగు రామానుజ శిష్యులను ఆదరింపఁ
డయ్యెను. ఇందువలన వారు నిరుత్సాహముతో మరలి వచ్చి, ఆ

---

17 అనన్తార్యులు .

[illegible] 74 సింహాసనాధిపతులలో [illegible]
[illegible]

క్షేత్ర వృత్తాంతమును రామానుజులకు విన్నవించిరి అంతట రామాను
ు చిరునగవుతో తమ శిష్యబృందమును వెంట నిడుకొని, దారిద్ర్య
థా పీడితుడగు వరదార్యుల ననుగ్రహింప వలె నను తలంపుతో
ని గృహమున కేగిరి

## రామానుజులు వరదార్యదంపతుల ననుగ్రహించుట

ఆ సమయమున వైదుష్య సంపన్నులగు వరదార్యులు ఉంఛ వృత్తికై వెళ్ళియుండిరి ఆయన ధర్మపత్నియగు కార్పాసారా ను త్ర - జీర్ణ వస్త్ర ధారిణియై తలుపు వేసికొని, తిరుమంత్రానుసంధా న చేయుచుండెను అట్టి స్థితిలో - జగద్గురువులగు రామానుజులు శిష్యబృందముతో నేగి, పర్ణ కుటీరమునకు ముందు నిలిచి, 'వరదార్యు చ్చట?' అని ప్రశ్నించిరి యతిరాజుల కంఠ స్వరమును లక్ష్మి విని, ఏ పూర్వ పుణ్య వశమున రామానుజ యతీంద్రులు వేంచేసి న్నారు కాని, ఈ జీర్ణ వస్త్రముతో ఆచార్యుల నెట్లు సేవింప ను? అని తలపోసి, ఆ సాధ్వి చప్పట్లు చరచెను. పరేంగితజ్ఞులైన యతిరాజచంద్రులు - ఆమె మనోభావమును గ్రహించి, తమ తలకు కైన వస్త్రమును ఆ పూరింట సందునుండి లోనికి విసరి వేసిరి వెంటనే త్ర - ఆ శాటిని ధరించి, వెలుపలకు వచ్చి, శ్రీ రామానుజులను భక్తితో సేవించి, అర్ఘ్యపాద్యాదు లొసంగి, వారందఱకును ఆతిథ్య ము సంకల్పించెను

అప్పుడా సాధ్వీమణి మనమున - 'ఆహా! పూర్వ జన్మమున మేము చేసిన ఏ పుణ్య ఫలమో! ఏ మహా దాన ఫలమో! చేతనోద్ధరణకై అవతరించిన విభూతిద్వయ నాయకులు, ఆదిశేషుని అపరావతారులు శ్రీరామానుజ యతీంద్రులు మమ్ముల ననుగ్రహించుటకై, తో వేంచేసిరి 'ఆచార్య స్స హరిస్సాక్షాత్ చరరూపీ న సంశయః'

అని శిష్టు లందురు గదా! ధన ధాన్యములు లవలేశమేని ఇంట లేనే ఆర్యులు తెచ్చు ఉంఛ ధాన్యమువలన ఆతిథ్య మసాధ్యము. ఆచార్యులకు సమర్పింపని ధన ప్రాణము లెందులకు? సమస్తము వారి యధీనమే కదా!

"శరీరం వసు విజ్ఞానం వాసః కర్మ గుణా నసూన్
గుర్వర్థం ధారయే ద్యస్తు స శిష్యో నేతర స్మృతః"

అని స్వరూపజ్ఞు లందురుగదా! కావున, క్షణ భంగురమైన ఈ నా శరీరమందు వ్యామోహమునుం గొనియున్న వైశ్యుని వాంఛ దీర్చి, తద్ద్వారా లభించు ద్రవ్యముతో ఆచార్యుల నారాధింతునుగాక!' అని ఆ సాధ్వీమణి నిశ్చయించుకొని, 'స్వామీ! యతిరాజచంద్రమా! తమ కటాక్షముచే తదీయారాధనము గావించెద, క్షణకాల మిచట విశ్రాంతి గైకొనుడు, ఇపుడే వెళ్ళి వచ్చెద' నని విన్నవించి, వైశ్యు నింటికిం జని, 'ఓ వైశ్యాగ్రణీ! నీ కోరిక నేను నెరవేర్పంగలదు శిష్య సమేతముగ మా ఆచార్యులు విచ్చేసియున్నారు కనుక, వారి ఆతిథ్యమునకు వలయు వస్తు సంభారముల నన్నిటిని మా యింటికి పంపు' మని కోరెను అపుడా వైశ్యుడు - తన మనోరథ మీడేరనున్నందులకు సంతుష్టాంతరంగుడై, వలయు వస్తువుల నన్నిటిని బండిపై పంపెను

ఆమెకుం గల ఆచార్యనిష్ఠకు రామానుజులు మిక్కిలి సంతసించి, ఆమెచే వంటఁజేయ నియమించి, తోడుగా కొందఱు శిష్యులను నియమించిరి వంట పూర్తియైనంతనే రామానుజులును స్నాన మాచరించి, శుచిర్భూతులై, వరదరాజుల నారాధించి భోజన పదార్థములను స్వామికి నివేదించి, స్వాము లందఱితోఁ గూడి, సాపాటు (భోజనము) చేసిరి

శ్రీరామానుజు లంతట సుఖాసీనులై, శిష్యులకు భగవద్విషయమును సాయించుచుండ, ఇంతలో - లక్ష్మీనాథుడైన వరదాచార్యుల

యుండ, వీరి వైభవమును విని, 'విఠలదేవ రాయలు' అను నొక రాజు వీరిని సేవించి, ఆశ్రయించి, శిష్యుఁడై, పంచ సంస్కారములను పొంది గురు దక్షిణగా, ముప్పది గ్రామములను (క్షేత్రములను) సక్షత్రికము సమర్పించెను. ఆ క్షేత్రములను రామానుజులు - తమ నాశ్రయించి, ముప్పదిమంది శిష్యులకు వాత్సల్యముతో నొసంగిరి.

## శ్రీ రామానుజులు తిరుమలకు వేంచేయుట

రామానుజుల రాకను విని, అనంతాచార్యాది శిష్యు లందఱును అరుదెంచి, వారిని సేవించి, 'స్వామీ! తిరుమలకు వేంచేసి, తిరువేంగడ ముడయానుకు[18] మంగళా శాసనము చేయు'డని ప్రార్థించిరి. 'ఆళ్వారు శ్రీ పర్వతమును ఆదిశేషుని రూపముగ భావించి, అధిరోహింపరైరి. వారి ననుయాయుఁడనగు నేను అధిరోహించుట సముచితము కానేరదు' అని రామానుజులు తమ అభిప్రాయము తెలుప, అంతట శిష్యు లందఱునుఁ గూడి, 'తా మధిరోహించని యెడల, తమ శిష్యుల మగు మేమును అధిరోహింపఁజాల' మని ఏక కంఠమున స్పష్టముగాఁ బలికిరి. శ్రీవైష్ణవుల అభిమతము అనుల్లంఘనీయమని భావించి, రామానుజులు పర్వతము నధిరోహింప నిశ్చయించిరి.

రామానుజులు ఉపవాసాదులతో శరీరమును కృశింపఁజేసి, పర్వతము నధిరోహింపసాగిరి. ఈ వృత్తాంతము తెలిసిన శ్రీశైల పూర్ణులు మిగుల శ్రమించి వచ్చుచున్న మేనల్లునకు ఎదురేగి, తీర్థ ప్రసాదముల నొసంగిరి. అపుడు రామానుజులు శ్రీశైలపూర్ణుల చరణారవిందములకు ప్రణమిల్లుచు -

---

18 తిరువేంగడముడయాను = శ్రీ వేంకటాచలపతి

''ఆరయ సర్వలోకాచార్యులైన
మీ శ్రీ ప్రసాద మిమ్మెయి దేరవలెనె?
పనిఁ బూని యొక ఎన్నపాపనిచేత
నవిఎనం జాలదే! యనిన నా ఘనుఁడు
నిప్పుడు మీ రానతిచ్చిన కరణి
తప్పక నగర మెంతయు వెదకితిని
ఆకడ వైష్ణవులగు వారిలోన
నాకన్న నెన్న చిన్నలు లేరుగానఁ
దెచ్చితి నన్న నా దేశికు మాట
మచ్చిక వేదాంతమార్గమైయున్న ' [19]

మహాత్మా! దాసునకు తీర్థప్రసాదములను చిన్నవా రెవరితో నేని పంప నచ్చుగదా!' అని పలుక, అపుడు శ్రీశైలపూర్ణులు - నాయనా! తిరుమలలో నాలుగు వీధులకు వెదకితిని. కాని, అచట శ్రీవైష్ణవులలో - నా కంటెను చిన్నవారు నాకంట బడలేదు' అని నుడువ, వారి ఆ సూక్తిని రామానుజులు నైచ్యానుసంధానముగ భావించి, ఆశ్చర్యము నందిరి

అంతట రామానుజులు శ్రీవైష్ణవ బృందముతో తిరుమలకు చేరి, అనంతార్య నిర్మితమగు బృందావన శోభను గాంచి ఆనందించి, అనంతార్యుల నభినందించిరి తదుపరి వరాహస్వామిని సేవించి, యామునాచార్య నామాంకితమైన పుష్పమండపమునకు ప్రదక్షిణ మాచరించి, స్వామి పుష్కరిణియందు తీర్థమును స్వీకరించి, కోవెల లోనికి ప్రవేశించిరి యాగశాల, పాకశాల మున్నగువానికి యతిరాజులు నమస్కరించి, ఆనంద నిలయములోనికి ప్రవేశించి, అఖిలాండ

---

19 పరమయోగి విలాసము ౦20, 630 పుటలు టి టి డి ప్రచురణ 1988

కోటి బ్రహ్మాండనాయకుండైన శ్రీవేంకటాచలపతిని సేవించిరి స్వామి తిరుమంజన సేవను తిలకించి, తీర్థ ప్రసాదములను స్వీకరించి, తిరుమల వాసులకు ప్రజలను, పశు పక్ష్యాదులను వైకుంఠమునందలి నిత్య సూరులుగా భావించి కొండ దిగుట కుద్యుక్తులు కాఁగా, 'దివ్య దేశమున మూఁడు దినము లుండవలె' అను మామగారి మాటను పాటించి, శ్రీనివాసుని మనసార సేవించుచు, అచట మూఁడు దినములు గడపిరి

## శ్రీశైల పూర్ణులవద్ద రామానుజులు
## శ్రీమద్రామాయణమును సేవించుట

శ్రీరామానుజులు తిరుమలనుండి తిరుపతికి చేరి, అచట శ్రీశైల పూర్ణులవద్ద ఒక సంవత్సర కాలము శ్రీమద్రామాయణమును సేవించిరి మామగారికి భక్తితో సేవఁ జేయు గోవిందార్యుల వర్తనమును గమనించి, మిగుల సంతసించిరి శ్రీమద్రామాయణ కాలక్షేపము పూర్తియైనందున, శ్రీరంగమున కేగుట కనుజ్ఞ నొసంగుఁడని రామానుజులు శ్రీశైలపూర్ణులను కోరిరి అందులకు వారు సమ్మతించి, రామానుజులకొక అభీష్ట వస్తువు నొసంగ సంకల్పించి, అట్టి తమ సంకల్పమును రామానుజులు కెఱింగించిరి అపుడు రామానుజులు - 'స్వామీ! గోవిందు నొసంగుఁడని కోరిరి అట్లే శ్రీశైలపూర్ణులు రామానుజులకు వెంటనే గోవిందుని ఉదక ధారాపూర్వకముగ దాన మొసంగిరి శ్రీరామానుజు లంతట గోవిందునితో బయలుదేరి, ఘటికాచలము, తిరువళ్ళూరు క్షేత్రములలోఁగల అర్చామూర్తులను సేవించి కాంచీపురము చేరి, అటనుండి అష్టసహస్రగ్రామమున కేగి అట యజ్ఞేశుని పూజలు గైకొని, శ్రీరంగమునకు చేరి, శ్రీరంగనాథుని సేవించిరి,

## శ్రీరామానుజులపట్ల గోవిందుని ఆచార్యనిష్ఠ

ఒకనాఁడు రామానుజులును, తదితర వైష్ణవ స్వాములును గోవిందార్యుని జ్ఞాన భక్తి వైరాగ్యములను, గురుభక్తిని - సభలో ప్రశంసించిరి గోవిందుఁ డది విని, తనకీ ప్రశంస తగియున్నదని ఆత్మ స్తుతి చేసికొనెను. రామానుజు లాతని వైఖరిని గమనించి, గోవిందా! ఇతరులు నిన్ను స్తుతించినచో - నైచ్యానుసంధానము చేయవలెగాని, ఇట్లు ఆత్మస్తుతి చేయుట అనర్థ హేతువని ఎఱుఁగవా ?' అని ప్రశ్నించిరి గోవిందుఁడు యతిరాజులకు నమస్కరించి, 'స్వామీ! వెనుకటి అప మార్గమున నున్న నా స్థితిని కొనియాడ లేదుగదా! దేవతలకు కూడ దుర్లభమైన తమ దయకు పాత్రుఁడనగుటవలన, నన్ను నేను స్తుతించు కొనుచున్నాను ఇది మిమ్ములను స్తుతించుటేగాని, నన్నుకా' దని పలికెను ఆతని మనోభావమునకు రామానుజు లాశ్చర్యచకితులై, ఎంతయు సంతసించిరి

## రామానుజులు శ్రీభాష్యమును రచించుట

ఆళవందారుల కోరిక నొకదానినిఁ దీర్చుటకు రామానుజులు శ్రీభాష్యముకు రచింప సంకల్పించి, దానికి బోధాయన వృత్తి గ్రంథము కావలసియున్నందున, ఆ గ్రంథము ఉత్తర దేశమున కాశ్మీర ములో - సరస్వతీ భాండారమునఁ గలదని విని, ఆ దేశమునకు కూరత్తా ళ్వారులను వెంటనిడుకొని వెళ్ళి, ఆగ్రంథమును సంపాదించి, ఉభయులును చక్కగా చదివి, దానిని గైకొని వచ్చుచుండ, అచ్చటి మాయావాదు లది యెఱింగి, దాని నపహరించుకొని పోయిరి అపుడు రామానుజు లా గ్రంథమును పోగొట్టుకున్నందులకు మిగుల వగువ, కూరత్తాళ్వారు చూచి, 'స్వామీ! మీ రా గ్రంథ విషయమున చింతింపనక్కఱ లేదు.

యనుగ్రహమువలన, ఆ గ్రంథమందలి విషయ మంతయు నాకు వ్యక్తమై యున్నది' అనఁగా, వారు మిక్కిలి సంతోషించి, మరల శ్రీరంగమునకు విచ్చేసి, పూర్వము సంకల్పించినట్లు కూరత్తాళ్వారు సాయమున శ్రీభాష్యమును రచించి, యామునాచార్యుల కోరిక నొక దానిని నెరవేర్చిరి

తదుపరి రామానుజులు బ్రహ్మసూత్రములకు వ్యాఖ్యాన రూపముగ 'వేదాంతదీపము', 'వేదాంతసారము' అను గ్రంథము , వివిధ శ్రుతుల ఆధారముగ విశిష్టాద్వైత సిద్ధాంతమును నిరూపించు - 'వేదార్థ సంగ్రహము' అను గ్రంథమును, భగవద్గీతకు సము వ్యాఖ్యాన మనఁదగు 'గీతాభాష్య' మను గ్రంథమును రచించిరి

## యతిరాజుల దిగ్విజయ యాత్ర

అనంతరము యతిరాజ శిఖామణి శ్రీరంగనాథుని యనుజ్ఞ గొని, శిష్యబృందముతో దిగ్విజయ యాత్రకు బయలుదేరి, చోళ మండలమున కేగి, కుంభకోణాది దివ్య దేశములను సేవించి, ఆ మండలమునఁ గల మతాంతరులను శాస్త్ర వాదమున జయించి, అట్టి వారి తమ శిష్యులుగాఁ జేసికొని, అటనుండి పాండ్య మండలమున కేగి ఆ మండలమున గల దివ్య దేశములను సేవించి, అటగల పండితుల జయించి, అచటి నుండి కురుకాపురి కరిగి, నమ్మాళ్వారులను సేవించి, మధురకవి విరచితమైన 'కణ్ణినుణ్ శిరుత్తాంబు' ననుసంధించి, ప్రసాదాదులను స్వీకరించి, అటనుండి కురంగ నగరమునకుఁ బోయి, ఆ - కురంగ నగరీ పూర్ణులను సేవించిరి డెబ్బది నాలుగు పీఠము సంస్థాపించువేళ ఏకాంతులతో, శిష్య ప్రశిష్యులతోఁ గూడిన రామానుజ యతీంద్రులను కురంగి నగరాధీశుఁడగు శ్రీ మహావిష్ణువు గాంచి, చకితుఁ డయ్యెను.

ఆ దేశాధిపతి - వారికి శిష్యుఁడయ్యెను రామానుజు లిట్లు దిగ్విజయ యాత్ర గావించుచు, శ్రీవైష్ణవ ధర్మమును సంస్థాపించి, యామునాచార్యుల మహాసంకల్పమును సఫలము గావించిరి

## పరాజితులైన పండితులు

## రామానుజులను అంతమొందింప యత్నించుట

పరాజితులైన పండితు లందఱును కలిసి, రామానుజుల నంతము గావింప నెంచి, అభిచారహోమము[18] గావించిరి కాని, అభిచార శక్తి - మహాశక్తి సంపన్నులు, మహాతేజస్సంపన్నులునగు భగవద్రామానుజుల నేమియుఁ జేయఁజాలక, మఱలిపోయి, ప్రయోగించిన పండితులనే పీడింపసాగెను అందుచే ఆ పండితులు మతిభ్రష్టులై, వీధుల వెంట పడఁగా, ఈ వృత్తాంతమును ఆ దేశపు రాజు తెలిసికొని, సంభ్రమాశ్చర్యములతో సత్వరమే రామానుజుల సన్నిధానమునకు కేతెంచి, 'పండితుల అపచారమును మన్నించి, వారి స్వస్థత చేకూర్చుఁ'డని వేడెను

అంతట దయా సముద్రులగు యతిరాజులు - ఆ పండితులను స్వస్థ చిత్తులఁ గావింప, వారందఱును రామానుజుల చరణారవిందముల నాశ్రయించి, శిష్యులైరి తదుపరి భాష్యకారులు వారణాసి చేరి, అచట గంగాస్నానము గావించి, శ్రీమన్నారాయణుని సేవించి, అచటి పండితుల నెల్లఱను వాదమున నోడించి, అటనుండి, 'పురుషోత్తమ'మని పేరు గాంచిన జగన్నాథముఁ జేరిరి

18 అభిచార హోమము = శత్రువుల నాశనమును కోరి చేయు ఒకానొక యజ్ఞము

## రామానుజులు జగన్నాథ క్షేత్రమున శ్రీ పాంచరాత్ర విధానమును నెలకొల్ప నెంచుట

రామానుజులు జగన్నాథుని సేవించి, ప్రచ్ఛన్న బౌద్ధు లనంబడు యాంవాదులను జయించి, అచట తమపేర నొక మఠమును నెల ్పరి తదుపరి వారు - జగన్నాథుని అర్చకుల రావించి, వారితో - న్నాథునకు శ్రీ పాంచరాత్రాగము శాస్త్రానుసారము చేయు కైంక ు అతియ ఫలము నొసంగును కనుక, శ్రీరంగాది దివ్య స్థలము వలె, పండితులచే నెన్నబడిన శ్రీ పాంచరాత్రము ననుసరించి, గ్నాథు నారాధింపుడు ఇందువలన, మీా కేమాత్రమేని లోపము కదు' అని పలుకి, ఆ యర్చకు లందుల కామోదింపక, బదులు ్క, వెంటనే వెడలిపోయిరి

రామానుజులు వారి యభిప్రాయమును గ్రహించి, ఎట్లేని, ఆ ్రమున శ్రీ పాంచరాత్రాగమ విధానమును ప్రవేశపెట్ట వలెనని ుంచిరి ఈ నిర్ణయమును జగన్నాథార్చకులు తెలిసికొని, ఆనాటి ి సమయమున జగన్నాథుని సన్నిధి కేగి, 'స్వామీ! మా పూజలు ంచుచు, మమ్మను గ్రహించుచున్నవాడవు, మీా సేవ తప్ప, ము మాకు తెలియదు నేడా యతిసార్వభౌముని విధాన మవ ంచి, మమ్ము నిరాశ్రయుల గావించెదవా? అది యే మీా యభీష్ట చో - ఇంతకింకెను మకు మృతి యొక మార్గము లే' దనుచు, పెద్ద బండరాళ్ళను తెచ్చి, తమ శిరములను వ్రయ్యలు చేసికొన ్ధక్షులైరి అపుడు జగన్నాథుడు వారికి ప్రసన్నుడై, అభయ ... వారి వారి గృహముల

ి

)

రామానుజులు యథాప్రకారము కోవెలలో జగన్నాధుని దర్శించి, 'స్వామీ! శ్రీరంగాది దివ్య దేశములలో వలె సాంగ విధానము జరుగదు?' అని విన్నవింప, అందులకు జగన్నాథుఁడు 'యతిసార్వభౌమా! శ్రీరంగాది దివ్యక్షేత్రము లన్నియు నీ యధీనంబై యుండెఁగా! కనుక, ఈ క్షేత్రమున మాత్రము నాకు ఇవలెనే పూజలు జరుగనిమ్ము. ఈ ఒక్క క్షేత్రమును వదలిపెట్టి మాత్రమున నీ కేమి కొదువ?' అని పలికెను. అంతట రామానుజులు ఆలోచనా నిమగ్నులై, మఠమున కేఁగి, నిద్రించిరి. అంతట స్వామి రామానుజులను తన యోగమాయచే శ్రీకూర్మమున చేర్చెను.

## శ్రీకూర్మ క్షేత్రమున రామానుజులు వైష్ణవమును నెలకొల్పుట

రామానుజులు ఉదయమున లేచి, పరికించి, ఆ క్షేత్రమును శ్రీకూర్మముగా నెఱింగి, ఆశ్చర్యము నొంది, 'ఎచ్చటి జగన్నాథము! ఎచ్చటి శ్రీకూర్మము!! శత యోజనముల దూర ముండునే!!! ఊర్ధ్వపుండ్రము ధరించుటకు తిరుమణి యైనను లేదే!' అని విచారించుచుండ, శ్రీకూర్మనాథుఁ డొక బాలుని రూపమున యతిరాజుల వద్దకు వచ్చి విషయమును విచారించిరి. రామానుజులా బాలుని హస్తరేఖా విలసములు చూచి ఆశ్చర్యము నందుచు, విషయమును వివరించిరి. అంత నా బాలుఁడు - 'స్వామీ! అదిగో స్వామిపుష్కరిణి, అదిగో శ్వేతమృత్తిక (= తిరుమణి)' అని విన్నవింప, రామానుజులు సంతుష్టులై స్నానము గావించి, ఊర్ధ్వపుండ్రములను ధరించి యుండ, ఆ బాలుఁడు పాలను, పండ్లను ఎచ్చటినుండియో తెచ్చి సమర్పించెను. ఈ రీతి, రామానుజులచట కొన్ని దినములు గడపిరి. ఇంతలో జగన్నాథుఁ

రామానుజుల శిష్యులతో - 'మీ ఆచార్యులు శ్రీకూర్మమున నున్నారు గాన, మీరును అచటికి పోవచ్చు' నని ఆజ్ఞాపింప, జగద్గురువు లేని శ్రీరంగము మన కెందుల కని తలంచి, నా రెల్లరును బయలుదేరి శ్రీకూర్మముం జేరి, యతిరాజులను కలిసికొనిరి

అంతటను గాడ, శ్రీకూర్మనాథుని సేవింపఁబోవ, ఆ యాలయము ఆక్రమించుకొనియున్న శైవులు - 'ఇది శివలింగము, దీనిని అర్చించుకొనుచున్నాము, ఇచట మీ కేమి పని ? వెడలిపొం'డని అదలించిరి అంతట యతులకు రామానుజులు - స్థలపురాణమును, ఇతర గ్రంథములందలి ప్రమాణములను, చూపి, 'ఇది విష్ణు క్షేత్రమే' యని నిరూపించినను వారు వినరైరి అంతట యతీంద్రులు - 'శైవులారా! ఈ స్వామి శైవుడైనచో - పశ్చిమ దిశకు మరలుగాక లేకున్నచో - మీ ప్రకారమే ఇంకులకు మీ రంగీకరింతురా?' అని ప్రశ్నించిరి. వారలును శైవు లంగీకరించిరి

రామానుజులు శ్రీ కూర్మనాథుని ధ్యానించి, తమ కోరికను విన్నవింప, కూర్మనాథుండు మహాద్భుతముగ, కుడుకుతో పశ్చిమమునకు తిరిగెను అంతట శైవులు నిరాశతో ఆ క్షేత్రమును వీడిపోవ, రామానుజులు - పడమటి దిక్కున మఱియొక ధ్వజస్తంభమును స్థాపింపఁ జేసిరి [1] తదుపరి ఆ ప్రాంత ప్రజ లనేకులు శ్రీరామానుజ సాంప్రదాయములను స్వీకరించిరి

## సింహాచలమున కృష్ణమాచార్యుల అహంకారమును రామానుజులు తొలఁగించుట

శ్రీకూర్మమును వైష్ణవ క్షేత్రముఁగా నొనరించి, అటనుండి యతీంద్ర రామానుజులు శిష్య సమేతులై, సింహాచలమునకు వేంచేసిరి

[1] శ్రీకూర్మక్షేత్రమున నేటికిని రెండు ధ్వజస్తంభములు కానవచ్చును

ఆ సింహాచలమున 'కృష్ణమాచార్యులు' అను నొక మహా గాయకు కలడు. ఈయన శ్రీ వరాహస్వామి సన్నిధిలో ప్రతి నిత్యము వాయించుచు, భక్తి గీతములను శ్రవణానందముగ గానము చేయుచుండెడివాడు. అట్టి సమయమున శ్రీ స్వామి పరవశుడై, నృత్య చేయుచుండెడివాడు.

ఇట్టి స్థితిలో ఒకనాడు రామానుజులు కొండకు దిగువన తమ పరివారమును నిలిపి, తా మొకరు మాత్రము కొండ నెక్కి, ప్రదక్షిణముగ వచ్చుచు, ముఖ మండపమునందు కృష్ణమాచార్యులను దర్శిం అంజలి ఘటింప, 'క్షేమమా?' అని మాత్రము కృష్ణమాచార్యు ప్రశ్నించెను. రామానుజు లంతట - 'స్వామీ! తాము శ్రీ వరాహ నరసింహస్వామికి అంతరంగికులని వినియున్నాము. 'శ్రీరంగమునుండి ఒక యతి వచ్చియున్నాడు, ఆతనికి మోక్షము కలదా?' య స్వామిని అడిగి తెలుపు' డని కోరిరి. 'ఇది యెంత పని?' యని కృష్ణమాచార్యులు బదులు పలికి, ఆ రాత్రివేళ - గీతా గానము, నృత్య క్షేపము పూర్తియైన పిమ్మట, స్వామికి రామానుజ విషయము విన్నవించెను. అందులకు వరాహస్వామి మహానందముతో 'మోక్షమా! వారికే కాదు, వారి అనుయాయులకును కలద తెలిపెను.

ఆశ్చర్యచకితుడైన కృష్ణమాచార్యులు మఱునాటి ఉదయమున ఈ వార్తను రామానుజుల కెఱింగించెను. అంతట రామానుజులు - 'స్వామీ! సంతోషము కాని, ఒక్క మాట. తమకు మోక్షము కలదో, లేదో తెలిసికొంటిరా?' అని ప్రశ్నింప, 'నేను పాడినచో స్వామి ఆడును, స్వామి పాడినచో - నే నాడుచుందును. కనుక మోక్ష విషయమున నాకిక సంశయ మేల?' అని పలుక, 'అడిగి

నచో దోషము లేదుగదా!' అని గోష్ఠీంద్రులు వచించి, వరాహ నృసింహుని సేవించి, కొండ దిగి వచ్చిరి.

ఆ నాటిరాత్రివేళ, తన గానమునకు ప్రసన్నుఁడైన వరాహ నరసింహుని – 'స్వామీ! నాకు మోక్షముకలదా!' అని కృష్ణమాచార్యులు ప్రశ్నింప, స్వామి – తన ముఖారవిందమును ప్రక్కకు త్రిప్పిరి. అందులకు కృష్ణమాచార్యులు విచార మనస్కుఁడై, 'స్వామీ! బాల్యమునుండి ఇతర మెఱుంగక, నిన్నాశ్రయించిన నా కిదియా ప్రతిఫలము?' అని ప్రశ్నింప అప్పుడు వరాహుఁడు – 'నాయనా! నీకు మోక్షము నొసంగుట – నా వశము కాదు, శ్రీరంగ వాసియైన శ్రీమద్రామానుజులకు, ఉభయ విభూతి నాయకత్వమును మున్నే యొసంగితిని. నాటినుండి మోక్షమును ఎవరికేని వారీయవలసినదే కాని, నాకధికారము లే'దని సమాధాన మిచ్చెను.

అందులకు కృష్ణమాచార్యులు ఆగ్రహించి, 'నీ కోవెల ఏడహోరాత్రములు అగ్నిజ్వాలలతో అలముకొనుగాక!' అని శపించెను. 'నిష్కారణముగ నన్ను శపించిన నీ కవిత్వ సంగతియు పామరుల పాల్పడుగాక!' అని వరాహస్వామి ప్రతిశాప మిచ్చెను. అంతట కృష్ణమాచార్యులు – స్వామిపాదములపైఁ బడి, 'ఇక నాకేమి గతి?' యని వాపోవ, అప్పుడు వరాహుఁడు – కృష్ణమాచార్యులనుఁ గాంచి, 'అహంకార మమకార రహితుఁడవై, సత్ప్రవర్తితుఁడవై, యతిరాజుల నాశ్రయింపు'మని తెలిపి అంతర్హితుఁడయ్యెను.

అంతట జ్ఞానోదయమైన కృష్ణమాచార్యులు – యతిరాజుల నాశ్రయించుటకై త్వరితముగ కొండనుండి దిగివచ్చి, రామానుజులను – వారి పరివారమును చూచి చకితుఁడై, వెంటనే యతిరాజుల చరణారవిందముల నాశ్రయించి, 'దయతో రక్షింపు'డని ప్రార్థించెను. కరు

కాంతరంగులైన యతిరాజులు-కృష్ణమాచార్యుల అహంకారముతొలగి ట్లు గమనించి, ఆయనకు పంచసంస్కారము లొసగి, కృతార్థునిగావిం రి తరువాత, తమవెంట బయలుదేరనున్న ఆ కృష్ణమాచార్యులను వారించి, శ్రీస్వామి కైంకర్యమును భక్తితో నిర్వర్తించుచు, ఇచటనే యుండు' మని ఆజ్ఞాపించి, అటనుండి శిష్యసమేతముగ పయనమై, అహోబిలమున శ్రీలక్ష్మీనృసింహస్వామిని సేవించి, అచటనుండి తిరు తికి జేరి, తిల్లగోవిందరాజులను సేవించి, మంగళాశాసనము గావించి, అటనుండి తిరుమలకు వేంచేసిరి

## తిరుమలను యతిరాజులు వైష్ణవ క్షేత్రముగ నిరూపించుట

అట వేంకటాచలపతి వైష్ణవ చిహ్నములగు శంఖచక్రములు లేక పర్యన మిచ్చుచున్నందున, కొందఱు శైవులు స్వామిని శివుడని వాదించుచుండ, వారికి రామానుజులు స్థల పురాణాదులచే అయ్యది వైష్ణవ క్షేత్రమని నిరూపించుటేగాక, శంఖ చక్రాది విష్ణ్వాయుధము ను, శూల డమరుకాది శైవాయుధములను స్వామిసన్నిధిలో నుంచి, లుపులకు తాళము వేయుడము వానిలో స్వామి ఏ చిహ్నములు రించునో - ఆ దైవముగా నిశ్చయింత' మని పలుక, శైవు లందులకు మ్మతించిరి అంతట ఆ యిరు పక్షములవారును అట్లే చేసిరి మఱు డు తలుపులు తెఱచి చూడ, ఆ స్వామి శంఖచక్రాద్యాయుధములు రించి కానరాగా, శైవులా వైష్ణవ మూర్తిని గని ఆశ్చర్యచకితులై, అటనుండి నిష్క్రమించిరి అంతట -

రమణీయ కర్పూర రచితోర్ధ్వపుండ్రంబు
నీలలకావృత నిటల తలము
శారదపూర్ణిమా చంద్ర మండలముతో
సాటి మీఱిన ముఖ పంకజంబు
నీలాద్రి శిఖరస్థ బాలసూర్యునిఁబోలు
తపనీయ మకుటముఁ దలనుఁ దాల్చి
వేంకటేశుని దివ్య విగ్రహ మీ రీతి
నాపాద మస్తక మనుభవించి
సంతసించి యతీంద్రుండు సంస్తుతించి
తీర్థయాత్రాశ్రమంబెల్లఁ బాఱవిడిచి
పేద పెన్నిధి గన్నట్లు పెరిగె ననుచు
వాదికేసరి గురుఁ డనె మోదమలర "22

ఫాల భాగమున నిరుపమ కర్పూర మూర్ధ్వపుండ్రముగ నొప్పుచుండను, శరత్కాలమునందలి పూర్ణిమ నాఁటి చంద్రకాంతివలె ముఖపద్మముతో శోభిల్లువాఁడును, బాల సూర్యుని భాతి - శిరమున మణిశోభిత మగు కిరీటము ధరించినవాఁడును అగు శ్రీ వేంకటేశ్వరస్వామిని - శ్రీమద్రామానుజులు ఆపాదమస్తకము సేవించి, తీర్థయాత్రవలనఁ గల్గిన బడలికను సడలించి, పేద - పెన్నిధిఁ గన్నట్లు మహానందభరితులైరి

"శ్రీపాద మాదిగా శిరము పర్యంతంబు
శ్రీపాదముని వంగి సేవఁ జేసి,
భట్టనాథోత్తమా నల్లాణ్డుఁ గాడి యా
శౌరికి మంగళాశాసనంబుఁ
జేసి కేల్గవ మోడ్చి, సేవించు యతిపతి
కంజనాద్రీశుఁ డిట్లనుచుఁ బలికె
కావ్యంబు రచియించి భారతి మెప్పించి
ప్రతివాదుల జయించి ...

మంచి మా కొనరించు సన్మంత్రి వీవె
కనుక నిన్నితి భూతియుగంబు నీకు
శయన గృహాంబు నని పల్కె శౌరి యనుచు
వాదిభీకర గురుఁ డనె మోద మలర [23]

తిరుప్పాణాళ్వారులవలె నిట్లు రామానుజులు శ్రీనివాసుని - పాదాది శిరఃపర్యంతము సన్నుతించి, పెరియాళ్వారులు పాడిన పల్లాండును పాడి, ఆ స్వామికి మంగళాశాసనము గావించి, అంజలి ఘటించి దర్శించ ఆ యతిసార్వభౌమునితో వేంకటేశ్వరస్వామి - 'రామానుజా! శ్రీభాష్యమును రచించి ప్రాగల్భ్యము చూపించి, బహుమతినిఁ గైకొంటివి ప్రతివాదులను జయించి, ఎందరికో మోక్షమార్గముఁ జూపితివి, మాకెంతో మేలు చేసితివి, నీవే నూతన సచివోత్తముఁడవు కనుక, ఉభయ నిభూతి నాయకత్వమును నీ కొసంగితి' నని పలికెను అంతట రామానుజులు శ్రీనివాసునను యాజ్ఞతో బద్ధులై, సెలవు గైకొని బయలుదేరి, కాంచీపురమున దేవరాజును, మధురాంతకమున రాముని, వీరనారాయణపురమున నాథమునులను, తుదకు శ్రీరంగమున శ్రీరంగనాథుని సేవించి, అనంతరము తమ మఠమున ప్రవేశించిరి

## రామానుజులు వేంకటాచలపతిచే గోపవనితకు మోక్షము నిప్పించుట

ఒకనాఁడు రామానుజ మఠమున వైష్ణవ తదీయారాధనము జరుగు సందర్భమున, 'తొండనూరు కొండ' యను నొక గొల్లపడుచు - పాలు, పెరుగు అందఁ జేసెను ఆ పాలు - పెరుగులకు రామానుజ శిష్యులలో నొకరు ఆ మూల్యమును నియ్య బోగా, ఆపడుచు మూల్యముకన్న అతే

---

23 ఆచార్యసూక్తిముక్తావళి ౮ ౯ ౬ 20

ము, తీర్థ ప్రసాదము లొసంగిన చాలు ననియు నుడివెను తదీ
రాధనానంతర మళ్లీ ఆ గోపవనితకు శ్రీమద్రామానుజులు తీర్థ
దములు నిప్పించిరి తత్ఫలముగ ఆ వనిత - స్వస్వరూపజ్ఞానమును
ది, రామానుజ యతిసార్వభౌములకు సాష్టాంగముగ ప్రణమిల్లి,
స్వామీ! దాసురాలికి మోక్షమును ప్రసాదింపుం డని ప్రార్థించెను.
రామానుజులు 'తిరుపతి వేంకటేశ్వరుని మోక్షమునకై
ర్థింపు' మనఁగా, తామే మోక్షము నిప్పించువారని పెద్దలు చెప్ప
, కావున దాసురాలికి మోక్ష మిమ్మని, వేంకటేశ్వరున కొక లేఖ
సియిం' డని గోపాంగన వేడుకొనెను

రామానుజు లపుడు శ్రీవేంకటేశ్వరుని పేర నొక లేఖ వ్రాసి
ని గొల్ల పడుచు కొసఁగ, ఆమె దానిని భక్తితో గైకొని, యతీం
ని మఱల నమస్కరించి, అటనుండి వేంకటాచల మేగి, స్వామి
కరిణిలో స్నానమాచరించి, ఆనంద నిలయమునకు ప్రదక్షిణము
గి, గరుడ స్తంభము కడ లేఖ నుంచి, మోక్షమును ప్రసాదింపు
శ్రీనివాసుని ప్రార్థించుచు, అచట సాగిలపడెను భక్తసంరక్షకుడైన
టాచలపతి ఆ గోప వనిత కపుడు శాశ్వతమైన మోక్షపదము
గహించెను

## ఎరాళరధట్టరు - వ్యాసభట్టరు

ఒకనాఁడు కూరత్తాళ్వారు - వర్షము వచ్చుచున్నందున భిక్షా
టనకు వెళ్ళక, ఫలములచే భగవదారాధనము గావించి, ఆ
ములను ఆరగించియుండ, ఆ రాత్రి వారి భార్యయగు ఆండాళమ్మ -
రంగనాథుని ఆరగింపువేళ మ్రోగు ఘంటానాదమును విని, 'నీ
భక్తుఁడు ఉపవసించి యుండ, నీ వారగించఁదగునా?' యని తలప,

...వెంటనే, తా నారగించిన ప్రసాదమును కూ
...ను

...ప్రసాదమును చూచి, కూరత్తాళ్వారు ఆశ్చర్యమ నంది, 'నీ వేమైన భుజించితివా?' యని భార్య నడుగ, ఆయమ - తా తలచిన విధమును తెలిపెను. అంతట కూరత్తాళ్వారు ఆ ప్రసాద కొంత భాగమును స్వీకరించి, శేషించిన ప్రసాదమును తమ సతీ కొసంగెను. ఆమె ఆ రీతిగా ఆ ప్రసాదమును స్వీకరించిన ఫలము గర్భము దాల్చి, ఇరువురు పుత్రులఁ గనెను. ఆ వృత్తాంతమ రామానుజులు విని, సంతసించి, ఆ శిశువులకు - పరాశరభట్ట వ్యాసభట్టరు అను నామముల నుంచి, పరాశరభట్టరుచే విష్ణుసహస్రన స్తోత్ర వ్యాఖ్యానమును రచింపఁ జేసి, యామునాచార్యుల మూ కోరికను నెరవేర్చిరి. తదుపరి - ఎంబారు తమ్ముఁడగు చినగో భట్టరు కొక కుమారుఁ డుదయింప, ఆ శిశువుకు 'పరాంకుశదా డని నామకరణము చేసిరి.

## రామానుజులు ధనుర్దాసును సముద్ధరించుట

కరుణాసముద్రులగు యతిరాజులు - తమ నిర్హేతుక జా మాన కరుణా కటాక్షముచే, అనేకులను తమవారినిగాఁ జేసిక రక్షించిరి. అట్టివారిలో - ధనుర్దాసుఁడను స్త్రీ కాముకుఁడుగ న యోధుఁ డొకఁడు. ఈతని నివాసము శ్రీరంగమునకు చేరువనుం నిచుళాపురమునఁ బడు వరయూరు. ఇతని భార్యపేరు 'హేమాం ఈమె మహా సౌందర్యవతి. విశాల నేత్రములు కలది. ధనుర్దా డామెకు వశుఁడై, నిరంతరము ఆమె ముఖమండలమును చూచుచు ఆమె సుందర నయనములు గాంచి, తన్మయత్వము నందుచుండె వాఁడు

ఇట్లుండ, ఒకపుడు - శ్రీరంగమున రంగనాథునకు చైత్రోత్సవము జరుగుచుండెను. ఆ యుత్సవమునకు హేమాంబ మహోత్సాహముతో బయలుదేరె, ధనుర్దాసుఁడను విధిలేక ఆమె వెనుక బయలుదేరెను. మిట్ట మధ్యాహ్నపువేళ, మండు టెండలో - ఆమె ముఖమునకు ఛత్రము పట్టి, ఆమె సుందర వదనారవిందమును వీక్షించుచు, అడుగులు తడబడుచుండ, వెనుకకు నడచుచుండెను. ఈ విచిత్రమును వీక్షించిన వైష్ణవులు కొందఱు పక్కున నవ్విరి. కరుణాంతరంగులైన యతిరాజులు ఆ సన్నివేశమును గాంచి, స్వాములను వారించి, 'వైష్ణవోత్తములారా! భగవన్మాయచే మోహింపఁజేయఁబడి, కాంతాదాసుఁడై, ఇతరులు పరిహసించుచున్నను అతఁడు సహించి, శ్రీరంగనాథుని మహోత్సవమున, బహిరంగముగ కాంతాదాస్యము చేయుచున్నాఁడు. దీనినిఁ బట్టి, అతఁడే విషయమునైనను అంతటి రసికతతో అనుభవింపఁ గలఁడని మాకు తోచుచున్నది. ఆ కాంతాదాసు నిపుడీ శ్రీకాంతుని కైంకర్యనిమగ్నునిఁ గావించెద'నని పలికి, ధనుర్దాసును తోడ్కొని రమ్మని శిష్యునిఁ బంపి, తమ మఠమున ప్రవేశించిరి.

ధనుర్దాసుఁడును రామానుజుల సన్నిధికేగి, ప్రణామమాచరించి నిలిచెను. రామానుజులాతనిఁ గాంచి, చిరునగవుతో 'నాయనా! నీవెవరు? నీ నివాస మెచ్చట? నీ ఉద్యోగమేమి? శ్రీరంగమున కేల వచ్చితివి? వాస్తవము వినఁగోరుచున్నాము' అని ప్రశ్నించిరి. ధనుర్దాసుఁడంతట, ముకుళిత హస్తుఁడై, 'మహాత్మా! నన్ను ధనుర్దాసుఁడని యందురు. ఉఱయూరు - నా యూరు. మల్లవిద్యయందారితేరిన నన్ను - పల్లులంకజును కొలుతురు. శ్రీరంగనాథునకు జరుగు చైత్రోత్సవమును చూడ వేడుక పడుచుండ, ఆమెకు తోడుగా వచ్చితి'నని రామానుజులకు విన్నవించెను.

యతీంద్రు లంతట మందస్మిత వదనులై, 'నాయనా! మే
కూడ వేడుకతో కొన్ని ప్రశ్న లడిగెదము మాపై కినుక వహించ
యథార్థము తెలిపిన, నీకు మేలు కలుగును కామహస్తులు స్త్రీ
రహస్యముగ దాస్యము చేయుచుందురు కాని, నీ వంటి కాముక
మే మెచ్చటను చూచియుండలేదు శూరుడవగు నీవు - ఇట్టి హే
మైన, జననింద్యమైన కృత్యమును రాజమార్గమున అందఱును చూ
చుండగనే ఎట్లు చేసితివి?' అని ప్రశ్నించిరి అందులకు ధనుర్దాసు
లజ్జితుడై, 'స్వామీ! హేమాంబ నేత్రము లెంతో అందమైనవి ప
పత్రములవంటి ఆ విశాల నేత్రములకు మిట్ట మధ్యాహ్నపు మం
టెండలో గొడుగు పట్టుకున్న, అవి వాడిపోవును కనుక, అట్టి స్థి
నేను భరింపజాలను అందమైన ఆమె నేత్రములను చూడకుండ, క్ష
ణకాలమైన బ్రతుకజాలను' అని బదులు చెప్పెను

అంతట రామానుజులు – 'నాయనా! నీవు చూచిన నేత్రము
కన్న మిన్నయైన దివ్య నేత్రము లున్నవి త్వరలో వానిని నీవు చూ
గలవు' అని ధనుర్దాసుతో పలికిరి అపు డా ధనుర్దాసుడు - 'అ
నేత్రములను నేఁ జూడగల్గితినేని, తమ దయవలన నా కెంతో సంతో
షము కలిగినట్లే! ఎంతో మేలు చేకూరినట్లే!!' అనగా - వెంట
రామానుజులు ధనుర్దాసుని వెంట నిడుకొని, సప్త ప్రాకారములు దాటి
ఆదిశేషువుపై పవళించిన శ్రీరంగనాథుని సేవింపఁ జేసిరి మందస్మి
సురుచిర సుందర వదనారవిందుఁడై, ఆజానుబాహుఁడై, ఆకర్ణాం
విశాల నేత్రములతో విరాజిల్లుచున్న శ్రీరంగనాథుని, యతీంద్రు
దయచే, ధనుర్దాసుడు మహానందమునందుచు, తదేక దృష్టితో
సేవించుచు నిలిచెను అపు డా ధనుర్దాసునిపై రంగనాథుఁడు అపా
రమైన కృపఁ జూప, అతఁడు మహాభక్తుఁ డయ్యెను అరిషడ్వర్గమున
జయించి, ఆత్మ స్వరూప జ్ఞానము నందిన ధనుర్దాసునకు, రామాను

నాస్తి' (శివునికంటెను మఱి యొక దైవము లేదు) అని వ్రాయింప వలెనని అతఁడు సమకట్టెను. రాజ భయముచే కొందఱు, ధనాశచే కొందఱు అట్లే వ్రాసిరి. మఱి కొందఱు అట్లు వ్రాయుటకు సమ్మతింపక, తమ గృహారామ క్షేత్రములను వదలి పారిపోయిరి.

కూరేశ శిష్యుఁడగు 'నాలూరాచ్చాన్ పిళ్ళై' యను నతఁడు ఆ క్రిమికంఠునకు మంత్రిగా నుండెను. ఆ వైష్ణవులను హింసించుట చూచి, అతఁడు రాజుతో - 'ఇట్టి నా హస్తముచే నేమి ఫలము? శ్రీరంగమున వైష్ణవశిరోభూషణులై జగద్గురువులుగా పేరు గాంచిన రామానుజులును, వారి ముఖ్యశిష్యులగు కూరేశులును వ్రాసినగదా ప్రభువులకు విజయము!' అని పలికెను. మంత్రి సూచనకు రాజు అంగీకరించి, వారిరువురను రావించుటకై వెంటనే భటులను పంపెను.

ఆ భటులు శ్రీరంగమున కేగి, 'రామానుజు లెచ్చట?' యని అడుగుచు, మఠము వద్దకు వచ్చిరి. ఆ సమయమున రామానుజులు స్నానము చేయుచుండ, కూరత్తాళ్వారులు వృత్తాంతము విని, తన గురువున కేమి యాపద వాటిల్లునో యని భయముం జెంది, వారి కాషాయ త్రిదండములను తాను ధరించి, 'నేనే రామానుజుల' నని రాజసభకు బయలుదేరె. మహాపూర్ణులును కూరేశుల ననుసరించి బయలుదేరిరి. తరువాత రామానుజులు అనుష్ఠానమును పూర్తిగావించుకొని వచ్చి, కాషాయ త్రిదండాదులు గానక, అచటి వైష్ణవులచే వృత్తాంతమును తెలిసికొని, ధవళ వస్త్రములను ధరించి, విచారించుచుండ, ఆ వైష్ణవులు - మీ రిచ్చట నుండవలదని నిర్బంధింప, శ్రీరంగనాథుని సన్నిధికి జని, వారి యనుజ్ఞచే పశ్చిమాభిముఖులై బయలుదేరి వెళ్ళిరి.

అంతట చోళరాజు - తన సభకు వచ్చినవారు రామానుజులు రని తెలిసి, మఱల అశ్వభటులను బనుప, వారు రామానుజుల సన్నే

పెంచుచు, మార్గమునం గని వెంబడించిరి. ఈ విషయమును శిష్యుల మూలమున గ్రహించిన రామానుజులు - 'అళిమెయో కంగుం విలుమెళి' అను పాసురము ననుసంధించి, దోసిలితో ఇసుకను శిష్యుల కీయ, వారు మార్గమున చల్లిరి. రాజభటులు లోగట కలత నొందినవారలై, వచ్చిన మార్గముననే నచ్చుచు, కొక్కమక్కి ... పోంజాలక, వైష్ణవు లేదిరయా ... యమంత్రములు చేసిరని పలుకుచు, ... వెనుదిరిగి వెడలిపోయిరి.

## రామానుజులు వనచరుల ఆతిథ్యమును స్వీకరించుట

అంతట రామానుజులు - విధివశమున ఏడు దివా రాత్రములు గాలివానచే బాధపడుచు, దుర్గమారణ్యమును గడచిపోవుచుండ - తుద కొక తావున అగ్నిని గని, శిష్యులతో చేరి, అచటివారిని - 'మార్గ మిచ్చుట ?' అని ప్రశ్నించిరి. అప్పు డచటివారు - వీ రందఱును శ్రీవైష్ణవస్వాములని గుర్తించి, అగ్నిని ప్రజ్వరిల్లఁజేసి, చలి బాధను పోగొట్టి, 'అయ్యా! మీరు రెండుల కీ యరణ్యములఁబడి పోవుచున్నా'రని ఆ వనచరు లడిగిరి. ఒకానొక కారణముచే మేము శ్రీరంగమును విడవలసివచ్చె' నని వారు బదులు పలుక, ఆ నిషాదులు సంతోషముతో - 'ఎంబెరుమానారులు కుశలముగ నున్నారా ?' అని యడిగిరి. అందుల కాశ్చర్య మందిన వైష్ణవులు - వనచరులైన మీకు - ఎంబెరుమానారు లెట్లు తెలియును ?' అని ప్రశ్నించిరి. వనచరు లంతట - 'మేము - తిరుమల నల్లాన్ చక్రవర్తులవారి శిష్యులము. మాకు హితము నుపదేశింపుఁడని మేము వారిని వేడఁగా, వారిపుడు - రామానుజాచార్యులగు రామానుజ చరణారవిందములే రక్షకములని నమ్మియుండుఁడు, ఇదియే మీకు హితి' యని చెప్పిరి. అందువలన, వారినిం జూడ్కి అడిగితి' మని పలికిరి. శ్రీవైష్ణవులు రామానుజులను జూపి, 'ఈ మహానీయులే ఎంబెరుమానారు' లని వచించిరి.

అప్పుడా వనచరులు - రామానుజ చరణారవిందములపై భక్తితో నమస్కరించి, ప్రస్తుత సంఘటనమును గూర్చి మిగుల చింతించి తియ్యని పండ్లు - కొబ్బరులు, తేనె సమర్పింప, వానిని రామానుజులు, వారి శిష్యవర్గము గూడ ప్రేమపూర్వకముగ స్వీకరించి, రాత్రి – అచటనే విశ్రమించిరి. మరునాడు – తమ క్షేమ సమాచారములు తెలుపుటకై, తమ శిష్యులలో నొకరిని, వనచరులలో నొకరిని కలిపి, శ్రీరంగమునకు పంపిరి.

తమ పూర్వాశ్రమము, ఎలనాడే విచ్చేసిన పరమగురువులకు సరియైన ఆతిథ్యమివ్వ లేకపోయితిమే యని ఆ వనచరులు మిగుల చింతించి, ఉడయవరులను, వారి శిష్యులను వెంట నిడుకొని, ఆ యడవి సమీపమునగల ఒక గ్రామమునందలి 'కట్టలవారి' యను నొక బ్రాహ్మణుని గృహమునకు తీసుకొనిపోయి, తమ యొద్ద నున్నగు సరుకులతో జత, ఆ సరుకులను ఆ బ్రాహ్మణ గృహమునందుంచి, వైష్ణవ స్వాములచేత భోజనము చేయునట్లు ఏర్పాటుచేసి, వారు సెలవు గైకొని వెడలిపోయిరి.

## చేలాంచలాంబ గురుభక్తి

ఇట్లు రామానుజులు శిష్య బృందముతో - ఏడవనాటి సాయసమయమునకు చేలాంచలాంబా గృహమునకు చేరిరి. ఆమె మహపతివ్రతలలో శ్రేష్ఠురాలు అగుటవలన, ఆమె తమ గృహమునకు విచ్చేసిన వైష్ణవులను సేవించి, ఎంతయు సంతసించి, వారిని అర్ఘ్య పాద్యాదులచే పూజించి, తమ కెల్లరకును భోజనమును ఏర్పాటు కూర్చెదను, స్వీకరింపుడని ప్రార్థింప, శ్రీవైష్ణవులు - 'అమ్మా! ఆప్యాయముగా బలికిన నీ మధుర వాక్కులే మాకు చాలును, భోజనము వల' దనిరి. అది విని ఆయమ - 'నేను ఎంబెరుమానారుల పాద

పద్మముల నాశ్రయించినదానను కనుక, తాము సంశయింపక సాపాటు సేయ వేడెద' నని విన్నవింప, వైష్ణవు లపుడు - 'అమ్మా! ఎంబెరుమానారుల నెట్లెఱుంగుదువు?' అని ప్రశ్నింప, ఆ యిల్లాలు 'స్వాములారా! పంద్రెండు సంవత్సరములకు పూర్వము మా ప్రాంతమంతయు అనావృష్టి పీడితము కాఁగా, నే మీ ప్రాంతమును వీడి నా భర్తతో శ్రీరంగమున కేగి యుంటిమి. అపు డచట సౌధాగ్రమునుండి నే నొకనాఁడు భగవద్రామానుజులను దర్శించితిని. వారు ప్రతి దినము ఏడు గృహములనుండి భిక్ష స్వీకరించుచుండెడివారు. అను దినము భూసురులే గాక, భూపతులును సేవించుట గమనించితిని. ఒకనాఁడు భిక్ష గైకొని మరలుచున్న ఆ మహనీయుని దారి నడ్డగించి నిలిచితిని. దానికి వారు - 'నాకు దారి నీయ వేల నమ్మా?' అని పలికిరి. అంతట నేను భయమును వీడి, 'మహాత్మా! తాముచూడ సర్వ సంగ పరిత్యాగులు, నిత్యము మధూకరము సేయుచుందురు. అట్టి మిమ్ములను శ్రీరంగనాథుని వలె రాజాధిరాజులును, వేద వేదాంత తత్త్వజ్ఞులును పూజించుచుందురే! ఏమి కారణము?' అని ప్రశ్నింప, భక్త వాత్సల్యము గల ఆ రామానుజులు - 'వారికి నే నొక గొప్ప మంత్రము నుపదేశించితిని, అది ఆ మంత్ర మహిమ' అని తెలుప, నే నపుడు భక్తితో చేతు లు జోడించి, 'మహాత్మా! యతిరాజా! దాసురాలికి ఆ మంత్రము నుపదేశింపుఁడని ప్రార్థించితిని. రామానుజులు అనుగ్రహముతో నాకు మంత్ర ముపదేశించిరి.'

'అంతట మా దేశము సస్యశ్యామలము కాఁగా, తిరిగి పోవుటకు నా భర్త త్వరపెట్టెను. మంత్రమును మఱచుటచే, రామానుజులకు నేను నమస్కరించి, 'ఆచార్యవర్యా! మందబుద్ధి నగుటచే, మంత్రమును మఱచితిని కనుక, స్వదేశమునకుఁ బోవు ఈ దాసురాలికి మఱల మంత్రోపదేశము చేయుఁ' డని ప్రార్థింప, దయాసముద్రు లగు

యతిరాజులు గురుపరంపరా పూర్వకముగ ద్వయ మంత్ర
దేశించి, గురుతుగా - తమ దివ్య పాదుకల నొసంగ, కొంగ
గట్టి తెచ్చిన నన్ను 'కొంగు పిరాట్టి' యని పిలుచుచుండు
రామానుజుల పాద పద్మములను మరల నెపుడు సేవింతునో
యని చేలాంచలాంబ - కనుల నీరు నింప, అంతయు వినుచ
రాలు సంతసించి, వంట చేయు మని ఆమెకు ఆజ్ఞ నొసంగి

అంతట కొంగుపిరాట్టి స్నాన మాచరించి, వేరొక
మను ధరించి, శుచిగా వంట చేసి, 'ఎంబెరుమానార్ శ
రణమ్' (రామానుజుల పాదపద్మములే రక్షకములు) అని
ద్దిగల యతీంద్రు పాదుకలను భక్తితో కడిగి, గంధ పుష్ప
పూజించి, తెలుపు మూసి, నైవేద్యమును సమర్పించెను
వైష్ణవ స్వాములకు నమస్కరించి, సాపాటుకు వే
ప్రార్థించెను

చేలాంచలాంబ వృత్తాంత మంతయు నెఱింగిన ఉడై
'పాదుకలను తీసికొని ర' మ్మనిరి అట్లే ఆమె శ్రీ రామాన
కలను తీసికొని రాగా, ఆ పాదుకలనుం జూచి సంతసించి, యతీ
'శ్రీరంగమున రామానుజులు నీకు చెప్పిన మంత్రము నిపు
నిచో - వీరు భుజింపరు కనుక, ఆ మంత్రమును నా చెవి
రింపు' మని పలికిరి అంత, వారు కోరినట్లే ఆమె - మంత్రం
రించెను యతీంద్రులు సంతసించి, 'ఈ వైష్ణవస్వాము లం
నీకు మంత్రముపదేశము గావించిన గురువును గుర్తు ప
లేదో చూడు' మన, ఆమె ఒక దీపమును తెచ్చి, శ్రద్ధగా
పాదములను పరికించుచు, రామానుజ పాదపద్మములు చూచి
'వీరే రామానుజ యతీంద్రులు, కాని, కాషాయ - త్రిద

! ఎట్లు నిర్ధారించుకొందును ?' అని పలుక, దయా సాగరు లగు రానుజులు - ఆమెతో - 'నేనే రామానుజులను ఒకా నొక ాముస శ్రీరంగమును వీడి, శ్వేత వస్త్రమును ధరించి వచ్చితిని' పలుక, ఆమె వెంటనే వారి పాదములపై బడి విలపించెను. రానుజు లామె నోదార్చి, 'పరమ భోగ్య మగు ఈమె చేతి వంట ును భుజింపుఁ' డని వైష్ణవుల కాజ్ఞాపింప, వారు సంతసమున చిరి రామానుజ యతిసార్వభౌములు మాత్రము పాలు, పండ్లు ంచి, శ్రీమన్నారాయణునకు నివేదించి, స్వీకరించిరి

ఆమె - శ్రీపాదతీర్థమును, భుక్త శేషమును తీసికొని, సౌధా ున కేగి, తన భర్తచే భుజింపఁజేసెను తాను మాత్రము భోజ సేయక, భర్తను వీడి, దూరముగ భూమిపై పరుండెను మగఁడు ా మడుగ, అపుడు కొంగు పిరాట్టి - శ్రీరంగమునుండి శిష్యులతో ిసిన యతీంద్రులు - 'మీరు పంచసంస్కారపరులు కానందున, పక ఉపవసించియుండ, నే నెట్లు భుజింతు ?' నని పలికెను 'మీ ప్రీతికై నే నేమి చేయవలెనో తెలుపు' మని అతఁ డడుగ, సంతసించి, 'రేపటి ఉదయము మా గురు చరణారవిందముల )యింపుఁ' డని పలికెను అతఁ డట్లే అంగీకరించెను

మఱునాటి ఉదయము తన నాశ్రయించిన కొంగుపిరాట్టిభర్తకు రాజులు పంచసంస్కారములు గావించి, అచట ఆ దంపతులచే పఁబడుచు, శ్రీరంగమునుండి సన్యాసాశ్రమఁగా ఏర్పడిన మార్గా ు శ్రమము మఱచి, నాలుగు దినములు సుఖముగా గడపి, ాయ దండ కమండలములను వరదుని యెదుట నుంచి స్వీకరించి, ్యము వలె ధరించిరి ఈ మహనీయుల వృత్తాంతమును ఆ సస్థులు విని, యతీంద్రుల పాద పద్మముల నాశ్రయింప, వా రింద

వును పంచ సంస్కారములు గావించి, వారిని రామానుజులు క్షించిరి.

## శ్రీపాదతీర్థ మహిమ

భగవద్రామానుజు లచటినుండి పశ్చిమ దిశగా శిష్యులతో యనమై, 'నెరుపు కొళిను' అనఁబడు వహ్నిపుష్కరిణీకడకు చేరి, చట మూఁడు దినము లుండి, అటనుండి మిథిలాపురిమున కరిగి, ంత కాల మచట గడపి, 'సాలగ్రామ' మను గ్రామమునకు విచ్చేసిరి చటివారు శాక్తేయులు, మాయావాదులు అట్టివా రందఱకును నోదయమును కలిగింపవలెనని రామానుజులు తలచి, దాశరథులను లిచి, 'దాశరథీ! నీవు పోయి ఈ గ్రామస్థులు ఏ తటాకమున నీరు గ్రహింతురో, అందు నీ కాలు సాచుకొని కూర్చుండి రమ్ము' అని యమింప, దాశరథు లట్లే కావించిరి వారి పాదతీర్థ ప్రభావము లన, ఆ యూరివారి యజ్ఞాన మంతరింప, వా రందఱును వరుస రుసగా నేతెంచి, యతిరాజుల నాశ్రయించిరి కడపట కరుదెంచిన ంధ్రపూర్ణులను [4] విశేషముగ అనుగ్రహించి, పంచ మంత్రార్థము ను కృపఁజేసిరి అంతట రామానుజులు పయనము కాగా, వడుగ ంబి చేతులు జోడించి, 'స్వామీ! తమ శ్రీపాదతీర్థము అస్మదాదు ల నిత్యము లభించునట్లు అనుగ్రహింప వేడుచున్నాము, తమ విశ్లే ము మిక్కిలి బాధాకర' మని విన్నవింప, రామానుజులు సమీప మున గల బావిలో తమ పాదము లుంచి, బయటికి విచ్చేసి, ఇదియే

---

4 ఆంధ్రపూర్ణులు -

వీరి జన్మస్థానము మైసూరు దేశమున సాలగ్రామ క్షేత్రము వీరికి 'వడుగనంబి' యను నామాంతరము కలదు వీరు రామానుజ శిష్యులలో నొకరు పరమైకాంతులు, ఆచార్యాభిమాన నిష్ఠ గలవా రగుటచే, సర్వదా రామానుజులతో వెంటనంటి యుండెడివారు.

శ్రీపాద తీర్థముగా స్వీకరించుఁడు, ఈ నాటినుండి ఈ యూరు - 'మిథిల సాలగ్రామ' మను పే॥ ప్రఖ్యాతిల్లుచుండగల' దని సాయించి, అటనుండి నృసింహ క్షేత్రమునకు విచ్చేసిరి అచట నృసింహస్వామిని సేవించి, అటనుండి కన్నడ దేశమునందుగల అచటికి సమీపమందలి తొండనూరు చేరిరి ఆ గ్రామమున వసించు భక్తగ్రామపూర్ణులు (తొండనూరు నంబి) తమ ఆచార్యు లగు రామానుజుల కెదు రేగి, వారిని సేవించిరి. ఉడయవరులు ఆ గ్రామోద్యాన వనమున వేంచేసి యుండిరి

## విఠల దేవరాయలు రామానుజుల నాశ్రయించుట

అప్పు డా కన్నడ దేశమును బౌద్ధ మతావలంబి యగు బిట్టి దేవుఁ డను నామాంతరము గల విఠల దేవరాయలు పరిపాలించు చుండెను (1108 - 1143 A D) అతని పుత్రికను బ్రహ్మ రాక్షసుఁ డావహించెను రాజు - గొప్ప గొప్ప మంత్రవేత్తలను పిలిపించినను, వారి ప్రయత్నము విఫల మాయెను వివస్త్రయై, ఉన్మత్తయై అటు నిటు పరుగు లిడు కుమార్తెను చూచి, దుఃఖించుచున్న రాజపత్ని, ఉంఛ వృత్తికై వేంచేసిన భక్తగ్రామపూర్ణుల కంట పడెను వారు కారణ మడిగిరి రాణి - తన కుమార్తెవృత్తాంతము ను సవిస్తరముగా విన్నవించెను అందులకు భక్తగ్రామపూర్ణులు- 'అమ్మా! విచారము వలదు మా ఆచార్యులైన భగవద్రామానుజులు శ్రీరంగమునుండి ఇచటకు వేంచేసియున్నారు వా రనుగ్రహింపవలెనే గాని, మీ కుమార్తెను బ్రహ్మరాక్షసి వదలు టెంత సేపు ?' అని, రామానుజులు పూర్వ మొక రాజపుత్రిక నావహించిన బ్రహ్మరాక్షసుని పోద్రోలిన వృత్తాంతమును తెలియఁజేసిరి,

అంతట ఆ వృత్తాంతమును రాణి - రాజునకు విన్నవించి ప్రోత్సహింప, అతఁ డందుల కంగీకరించి, భగవద్రామానుజుల నిమిత్త మొక దూతను పంపెను రాజు ప్రార్థనను రామానుజులకు దూత విన్నవింప, రాజాంతఃపురమున ప్రవేశించుటకు రామానుజులు వైముఖ్యము చూపిరి. అపుడు భక్తగ్రామాది శిష్యులు రామానుజులతో - 'ఆచార్యవర్యా! తమ రీ రాజును శిష్యునిగా స్వీకరించిన చో, తిరునారాయణ పురము నుద్ధరింపవచ్చును ఈ దేశమునఁగల జీర్ణ దేవాలయములను సముద్ధరింపవచ్చును వైష్ణవ మతమును దేశమం దంతటను వ్యాపింపఁజేయవచ్చును కావున, రాజు ప్రార్థనను మన్నింపుఁ' డని విన్నవింప, వా రందుల కంగీకరించిరి

రామానుజులు శిష్య సహితులై, రాజ భవనమునకు బయలుదేరిరి. అపుడు విరలదేవరాయలు ససైన్యముతో నెదు రేగి, రామానుజులను సగౌరవముగా - సభక్తికముగా ఆహ్వానించి, రాజ భవనమున ఆసీనుల గావించి, భక్తితో పూజించి, అంజలి ఘటించి, తన కుమార్తె నావహించిన బ్రహ్మ రాక్షసుని పోద్రోల వేడెను

అంతట భగవద్రామానుజుల సూచనానుసారము రామానుజ శిష్యులు - రామానుజుల శ్రీపాద తీర్థమును రాజ కుమారి శిరముపై ప్రోక్షించి ముమ్మారు త్రావింప, బ్రహ్మరాక్షసి రాజకుమార్తెను వీడిపోయెను అంతట ఆ రాజ పుత్రి - అభ్యంజన మాచరించి, సర్వాలంకార సంశోభితయై, రామానుజులకు ప్రణామము గావించి, తండ్రికడ నిలువ, రాజు ఈ యద్భుతమును చూచి, ఆశ్చర్యచకితుఁ డయ్యెను రాజదంపతు లంతట యతిరాజులకు సాష్టాంగదండప్రణామ మాచరించి, 'స్వామీ! యతిసార్వభౌమా! మీ మాహాత్మ్య మద్భుతమైనది భూలోకవాసుల నుద్ధరించుటకై దివినుండి భువికి దిగివచ్చిన దేవతామూర్తులు మీరు మమ్ములను దయతో శిష్యులుగా చేకొని, ధన్యుల

వింప వేడుచున్నా' మని ప్రార్థించిరి. అంతట రామానుజులు రాజ పతులకు దయతో పంచసంస్కారము గావించి, రాజునకు 'విష్ణువర్ధన రాయలు' అను నామధేయము నుంచిరి. ప్రజను లందఱును రామానుజుల పాదపద్మముల నాశ్రయించిరి.

## రామానుజులు బౌద్ధులను జయించుట

ఈ వృత్తాంత మంతయు తెలిసికొని బౌద్ధులు పదివేలమంది వచ్చి, రామానుజులను చుట్టుముట్టి, 'మాయ మంత్రములతో మా వారిని వశపరచుకొన్నట్లు కాదు, మాతో వాదించి జయించినపుడే విజయ' మని గట్టిగా ధిక్కరించిరి. అంతట రామానుజులు వారితో వాదము చేయుటకు సమ్మతించుచు, ఒక మండపము చుట్టును తెరలు కట్టించి, అందు తాము ప్రవేశించి, వేయి పడగలతో ఆదిశేషావతారమును ధరించి, బౌద్ధ భిక్షువులు పదివేలమంది అడుగు ప్రశ్నలకు ఒకే కాలమున వేయి ముఖములతో ప్రత్యుత్తర మొసంగి, అత్యద్భుతముగ వారందఱను జయింప, కొందఱు బౌద్ధులు సందేహ మంది, తెరలను చించివైచి చూడ, వేయిపడగల ఆదిశేషుడు దర్శన మాయె, మఱి కొందరకు - వేలకొలది రామానుజ యతిరూపములు కనవచ్చెను.

అపుడా బౌద్ధులలో కొందఱు తమ పరాజయము నంగీకరించి, రామానుజ ప్రభావమునకు ముగ్ధులై, వారి పాదారవిందములపై బడి శరణు వేడ, విచిత్రమును చూచుటకై తెరలు చించివైచిన మఱి కొందఱు భిక్షువులకు చిత్తవిభ్రాంతి[26] కలిగి, హాహాకారములు చేయసాగిరి. వారికి పట్టిన దుర్గతిని గమనించి జాలి నొందిన విష్ణువర్ధన

26 చిత్త విభ్రాంతి = మతిచాంచల్యము (పిచ్చి)

రాయలు - రామానుజులను ప్రార్థింప, కరుణా సముద్రు ల
యతీంద్రులు వారికి స్వస్థత చేకూర్చి, రాజు కోరికపై ఆ బౌద్ధు ల
అను రామానుజులు పంచసంస్కారపరుల గావించి రక్షించిరి వి
వర్ధనుడు యతీంద్రుల పాద పద్మములందు ప్రగాఢమైన భక్తి కలి
వారి అజ్ఞాన రిక్తమై, వైష్ణవ దేవాలయముల నుద్ధరింప మొదలిడె.
నాటికి భగవద్రామానుజుల వయస్సు 79 సంవత్సరములు (క్రీ
1096)

## రామానుజులు మేలుకోటలో
## తిరునారాయణస్వామిని ప్రతిష్ఠించుట

రామానుజులు - విష్ణువర్ధనరాయలతో, పుర జనులతో అం
విష్ణువు వలె సేవింపఁబడుచుండ, కొలఁది దినములకు - ఊర్ధ్వ పుండ్రము
లకై శ్రీరంగమునుండి తెచ్చిన తిరుమణి నిండుకొనెను ఇందుల
ఉడయవరులు విచారము నందుచుండ, శ్రీమన్నారాయణుడు వా
స్వప్నమున సాక్షాత్కరించి, 'యతీంద్రా! యాదవాచలము
శ్వేతమృత్తిక కలదు నా నివాసము కూడ అచ్చటనే నన్ను
వెంటనే ప్రతిష్ఠించి, ఆలయమును నిర్మింపు' మని ఆదేశించెను
రామానుజు లంతట ప్రాతఃకాలమున ఈ వృత్తాంతమును విష్ణువర్ధ
రాయుల కెఱింగించి, 'రాజా! వెంటనే తిరునారాయణపురమున
పోవలె' నని పలికిరి

అందులకు రాజు సంతోషముతో అంగీకరించి, తిరునారాయ
పురి మఱుగుటకై, మార్గ మధ్యమునఁ గల అరణ్యమును కొట్టించి
మార్గము నేర్పఱచినంత, అందఱును కలిసి బయలు దేరి, యాదవా

్రిలో వేదపుష్కరిణి వద్దకు చేరిరి పూర్వము దత్తాత్రేయ మహర్షి శిలపై కాషాయ త్రిదండములు గ్రహించెనో, ఆ పరిధాన శిలకు యతీంద్రులు నమస్కరించిరి పుష్కరిణిలో స్నాన మాచరించి, రామానుజులు కూడ దత్తాత్రేయుని వలె, నూతన కాషాయ త్రిదండ ములను స్వీకరించిరి. రామానుజ లంతట, ఆ యాదవాచలము నంతయు క్కగా శోధించిరి కాని స్వామిని కానక, కడు విచారముతో ఆ రాత్రి శయనించిరి యాదవాద్రిపతి అచట యతీంద్రుల స్వప్నమున సాక్షాత్కరించి, 'లక్ష్మణాచార్యా! విచారింపకుము. ఈ పర్వతము క్రింద దక్షిణ దిశగాఁగల కల్యాణ తీర్థముకడ సంపంగి తోట కలదు దానికి త్తర దిశలో - తులసిచెట్టుక్రింద పెద్ద పుట్ట గలదు. అందే నా వాసము ఆ తీర్థమునకు ఉత్తర భాగమునఁగల పర్వతము క్రింద, ూర్వము గరుత్మంతునిచే తేఁబడిన శ్వేత మృత్తిక కలదు అది ్వేతద్వీపమునుండి తేఁబడి, నా యాజ్ఞచే అక్షయ మైనది సందేహము డుము, త్వరపడు' మని స్వప్నమున ఆజ్ఞాపింప, లక్ష్మణాచార్యులు ాతిసమున లేచి, రాజు కా వృత్తాంతమును తెలిపి, అందఱను కలిసి ోయి, అట పుట్టను కనుగొనిరి రామానుజ లంతట పుట్టను తమ త్రిదండముతో త్రవ్వి, రామప్రియు లనియు, తిరునారాయణస్వామి ానియు పేరుగాంచిన యాదవాద్రీశుని బయటకు తీసిరి ఆ నాఁడు ుష్య శుద్ధ చతుర్దశీ గురువారము, పునర్వసూ నక్షత్రము. ' శ 1098) అప్పటి రామానుజుల వయస్సు 81 సంవత్సర ములు

దివ్య వాద్య, వేద ఘోషల నడుమ రామానుజులు స్వామికి రాభిషేకము గావించి, మూఁడు దినములు పూజించిరి తదుపరి - ల్యాణ సరస్సుకు ఉత్తర దిశగా నేగి, త్రిదండముతో త్రవ్వి, పర్వతము

మొదట శ్వేత మృత్తికను జూచి, స్వీకరించి ఊర్ధ్వపుండ్రములను ధరించిరి. అటుపిమ్మట రామానుజులు ఆ యరణ్యము నంతటిని కొట్టించి, తిరునారాయణస్వామికి గొప్ప అద్భుత మగు ఆలయమును నిర్మింపఁ జేసిరి. విశిష్ట వ్యక్తులచట స్థిరనివాస మేర్పఱచుకొనఁగా, రామానుజులా యూరికి 'తిరునారాయణపుర' మనియు, 'మేలుకోట' యనియుఁ బేర్లుంచిరి. 'శ్రీరంగరాజభట్టు' అను నొక వైష్ణవుని అర్చకస్వామిగా నేర్పఱచి, సంప్రోక్షణాదులు జరిపించిరి. కాని, పక్షోత్సవ, సంవత్సరోత్సవములను జరుపుటకు ఉత్సవ విగ్రహ మున్నచో బాగుగా నుండెడి దని విచారము నందిరి.

ఈ రీతిగా దేవాలయమును శ్రీపాంచరాత్రాగమ విధానమున తీర్చి దిద్ది, ఉత్సవ విగ్రహమునకై పరితపించు లక్ష్మణార్యులకు తిరునారాయణస్వామి మరల స్వప్నమున సాక్షాత్కరించి, 'లక్ష్మణార్యా! రామప్రియులుగా ప్రసిద్ధమైన నా ఉత్సవ విగ్రహము ఢిల్లీ చక్రవర్తి వద్ద గలదు. కనుక, వెంటనే అచటి కేగి తెచ్చిన మంచి దని సెలవిచ్చిరి. రామానుజు లంతట ఈ విషయమును విష్ణువర్ధన రాజు కెఱింగించిరి. రాజు మిగుల సంతసించి, 'యతిసార్వభౌమా! తమ సంకల్పమునకు వికల్ప మేమి గలదు! నా సర్వస్వము తమ యధీనమే, కావలసిన దంతయు స్వీకరించుఁ' డని భక్తితో బలికెను.

## రామానుజులు ఢిల్లీకి పయనించుట

రామానుజ లంతట రామప్రియులను తెచ్చుటకై ఢిల్లీకి పయనము కాఁగా, వారి వెంట వివిధ వర్ణములవా రనేకులు బయలుదేరిరి. విష్ణువర్ధనరాజు సకల సైన్యముతో సంసిద్ధమై బయలుదేరెను

ఇతఁడటే మును కూర్మపతినిఁ ద్రిప్పిన
మునినిఁగా ద్రిప్పిన మునివరుండు!
ఇతఁడటే మును భాష్య మింపొంద రచియించి
భారతి మెప్పించు భవ్యమూర్తి!

ఇతఁడటే రంగనాథుని కిష్టమంత్రి!
ఇతనిఁ దలచిన సమకూరు నిహ పరంబు
లని పరస్పర మనుకొని రతివ లనుచు
వాది భీకరగురుఁ డనె మోద మలర!'[26]

పూర్వము రాజపుత్రికకుఁ బట్టిన బ్రహ్మరాక్షసుని పోద్రో
మహనీయులు వీరేనా! వేంకటేశ్వరునకు శంఖచక్రము లొ
మహామహులు వీరేనా! కూర్మనాథుని పడమర దిశకుఁ ద్రిప్పిన
మహిమోపేతులు వీరేనా! శ్రీభాష్యమును రచించి, భారతిచే
మెంపఁబడిన మహానుభావులు వీరేనా! రంగనాథునకు అభీష్ట
అమాత్యులు వీరేనా! ఇట్టి యీ భగవద్రామానుజులను స్మ
నచో - ఇహ పరములు సమకూరు' నని అభిభాషించుకొనిరి

అంతట ఢిల్లీశుఁగు యతిరాజుతో - 'అయ్యా! తమ ర
కారణ మెఱుంగఁగోరుచున్నా' మనఁగా, రామానుజులు - '
ప్రియు డని పిలువఁబడు మా తిరునారాయణస్వామి ఉత్సవ విగ్ర
మీ వద్ద కలదని వింటిమి ఆ విగ్రహము నిమిత్తమే మేము
యున్నా' మని పలుక, ఢిల్లీశ్వరుఁ డంతట రామానుజులను గొనిప
అతఁడు కొల్లగొట్టిన విగ్రహము లన్నిటిని చూపెను కాని, వాని
రామప్రియుని విగ్రహము మాత్రము కానరాలేదు అపుడు రామా
జులు - 'చక్రవర్తీ! మీ వద్ద విగ్రహము లేవేని ఇంకను గ
మా దైవ మిచట లేఁడే!' అని పలుక, పాదుషా చిరునగవుత

26 ఆచార్యసూక్తి ముక్తావళి ఉ భా ఆ - 84.

స్వామీజీ! తమ ఇష్టదైవమైన రామప్రియుఁడు - తాము విచ్చేసినంతనే తమ వద్దకు రావచ్చునుగదా! ఏల రాకుండె' నని ప్రశ్నించెను. రామానుజులును 'అది నిజమే' యని తలఁచి, మూరాపెక, తమ విడిదికి వేంచేసిరి.

భక్తవత్సలుఁడైన రామప్రియుఁ డంతట - యతీంద్రుల స్వప్నమున సాక్షాత్కరించి, 'రామానుజ యతీంద్రా! విచారింపకుము. ఈ పాదుషా కుమార్తె యగు బీబీనాంచారు - నన్ను తన అంతఃపురమున బంధించి, తన ప్రణయవాహినియందు ఓలలాడించుచున్నది. రాజాంతఃపురమున యువరాణి వద్దనున్న నన్నుఁ గొనవచ్చు' నని తెలిపి, అంతర్హితుఁ డయ్యెను.

రామానుజు లంతట స్వప్న వృత్తాంతమును స్మరించి, మఱునాఁటి ఉదయము స్నానానుష్ఠానాదులను నెఱవేర్చుకొని, సపరివారముగ, ద్విగుణీకృతోత్సాహముతో రాజుకడ కేతెంచి, ప్రస్తుతాంశమును తెలిపి, ఆ రాజుతోఁ గలిసి, అంతఃపురమున కేఁగి, కస్తూరీ తిలకోజ్జ్వలుఁడు, పీతాంబరధారియునైన రామప్రియుఁడు రామానుజులకు సాక్షాత్కరించెను. కాని, స్వామి యనుగ్రహమును చూరగొనిన బీబీనాంచారు మాత్రము స్వామి మూర్తిని వదల నయ్యెను. ఢిల్లీశుఁ డపుడు - 'స్వామీ! తమ విగ్రహమే కదా! తమ రామప్రియుఁడే కదా! పిలచుఁడు వచ్చినచో గైకొనిపొం' డని పలికెను. విగ్రహ మెట్లు నడచును? నడువనేరదు. కావున, అది తన కుమార్తె వద్దనే ఉండునుగదా! యని అతఁడు తలపోసెను. కాని, రామానుజులు రమ్మని చేతులు చాచినంతనే ఆ రామప్రియుఁడు అచటివా రందఱు చూచుచుండ, తన తేజము దశదిశలు వ్యాపింప, మొలగజ్జెలు ఘల్లుఘల్లుమని నినదింప, వినోదముగు ఒయ్యారపు నడకతో నేతెంచి, రామానుజుల తొడపై కూర్చుండెను. రామానుజు లంతట మహాసంతోషముతో

స్వామిని ఆలింగనము గావించుకొని, ముద్దిడి, శిరమును మూర్కొని, 'మా సంపత్కుమారా! చిట్టితండ్రీ! వచ్చితివా నాయనా!' అనుచు, ప్రియమారు బల్కిరి. ఈ యద్భుతమును గాంచినవారందఱును ఆ స్వామిని - సంపత్కుమారుఁడనియు, యతిరాజ పుత్రుఁడనియు, రామప్రియుని కొనియాడిరి. రామానుజులు ఢిల్లీశునికడ సెలవు గైకొని, రామప్రియునితో యాదవాచలమునకు పయలుదేరిరి.

విగ్రహాకుల స్వాంతయైన పాదుషాపుత్రిక యగు బీబీనాంచారు - రామప్రియుని వియోగమును భరింపఁజాలక విలపించుచుండ, చెలులా విషయమును చక్రవర్తి కెఱింగించిరి. అపుడు పాదుషా - 'విచారమేలనమ్మా!' అని ప్రశ్నింప, 'తండ్రీ! ఆ యదుగిరినాథుఁడు ఎవరో కాదు, నా మనోనాథుడు. అతఁడు లేని నా జీవితము నిరర్థకము. నాకిపుడు ప్రాణత్యాగముకంటెను గత్యంతరము లే' దని విన్నవించెను. చక్రవర్తి ఆ పలుకులు విని, మిగుల విచారము నంది, వెంటనే యతిరాజులకడ కేఁగి, విగ్రహము మిమ్మని ప్రార్థించెను. కాని, చతురులైన రామానుజులు - 'రాజా! ఆడిన మాట తప్పుట పాడికాదు. మీ దేవుఁడైనచో - మీరే గొనిపొండని చెప్పియుంటిరిగదా! నా పిలుపు విన్నంతనే నా వద్దకు పరుగిడి వచ్చిన రామప్రియుని తిరిగి నేనెట్లీయఁగలను? ఇది న్యాయమా?' అని ప్రశ్నింప, చక్రవర్తి లజ్జతో నిరుత్తరుఁడాయెను. అతఁడంతట వెంటనే తన మంత్రులతో సమాలోచించి, తన కుమార్తె యగు బీబీనాంచారును వస్త్ర వాహనములతో, తన కుమారుడగు కబీరును తోడిచ్చి, యదుగిరికి పంపెను. ఊహింపనలవికాని గొప్ప పరివారముతో, వైభవముగా - రామానుజులు రామప్రియునితో, బీబీనాంచారుతో యదుగిరికి బయలుదేరిరి.

చతురంగబల సమన్వితయై, బీబీనాంచారు బంగారుపల్లకి నధిరోహించెను. ఆ పల్లకివెంట - బీబీ సోదరుఁడగు కబీరు నడచుచుండెను

కొంత దూరము రాగా, ఆ పల్లకి తెలిక యగుట ఆశ్చర్యకరము కి తెరలు తీసి చూడ, అందొక రామప్రియుడు మాత్రమే కాన ్పను బీబీనాంచారు - తన ఆరాధ్యదైవము, మనోనాథుడునగు రామ మునిలో ఐక్య మాయెను. ఇది గని, రామానుజు లాశ్చర్య మందిరి కి యాదవాద్రి చేరెను. పల్లకి వెంట కబీరును చేరెను. శిష్య దముతో రామానుజులును సంకల్ప సిద్ధులై చేరిరి.

యతిరాజులంతట శాస్త్ర ప్రకారము సంపత్కుమారుని సంప్రో చి, వివిధోత్సవముల నేర్పఱచి, పుత్రవాత్సల్యముతో నుండిరి నేర్పరచిన ఉత్సవములలో - 'వైరముడి సేవ' ముఖ్యమైనది రామానుజులంతట బీబీనాంచారు అర్చావిగ్రహమును చేయించి, త్కుమారుని పాదపద్మముల వద్ద ప్రతిష్ఠించిరి.

ఈ వృత్తాంతమును ఢిల్లీ పాదుషా తెలిసికొని, సంభ్రమాశ్చర్య ంతములు మనస్సునగొని, మిక్కిలి వ్యథ జెందెను. విద్వాంసులు మును బోధింప, అప్పుడా ఢిల్లీశుడు దైవభక్తి కలవాడై లు దేరి, తిరునారాయణపురము చేరి, అచట వెండ్లికిమారుడగు త్కుమారునకు ధన కానుకలను, అర్చారూపముగనున్న తన కుమార్తె బీబీనాంచారునకు అమూల్యములైన స్వర్ణాభరణములను, వస్త్ర వాహనాదుల నొసంగి, జగద్గురువులగు భగవద్రామానుజులను జించి, సంపత్పుత్రుని గొని తెచ్చుటలో వారికి తోడ్పడిన భక్త దమును గౌరవించి, అచట కొంత కాలము గడిపి, తిరిగి ఢిల్లీకి ెను

## రామానుజులు పంచములను సమాదరించుట

సంపత్కుమారుని తోడి తెచ్చుటలో సహకరించిన పంచములకు కార సూచకముగ, వారికి తిరునారాయణస్వామివారి వార్షిక

మహోత్సవమున మూఁడు దినములు కల్యాణ సరస్సులో స్నాన మేయుటకును, ఆలయమున ప్రవేశించుటకును రామానుజులు అవ మును కల్పించిరి నేఁటికిని ఈ యాచారము కొనసాగుచునేయున్న కొన్ని వందల సంవత్సరములకు పూర్వమే పంచములకు (హరిజనుల దేవాలయ ప్రవేశమును కల్పించిన జగద్గురువులు శ్రీ రామా యతిసార్వభౌములే

పూర్వము కృత యుగమున సనత్కుమారుఁడు ఈ పర్వ మందే శ్రీమన్నారాయణుని ప్రతిష్ఠించి పూజించెను కావు, పర్వతమునకు 'నారాయణాద్రి' యని పేరు వచ్చెను. త్రేతాయు మున మహాయోగి యగు దత్తాత్రేయుఁగు వేదములను పురుషాకా మున శిష్యులుగా నొనర్చి, నారాయణాచలమున వేదపుష్కరిణీ తీరవ నందు తపస్సు చేసినందున, ఆ పర్వతము 'వేదాద్రి' యని పే గాంచెను ద్వాపర యుగమున యదునాథుఁడగు శ్రీకృష్ణునిచే ఆర ధింపఁబడినందున, ఈ పర్వతమునకు 'యాదవాద్రి' యని ఖ్యా కలిగెను కలియుగమున రామానుజులచే పూజింపఁబడినందున, ఈ పర్వము 'యతిశైల మని పేరు గాంచెను

## శ్రీరామానుజులకీర్తి చంద్రిలు

శ్రీమద్రామానుజులు సంపత్కుమారునిచే అనుజ్ఞాతుఁలై, 'పద్మగిరి' యను బౌద్ధక్షేత్రమున కేఁగి, అచటివారి నందఱను జయించి, వారి గ్రంథములను తిరస్కరించిరి యతిరాజులు సెల్వపిళ్ళకు వివిధ కైంకర్యముల నిమిత్తము 52 మంది శ్రీవైష్ణవ స్వాముల నేర్పఱచిరి సంపత్కుమారుని పుత్రవాత్సల్యముతో సేవించుచు,

రామానుజ లచట నొక మఠమును నెలకొల్పిరి అనేకము
జీర్ణ దేవాలయముల నుద్ధరించిరి బౌద్ధారామములు, జైన
వాలయములు మొత్తము 70 సంస్థలను, వాని ఆస్థులను విష్ణు
ర్ధన రాజు రామానుజుల పరము గావింప, ఆ బౌద్ధారామ
ములను జైన దేవాలయములను పడగొట్టించి, ఆ సంస్థలకు సంబం
ధించిన ద్రవ్యముతో - చిల్లలూరులో చెన్నిగి నారాయణ
స్వామి దేవాలయమును, ఎలనాడులో కీర్తి నారాయణస్వామి
దేవాలయమును, గడగలో విజయ నారాయణస్వామి దేవా
లయమును, హరివనహల్లిలో లక్ష్మీనారాయణస్వామి దేవాలయ
ము, తిరునారాయణస్వామి ఆలయముతోపాటు కట్టించిరి రామా
నుజ లీట్లు పంచనారాయణ క్షేత్రములను నిర్మించి జనులను
నారాయణ చరణ సేవా పరాయణుల గావించిరి

తొండనూరులో నొక పుష్కరిణి నేర్పఱచి, దానికి
తిరుమల సాగర' మని పేరిడిరి శ్రీరంగనాథుని విడిన రామానుజ
లిట్లు ఎన్నో కార్యములను నిర్వహించుచు, భాష్య భగవద్విషయము
ను ప్రవచించుచు, సెల్వపిళ్ళను సేవించుచు, శిష్య ప్రశిష్యులతో
తిరునారాయణపురమున నొక పుష్కర కాలము[27] గడపిరి శ్రీరంగ
మును ఎందఱునో శైవ రాజగు క్రిమికంఠుని భయముచే, తిరునారాయణ
పురము చేరిరి రామానుజులు లేని శ్రీరంగము అరణ్యమువలె మారి
పోయెను రామానుజుల ఆగమనమునవలన, దుర్గమారణ్యమగు 'మేల్
నాడు' - మహా పట్టణముగ, తిరునారాయణపుర దివ్యక్షేత్రముగా
తేజరిల్లెను

---

27 పుష్కర కాలము = 12 సంవత్సరములు

## కూరేశ వృత్తాంతము

ఇట్లుండ నొకనాఁడు - శ్రీరంగము నుండి ఒక వైష్ణవుఁడు రామానుజులను దర్శింప నెంచి, తిరునారాయణపురమునకు వచ్చెను. రామానుజు లతనిని కూరేశ వృత్తాంత మడుగ, ఆ వైష్ణవుఁడు చేతులు జోడించి, ఇట్లు విన్నవించెను -

'యతీంద్రా! శ్రీరంగము నుండి కూరేశులు, పూర్ణార్యులు భటుల వెంట చోళరాజ సభ కేగిరి. చోళరాజు వీరిని జూచి, 'శివాత్పరతరం నాస్తి' అని వ్రాయ నిర్బంధించెను. అపుడు కూరేశుఁడు - 'చోళరాజా! వేదశాస్త్ర పురాణేతిహాసము లన్నియు శ్రీమన్నారాయణుఁడే సకల చరాచర ప్రపంచమునకు నాథుండని ఎలుగెత్తి చాటుచున్నవి. అందులకు - 'న దైవం కేశవాత్పరమ్' (విష్ణువు కంటెను మించిన దైవము లేఁడు) మనది చే ఎంత ప్రమాణ మని యిట్లు అనేక ప్రమాణములను పఠించుచు, విష్ణుపరత్వమును నెలకొల్పిరి. ఇందుచే ఆగ్రహావిష్టుఁడైన చోళరాజు - 'అవి యన్నియు నా కనావశ్యములనుచు, 'శివాత్పరతరం నాస్తి' అని వ్రాసి, చేవ్రాలు చేయ నిర్బంధించుచు, చేతికి ఘటము నిచ్చెను. కూరేశుఁడా ఘంటమును గైకొని, 'శివాత్పరతరం నాస్తి' అను వాక్యము క్రింద, 'ద్రోణ మస్తి తతః పరమ్' అని వ్రాసి, చేవ్రాలు చేసిరి. అంతట, ఈ వాక్యార్థ మేమని చోళుఁడు ఆస్థాన పండితుల నడుగ, వారు - 'శివ' యనఁగా - చిన్న కొలత యనియు, 'ద్రోణ' మనఁగా - పెద్ద కొలపాత్ర యనియు చెప్పిరి. ఇందుల కా దురాత్ముఁడు ఆగ్రహావేశమున, కూరేశ - మహాపూర్ణుల నేత్రములను భటులచే నిర్దాక్షిణ్యముగా పెరికిం [illegible]

ంతట వారు శ్రీరంగమునకు మెల్లగా బయలుదేరిరి మహాపూర్ణులు
15 సంవత్సరములుగల వయోవృద్ధు లగుటచే, శాధను భరింపఁ
లక, మార్గ మధ్యమున నొక తోటలో పరమపదించిరి శాతి
ంట వచ్చిన వైష్ణవులు దుఃఖాక్రాంత చేతస్కులై, మహాపూర్ణు
ల అంత్య సంస్కారమును నెరవేర్చిరి ''

ఈ రీతిగా కూరేశ మహాపూర్ణుల వృత్తాంతమును వైష్ణవుఁడు
న్నవింప యతిరాజులు విని, విచారాక్రాంత చేతస్కులై, కొంత
ఏవుకు తేరుకొని, పిమ్మట - సంపత్కుమారస్వామి సన్నిధిలో -
మ గురువర్యు లగు పెరియనంబిగారికి శ్రీ చూర్ణ పరిపాలనము
వించి, వేదములను, నాలాయిర దివ్య ప్రబంధములను, విష్ణు పురా
మును, శ్రీమద్భాగవత పురాణమును, శ్రీమద్రామాయణమును,
భాష్యమును వైష్ణవోత్తములచే పారాయణము చేయించి, అనంత
ం భాగవత తదీయారాధనము గావించిరి కూరేశులకు కన్నులు
ంకుకు ఒకుల వగచి, 'మారుతి సిరి యాచ్చాండాన్' అను నొక
ష్ణవుని కూరేశుల నూరడించుటకై, శ్రీరంగమునకుఁ బంపిరి

## శ్రీరంగమునుండి కూరేశులు వానమామల కేగుట

ఇది యిట్లుండ, ఒకనాఁడు కూరేశులు శ్రీరంగనాథుని సేవింపఁ
వ, అట రాజ భటులు లడ్డగించిరి కారణ మడుగ, 'రామానుజ
బంధు లెవరును శ్రీరంగనాథాలయమున ప్రవేశింపరాదని రాజాజ్ఞ'
ని బదులు పలికిరి అంతట కూరేశులు విచారముతో వెనుదిరిగి
చ్చి, కుటుంబ సమేతముగ 'తిరుమాలిరుం శోలై' అనఁబడు వృష
చలమునకుఁ జేరి, అట సుందరబాహుస్వామిని సేవించుచు - శ్రీ
వము, సుందర బాహు స్తవము, అతిమానుష స్తవము, వైకుంఠ

స్తవము అను నాల్గు స్తోత్రములను భక్తి సంభరితముగ రచించి, శ్రీ రామానుజ యతిసార్వభౌముల సమాగమమునకై స్వామిని ప్రార్థించుచుండిరి

## చోళుని దుర్మరణము

ఇంక చోళుని వృత్తాంత మే మన, అతఁడు వైష్ణవులను వేధించినందులకు ఫలితముగా, అతని కంఠమున పెద్ద వ్రణ మొకటి యేర్పడెను అయినను, అతఁ డంతటితో నాగక, 'వినాశకాలే విపరీత బుద్ధిః' అనునట్లు, తన దేశమునఁగల విష్ణ్వాలయములను ధ్వంసము గావించుచు, శ్రీరంగము వచ్చుచుండ, కంఠవ్రణమున పురుగులు పడుటచే అతఁడు మరణించెను ఈ వార్తను విని, వెంటనే మారుతి సిరియాండాన్ కూరేశుల వద్ద సెలవు గైకొని బయలుదేరి, యదుగిరికి చేరి, శ్రీరామానుజులకు చోళరాజని మరణవార్త నెఱింగించెను దుష్టుఁ డంతరించినందులకు రామానుజు లెంతయు సంతసించిరి

## యదుగిరిలో రామానుజ విగ్రహ ప్రతిష్ఠ

శ్రీ రామానుజు లంతట శ్రీరంగమున కరుదేరవలెనని నిశ్చయించి, తిరునారాయణ స్వామి కైంకర్యపరులగు 52 మంది వైష్ణవ స్వాములను పిలిచి, 'మీరు స్వామి కైంకర్యమును భక్తి శ్రద్ధలతోఁ జేయుచు, సుఖముగా నుండుడు, నేను శ్రీరంగమునకు మఱలి వెడలనున్నా' నని పలుక, వారు యతిరాజుల చరణారవిందములపైఁ బడి, తా మిచట లేకున్న క్షణకాలమేని జీవింపఁజాలము కనుక, మమ్ము కూడ మీతోడనే వెంటగొనిపొం' డని విన్నవించినంత, యతిరాజు లించుక ఆలోచించి, శిల్పశాస్త్ర నిపుణులచే తమ ప్రతిబింబము వలె

ఒక విగ్రహమును చేయించి, తన శక్తిని దానియం దావాహనము చేసి, ఆ విగ్రహమును ఆలింగనము గావించుకొని, దానిని స్వాములచే ప్రతిష్ఠింపఁజేసిరి. మీ మేలు కోరి చేయించిన ఈ విగ్రహమును నిత్యము పూజించుకొనుఁడని రామానుజులు పలుక, స్వాము లపుడు - 'ఆచార్య వర్యా! మాతో మాటాడని ఆ విగ్రహము మా కేల?' నని వక్కాణింప, వారు - 'విగ్రహమున కొక తెర పట్టించి పిలువుఁ' డని ఆజ్ఞాపించిరి. ఆ స్వాము లంతట అట్లే తెర కట్టి, 'ఆచార్యవర్యా! రామానుజ దేశికా! మా స్వామీ!' అని పిలువ, తెరలోపలనుండి, 'అడియేన్' అను శబ్దము వినఁబడెను. అందులకా శిష్యులు కొంత వరకు ఊరడిల్లిరి.

భగవద్రామానుజు లంతట కొందరు శిష్యులతో శ్రీరంగమునకు విచ్చేయ, వారికి దాశరథి ఛత్రము పట్టెను. గోవిందుఁడు వీవనతో విసరెను. జయజయ ధ్వానములు ప్రతిధ్వనించెను. మంగళ వాద్యములు మారు మ్రోగెను. వేదఘోష దిక్కులు పిక్కటిల్లెను. ఇట్టి కోలాహలముతో, ఇట్టి స్వాగత విశేషములతో శ్రీమద్రామానుజులు శ్రీరంగనాథుని సేవించిరి. శ్రీరంగనాథుఁ డపుడు నోరు తెఱచి, దంత కాంతులు మెఱయ, 'యతీంద్రా! చోళుని వలన నీకు కష్టము లనేకములు వాటిల్లెఁగదా!' యని పలుక, రామానుజులు - శరణాగత రక్షకుఁడవగు నీవు మా అండ నుండ, దాసులగు మా కేల కష్ట' మని వినమ్రులై విన్నవించిరి. శ్రీరంగనాథుఁ డపుడు తీర్థ ప్రసాదాదు లిప్పించి గౌరవించెను.

### కూరేశులు వానమామలనుండి తిరిగి శ్రీరంగము చేరుట

దుష్టుఁడగు చోళరాజు మరణింప, రామానుజులు శిష్య సమేతముగ తిరునారాయణ పురమునుండి శ్రీరంగమునకు విచ్చేసిన

కూరేశులు తెలిసికొని, కుటుంబ సమేతముగ వానమామలనుండి మరల శ్రీరంగమునకు వచ్చి చేరిరి

శ్రీరామానుజులు శ్రీరంగనాథాలయమునుండి మఠమున కేఁగి, తదుపరి కూరేశ గృహమున కరిగిరి కూరేశులు వెంటనే యెదు రేగి, యతీంద్రుల పాదపద్మములపైఁ బడి, ప్రణామ మాచరించిరి, రామానుజులు వారిని ఊరడించి, తిరిగి తమ మఠమునకు చేరిరి తదుపరి, పండితులు, పురజనులు వరుస వరుసగా చేతెంచి, యతిరాజులను దర్శించిరి

## రామానుజులు గోవిందరాజుల నుద్ధరించుట

కొందఱు వైష్ణవులు తిరుపతినుండి శ్రీరంగమున కేతెంచి, యతిరాజులను సేవించి, 'అయ్యా! చోళరాజు చిత్రకూటమును జయించి, ఉత్సవ మూర్తులతోఁగూడ, గోవిందరాజులను సముద్రమున విసిరివేయవలెనని సంకల్పించెను స్వాము లపుడు - ఉత్సవ మూర్తులను వేంకటాచలమునకు చేర్చిరి గోవిందరాజులను సముద్రమున పడవేయఁదలచిన ఆ రాజును - 'తిల్ల' యను నొక వేశ్య, గోవిందరాజ చరణకమలాసక్తయై, ఆతని దారి తప్పించెను చోళుఁడు మార్గ మధ్యమున క్రిమికంఠుఁడై మరణించె' నని విన్నవించి నంత, రామానుజులు మిగుల విచార మంది, వేంకటాచల మేగి, శ్రీనివాసుని సేవించి, గోవిందరాజుల ఉత్సవ మూర్తులనుఁ గాంచి, ఆ మూర్తులను తిరిగి తిరుపతికి చేర్పించి, యథా విధిగ ప్రతిష్ఠించి, ఆ స్వామికి తిల్లగోవిందు' లని పే రిడి, అట నుండి పయనమై, కాంచీపురమున వరదరాజులను సేవించి, తిరిగి శ్రీరంగమునకు చేరిరి.

## కూరేశులకు వరదరాజులు నేత్రములను ప్రసాదించుట

అనంతర మొకనాఁడు రామానుజులు కూరేశులతో - 'కోరిన కోరికలఁ దీర్చు భక్తవరదుఁడైన దేవరాజుల నుద్దేశించి ఒక స్తోత్రము ను రచింపుము ఆ స్వామి నీకు తప్పక నేత్రములను ప్రసాదించు' అని తెలిపిరి. కాని, కూరేశులు నేత్రములు ఏల దనిరి. కాని, రామానుజులు పదే పదే కోరఁగా, కూరేశులు 102 శ్లోకములతో, వరదరాజస్తవమును మనోహరముగా రచించుచు, అందు -

స్వస్తి హస్తిగిరి మస్తశేఖర స్సంతనోతు మయి సంతతం హరిః
నిస్సమాభ్యధిక మభ్యదత్తయం దేవ మౌపనిషదీ సరస్వతీ ॥" ౧

ఎవనితో సములును, ఎవనికంటె నధికులును లేరని ఉపనిషత్తులు చెప్పఁబడిన నారాయణుఁడు - కాంచీపురమున హస్తిగిరియందు వెలసిన అర్చారూపుఁడగు వరదుఁడు నాకు మేలు చేయుఁగాక !"

నీలమేఘనిభ మంజనపుంజ శ్యామకుంతల మనంతశయం త్వామ్
అబ్జపాణిపద మంబుజనేత్రం నేత్రసాత్కురు కరీశ సదా మే ॥ ౬౧

కరిగిరినాథా ! నీలమేఘము వంటియు కాటుకవలె నల్లని శిరోజములు గల, పద్మములవంటి హస్త - పాద - నేత్రములు గల నిన్ను నా కెప్పుడును కనబరచుచుండుము."

రామానుజాంఘ్రి శరణోఽస్మి కులప్రదీప
స్త్వాసీత్స యామునమునే స్స చ నాథ వంశ్యః
వంశ్యః పరాంకుశమునే స్స చ సోఽపి దేవ్యాః
దాస స్తవేతి వరదాస్మి తవేక్షణీయః ॥" ౧౦౨

'వరదా! నేను రామానుజుల పాదారవిందముల నాశ్రయించినవాఁడను. ఆ రామానుజులు యామునుల జ్ఞానసంతతికి దీపము వంటివారు. యామునులు - నాథమునుల వంశీయులు. నాథమునులు పరాంకుశమునుల జ్ఞాన సంతానము. పరాంకుశమునులు - లక్ష్మీదాసులు. అందువలన, నేను నీచే చూడఁదగినవాఁడ' నని అప్రాకృత దివ్యదృష్టిని ప్రసాదింప ప్రార్థించిరి.

అంతట వరదరాజులు ప్రసన్నులై, స్వప్నమున - 'నీకు దివ్యచక్షువుల నొసంగెద' నని కూరేశులకు అభయ మిచ్చెను. కూరేశులంతట తమ స్వప్నవృత్తాంతమును యతిరాజులకు విన్నవించి, అనంతరము తాము రచించిన వరదరాజస్తవమును విన్పింప, రామానుజులు మిగుల సంతసించి, కూరేశులను వెంట నిడుకొని కాంచిపురమున వేంచేసిరి.

అచట వారు కోవెల కేఁగి, ఆచార్యాజ్ఞచే కూరేశులు వరదరాజస్వామికి తాము రచించిన వరదరాజస్తవమును విన్పింప, స్వామి ప్రసన్నులై, 'వరము కోరు' మనెను. కూరేశులు చేతులు జోడించి, 'స్వామీ! మీ దయచే నే పొందు లోకమును నాలురాచ్చాన్ పిళ్ళైగారు పొందవలెనని నా కోరిక. ఇదియే నాకు కావలసిన వరము.'

రామానుజులు ఇది విని, 'కూరేశా! నేనొకటి యడుగుమన, వేఱొకటి కోరితి వేల?' యని ప్రశ్నించి, 'నేత్రములు లేవు కదా!' యని విచారమునందుచుండ, వరదరాజులు ప్రసన్నులై, విచారింపవలదని తెల్పి, [illegible] నేత్రములు ప్రసాదించెను. కూరేశులపుడు వరదరాజస్వామిని పాదాది కేశపర్యంతము తనివి తీ

సేవించి, పరమ పవిత్ర తేజోమూర్తులై, అపర సూర్యునివలె ప్రకా శించుచున్న తమ ఆచార్యులగు రామానుజులను కనులారా సేవించి, వారికి పాదాభివందన మాచరించి, సంతసించిరి

తమ అంతరంగిక శిష్యులలో ముఖ్యులగు కూరేశులకు దేవ రాజులు అనుగ్రహముతో మరల నేత్రములను ప్రసాదించినందులకు రామానుజులు పరమానందభరితులై, శ్రీ స్వామికి కృతజ్ఞతాభివందన మాచరించిరి అనంతరము ఆ గురు శిష్యు లిరువురును శ్రీరంగమునకు తిరిగి వచ్చిరి

## రామానుజులు గోదాభీష్టమును నెరవేర్చుట

మున్ను గోదాదేవి 143 పాశురములతో - 'నాచ్చియారో తిరుమొళి' యనుపేర నొక దివ్యప్రబంధమును రచించుచు, అందలి 9 - వ దశకమున 6, 7 పాశురములలో - శ్రీ వనాద్రినాథుఁ డగు సుందర బాహుస్వామికి నూరు పాత్రలతో వెన్నను, నూరు పాత్ర లతో శర్కర పొంగలిని మాటలచేతనే సమర్పించి, స్వీకరింపుమని ఆ స్వామిని ప్రార్థించెను అట్టి గోదాదేవి యభీష్టమును భగవద్రామా నుజులు నిర్వర్తించుటకై వనాద్రి కేగి, స్వామికి నూరు పాయస ఘటములను, నూరు నవనీతఘటములను సమర్పించిరి అటనుండి శ్రీ విల్లిపుత్తూరు కేగి, గోదాదేవిని సేవింప, తన చిరకాలవాంఛ సఫలము గావించినందులకు ఆమె మిగుల సంతసించి, రామానుజులను - 'మా శ్రీరంగము సోదరులు' అని ప్రశంసించెను అంతట రామానుజులచట తీర్థ ప్రసాదము లు స్వీకరించి, అటనుండి పయనమై, ఆళ్వార్ తిరునగరి కరిగి, అట నమ్మాళ్వారులను సేవించి, తిరిగి శ్రీరంగము చేరిరి

## భగవద్రామానుజుల భవిష్యద్వాణి

రామానుజు లొకనాఁడు తమ శిష్యులను రావించి, దాయ రహస్యములను తదేక దీక్షతో - మూఁడహోరాత్ర ప్రవచించిరి శిష్యులందుల కాశ్చర్యమంది, ఆచార్యులను నడిగిరి రామానుజు లపుడు - 'భాగవతోత్తములారా! శ్రీ నాథుఁడు నా పరమపద గమనమునకు ఆజ్ఞాపించియున్నాఁడు నుండి నాల్గవ దినముననే నా వైకుంఠ ప్రయాణ' మని వివరింప నిపాతమువంటి ఆ వార్తను విని, వారు నిశ్చేష్టులై, రామానుజ వి గమును సహింపఁజాలక, దుఃఖింపసాగిరి అపుడు రామాను వారిని ఓదార్చిరి అంతట వారు చేతులు జోడించి, 'స్వామీ! కైంకర్య దూరులమై, మేము క్షణకాలమేని బ్రతుకజాలము ? ఉపాయాంతరములను తామే ఆనతీయుఁ' డని ప్రార్థించిరి

శిష్యుల ప్రార్థనానుసారము రామానుజులు వెంటనే శిల్పు రావించి, తమను పోలియుండు అర్చా విగ్రహమును చేయించి శుభ సమయమున ఆ శిలా విగ్రహమును ఆలింగనము గావించి బ్రహ్మరంధ్రము నాఘ్రాణించి, అందు తన తేజస్సును ప్రసరింపఁ రామానుజ ప్రతిబింబమునలె నున్న ఆ యర్చా విగ్రహము - దీ నుండి ప్రభవించిన దీపశిఖనలె ప్రకాశించెను సర్వలక్షణ సుందర ఆ విగ్రహము ప్రతిష్ఠింపఁబడిన యనంతరము శిష్యులతో - 'నా లారా! ఈ విగ్రహమును నన్నుగా నెంచి, నిత్యము ఆరాధించు చుండుఁడు అందువలన మీకు తృప్తి, ఆనందము చేకూరు' నని తెలియ, వారట్లే చేయసాగిరి

ఇది యిట్లుండ, మొదలియాండాన్ పుత్రులును, వాధకూలంకారులునగు రామానుజ దాసులు శ్రీరంగమున రామా

ను సేవించి, అంజలి ఘటించి, 'స్వామీ – తమ అవతారస్థల మగు శ్రీపెరుంబుదూరు లో – దాసుల సంరక్షణార్థమై, తమ అర్చా విగ్రహము నెలకొల్పుం డని ప్రార్థించిరి. రామానుజదాసుని అభ్యర్థనానుసారము భగవద్రామానుజులు మరియొక అర్చా విగ్రహమును చేయించి, పూర్వమువలెనే తమ తేజస్సును అందావాహనము గావించి, తదుపరి – ఆ విగ్రహ ప్రతిష్ఠ కొక శుభ ముహూర్తమును నిర్ణయించి, రామానుజ దాసున కొసంగిరి. అంతట రామానుజదాసు లా విగ్రహమును భూతపురికి చేర్చి, అచట వేంచేసియున్న శ్రీ ఆదికేశవ స్వామిసన్నిధిలో – యథావిధిగా ప్రతిష్ఠించిరి.

శ్రీరంగమున శిష్యు లందఱును శ్రీమద్రామానుజులతో – 'యతీంద్రా! మే మెట్లుండవలెనో? ఆనతీయుం' డని బద్ధాంజలి పుటులై ప్రార్థించిరి. అపుడు యతీంద్రులు – 'నాయనలారా! ప్రపన్నుని అదృష్టము భగవదధీనము కావున, ఫలమునుగూర్చి సంశయింపరాదు. అట్టి సంశయ బుద్ధితో ఆత్మ సమర్పణ మొనర్చినేని, అది వ్యర్థమే యగును. ఇతర అదృష్టము కర్మాధీనము. దేహయాత్రయం దైనను నిమిత్త మాత్రులమని తలంచవలెను. భగవత్కైంకర్య బుద్ధితోడనే కర్మల నాచరింపవలెను. భక్తి ప్రపత్తులే ముముక్షువులకు తరణోపాయములు' అని ఉపదేశించి, చివరకు –

"శ్రీభాష్య ద్రవిడాగమ ప్రవచనం శ్రీశస్థలే ష్వన్వహం
కైంకర్యం యదుశైల నిత్యవసతిః సార్థ ద్వయోచ్చారణమ్
యద్వా భాగవతాభిమాన వసతిః శ్రేయస్కరా మిత్యలం
శిష్యాన్ ప్రాహ యతీశ్వరః పర మగాత్ విష్ణోః పదం శాశ్వతమ్ "[28]

---

28 ప్రపన్నామృతము 67 - 19.

శ్రీభాష్యమును, ద్రావిడ దివ్యప్రబంధములను అధ్యయనం చేయుచు, కాలము గడపుచుండవలెను అది చేతకాదేని, దివ్య తి పతులలో నిత్యనివాసము చేయుచుండవలెను. అది సాధ్యము కాదే భగవత్కైంకర్యము చేయుచుండవలెను అదియును చేయ నిచో - అర్థ పూర్వకముగా ద్వయమంత్రానుసంధానము చేయుచుం వలెను అదియును చేతకాదేని, ఒక భాగవతోత్తముని అభిమానమునకు పాత్రులై, నిత్య కైంకర్యమును చేయుచున్న చాలు' న శిష్యులకు చరమోపదేశము గావించిరి

## రామానుజుల పరమపద గమనము

అనంతరము రామానుజులు గోవిందార్యుల ఒడిలో పాదవలుంచి, భృగువల్లి, ఆనందవల్లి, గద్యత్రయము, సహస్రగీతి మున్న వానిని అచటి ద్విజశ్రేష్ఠులు పఠించుచుండ, మహాపూర్ణుల పాదుకల ఎదురుగా నిడుకొని సేవించుచు, ఆళవందారుల చరణారవిందముల మనమున ధ్యానించుకొనుచు, 120 సంవత్సరముల పరిపూర్ణాయ ర్దాయువంతులై, మాఘ శుద్ధ దశమీ శనివారము నాటి మధ్యాహ్న సమయమున (క్రీ శ 1187) భగవద్రామానుజులు బ్రహ్మ కపాలమును భేదించుకొని, శాశ్వతమైన విష్ణు సాయుజ్య మలంకరించిరి

"శ్రీమన్ మహా భూతపురే శ్రీమత్ కేశవ యజ్వనః
కాంతిమత్యాం ప్రసూతాయ, యతిరాజాయ మంగళమ్ "



# శ్రీమద్రామానుజోదాహరణము

శిరోమణి - విద్వాన్

ఆంధ్ర విద్యానాథ - బ్రాహ్మ భూషణ

## శ్రీమాన్ చెలమచెర్ల రంగాచార్యులు



### ప్రథమ దళము

శ్రీరామా రమణాంఘ్రి సారస సుధాసేవా విలాసోల్లస
ద్ధీరాజ్యంబున భట్టభద్రుఁ డగుచున్ దివ్యాన్య సంపత్తులం
జేరంబోవని యోగిరాజు, సుమహోజేగీయ మానోదయుం
డా రామానుజసూరి వెల్గెడు విశిష్టాద్వైత జీవాతువై

కళిక

మఱియు శ్రీపెరుంబుదూరను మహిత సరసిని విరియు పద్మము
నెఱయు యతితతి జ్ఞానభిక్షుక స్మేర ముఖముల దరియు పద్మము
అమల కాంతిమతీ సతీ ప్రా గంగనామణి గర్భరత్నము
సుమతి కేశవభట్ట భూసుర శోభనైక ఫల ప్రయత్నము
సప్తశైల నివాసియౌ శ్రీశైలపూర్ణుల భాగధేయుఁడు
దృప్తవాది విరోధిశీర్ష విదీప్తమంగళ విజయకేతువు
భవ్య పరతత్త్వార్థ నిశ్చితిఁ బతగి కేతన విజయకేతువు
సవ్రతమ నిగమాంతకాంతా స్వాంత సాంత్వన ముఖ్యహేతువు

ఉత్కళిక

ధ్యాన మించుక లేక హరిపై - జ్ఞాన మింతయు లేక ధరపై
పుట్టి గిట్టుచు గిట్టి పుట్టుచు - పట్టిపూనికఁ బట్టి నెట్టుచు

దరినిఁ జేరఁగలేని జీవుల - హరినిఁ జేరెడు నట్టి త్రోవల
జూపి ప్రోచిన సూరివర్యుఁడు - పాపముల నెడబాప ధుర్యుఁడు

## ద్వితీయ దళము

కానుగ మున్ను కాల్కడలి మంజుల మంగళ పుష్పశయ్యయై
గ్రానికఁ దమ్ముఁడై పిదప ఫుల్లసరోరుహ నేత్రు గొల్చి, రా
మానుజమూర్తియై కలిని నా హరితత్త్వముఁ దెల్పువాని, వి
నానిన రేఁబ్య గఁబ్య యతిసత్తము జత్తము హత్త గొల్చెదన్

### కలిక

మఱియు సర్వవేదశాస్త్ర మహిమ నింపునునమువాని
నెఱిని జక్రవర్తిభార నిర్వికారుఁ డయినవాని
స్వప్రకాశసహిత యాదవప్రకాశుఁ డయినవాని
విప్రకుల మహాపయోబ్ధి విమలచంద్రుఁ డయినవాని
గరుఁడు యాత్ర నిమను దాపఁగోర తెలిసి మెలఁగువాని
సిరియు హరియుఁ ద్రోవఁ జూపఁ జేరి కాంచి వెలుఁగువాని
కాంచిఁ గాంచిపూర్ణకృపను గాంచి తత్త్వ మెఱుఁగువాని
సంచితాన్యభావనా ప్రపంచభక్తి దనరువాని

### ఉత్కలిక

ఆదికావ్యసార మెల్ల - ఆదరమునఁ జేసి కొల్ల
కొల్లగాగ నుల్లముల్లసిల్ల - ద్రావపమామ, తెల్ల
తెల్లనై ప్రపత్తినిష్ఠ - వెల్లివిరియు సుప్రతిష్ఠ
లోకమాన్యుఁ డయినవాని - ప్రాకృతాళి మరుచువాని,

## తృతీయ దళము

మని పట్టుగొమ్మనుమ ! భాగవతాళికిఁ, బల్లవానవీ
ముకు నింటి భూతమునా నాశిలఁ జేయు టదెంత వింత ? మా
యఁగఁ జూచుమాత్ర ఘన సంస్కృతి భూతము లెల్ల ద్రెళ్ళ మా
యతిరాజుచేత విలసిల్లు యనోరథ సిద్ధు లెల్లెడన్

### కళిక

మఱియు శిష్టాచార మార్గపోషునిచేత
పిఱికోని వాక్యార్థ పృథివి భీమునిచేత
శ్రీయామునస్వామి చిత్తచోరునిచేత
తోయజాక్షపరత్వ దుందుభి ధ్వనిచేత
క్షనముద్రాలసిత శ్రీ సహస్తునిచేత
వైనతేయ తురంగ బద్ధచిత్తునిచేత
భవరోగజాలములఁ గాపు వైద్యునిచేత
స్తవనీయ గుణము లుదనరు హృద్యునిచేత

### ఉత్కళిక

యామునార్య ప్రేతము తెంగి - స్వామి కృతులనే రచించి
తీర్థఁ గోర్కెలనెడు మంచి - వార్తి వేళ్ళ నిరియఁ గాంచి
ధన్యజీవితం బటంచు - సూర్యసరులు సంస్తుతింప
చరిత నెసఁగు ధుర్యుచేత - గురువు లక్ష్మణార్యుచేత.

## చతుర్థ దళము

కపియాసనంబువలె నా హరి యుండునటంచు నొజ్జ గా
వ పల్కు ముల్కుగుటు, భానసఁ దక్కువిసూక్ష్మ డంచు లోఁ
ఁ వచింపఁ బండితులు ధీవిభవమ్ము నుతించి చట్టి గీ
ఁ యతిమాళికై కృతులు దోరపుభక్తి రచింప నింపగున్

### కళిక

మఱియును శాంత వసంత నిశాంతము
మధురాంతకమున మసలు మేటికై
తెలివులు సూపు మహా గుణపూర్ణులఁ
దీర్థులఁ బొందిన పుణ్యాపేటికై
పూర్ణుల పూర్ణ కృపార్ణవ మొసఁగిన
పూత సుమంత్రామృత పాయికినై
చూర్ణిత దాసజనాఖిలదోష సు
సుందర మందస్మిత దాయికినై
కాషాయాంబర వేషో ద్భాసిత
కాయ సురద్రుమ కమనీయునకై
ఘోషిత కౌస్తుభ భూషా తోషణ
గురుతామల వాక్ స్పృహణీయునకై
కరము త్రిదండము గరమున మెఱయఁగఁ
గన్నులఁ జన్న ప్రసన్నుల పతికై
హరియే పరుఁడగు హరియే గురుఁడగు
హరియే నరుఁడని చాఁటెడు యతికై

### ఉత్కళిక

అనని యథార్థము గాదని మతికై
తనమునఁ బల్కు వితండుల ముఖకై
రవములు మొగిపెంగ గఱకరి నుడికై
దువు భానులు సెలఁగఁగ వమి రవికై
కొంపు దీప్తులఁ దగి, భక్తుల కై
వారిములం గొని దాసుఁ గనికై
నల్పమ్ముఁ జూపిన గుణశేవధికై
కల్ప కృపారస ఘన నీరధికై

## పంచమ దళము

శ్రీరాంభోనిధి కన్యకా నవ పంకేజాత నిర్యాత వా
క్సారామోద పరంపరా ప్రవిలసత్కర్ణద్వయీ శాలి యా
నీరేజాక్షుఁడె మే లనంగఁ గవితా నిర్మాణముల్ సేయు మా
శ్రీరామానుజ యోగివర్యువలనం జేకూరు సర్వార్థముల్.

### కళిక

మఱియు తిరుమంత్ర సుమ మధుపరాజము వలన
అఱగొఱలు తొలఁగించు సమిధ భూజము వలన
ఎసఁగు కృపఁ గూరేశు నేలు తీర్థుని వలన
వెస వైష్ణవోద్ధార పీఠపార్థుని వలన
స్వాలాప పరిపోషి తాంధ్రపూర్ణుని వలన
వ్యాలోల జనతావ నాగ్రకర్ణుని వలన
శిష్యతాగాంవాశ్రిత దాశరథి వలన
హృష్యద్రమేశాష్ట హృదయసీరథి వలన

### ఉత్కళిక

గోష్ఠిపూర్ణులఁ జెంది - నిష్ఠ మంత్రముఁ బొంది
గురు వాజ్ఞలను మీఱి - దరి గోపురముఁ జేరి
మూలమంత్రము జాఁటి - లీల మానవకోటి
నలరించు కృతివలన    వెలయు యతిపతివలన

## షష్ఠ దళము

కలశాట ప్రాణులకు వేలుపురాణికిఁ గ్రొత్త కప్రపుం
కల నేల కత్తి కుదిఁ దేర్చిన వెన్నుని పాట బోటికిన్
వ్వన సెజ్జ చిల్కనుడి కూరిమిచానకు, వేని డెంద మా
యకాఁకు - మా గురుఁడు యువర్లకు నిచ్చలుఁ గేలు మోడ్చెదన్

### కలిక

మఱియును యామునఋషి యాదేశము
మౌళి వహించిన మంగళ పతికిన్
గురుతుగ శ్రీరంగమ్మునఁ బీఠము
గోరఁగ నెక్కిన దేశిక పతికిన్
ఆగమ వాక్య పరాక్రమ లీలను
యజ్ఞ సుమూర్తిని గెల్చిన గుణికిన్
భాగవతాకాశ మ్మది వెల్గఁగ
భాసిలు జ్ఞాన నభోమణికిన్
గోవిందాఖ్యుని వైష్ణవ ముద్రల్
గూడఁగ జేసిన గురుతర యతికిన్
పావన వాచా లహరుల ద్రావిడ
వసుమతిఁ బూత మొనర్చిన కృతికిన్
బంధుర మాయావాది తమమ్ములఁ
గాఱఁగ ద్రోలిన భాసుర రవికిన్
బంధన హేతు వివాది కువాది
ప్రచలయాచల గణ ఖండన పవికిన్

### ఉత్కలిక

తొలి ముగురాళ్వారులు నుడిఁ జేయని
కులశేఖరు లటఁ గాల్వలు దీయన్
అల శఠగోపులు విత్తులు వేయన్
లలి పెరియాళ్వార్ నీరము వోయన్
అలరుల నాండాళ్ ముడువగ మాలిక
అలరెడి వైష్ణవ వనమున కేలిక
వీనులఁ దనిపెడి కోఝల తేనికి
దీనులఁ బ్రోచెడి దివ్య జ్ఞానికి

## సప్తమ దళము

ద్రారంభములు౯, రమా రమణ దివ్య శ్రావ్య కావ్యోక్తి సం
దాగమ్ముల, పద్మనాభ దృఢ సంబంధుత్వ సంకేతముల్
ముద్రాంకమ్ములు గల్గి వెల్గు సుకృతుల్ మోదింతు రెంతేని శ్రీ
రామానుజ యోగియందు, యతి సామ్రాజ్యేశునం దెప్పుడు౯

### కళిక

మఱియు వేంకటాద్రి హరిని మహిమ జూపు సూరియందు
కోటలు భక్తిఁ జేరువారి కోటలు మాపు శౌరియందు
కాల గతికి నెదురు నడచి గ్రాలునట్టి వానియందు
మేలుకోటఁ బరిత జనుల మేలుగూర్చు వానియందు
వనజ నయన శయన మనుజ భావనావతారునందు
మనసిజాత జాత వికృతి గ్రమ్మఁ జేయు ధీరునందు
నాస్తి నాస్తి వాది మాలి న్యస్తపాద పద్మునందు
ఆస్తిక ప్రపంచ సంచితార్థ విభవ సద్మునందు

### ఉత్కళిక

మేలు కావి కాటిగట్టి కేల దండ మొనరఁ బట్టి
నిలువు పుండ్రములనుఁ బెట్టి తళుకు జందెములను జుట్టి
వన్నె చిన్నె లన్ని నెట్టి చిన్న సిగను దాల్చినట్టి
మంగళాంగ రంగునందు - రంగపద్మ భృంగమందు

## సంబోధన దళము

శ్రేలు మరంచి చూపు మనుమీా! యీా విశ్వ విశ్వంబున౯
ద ప్రాభినా! శాస్త్ర సంగతినా! సత్ప్రామాణ్య సంపత్తినో?
కన్నిసరి నిల్వగల్గు మతిను ద్వైదండు వే లోకమునన్
దండల్ యతిరాజ! రాజవదనాంభోజా! త్వ దారాధనన్,

### కళిక

మఱియు శ్రీభాష్యకృన్మహనీయ శుచికీర్తి!
నళులు శాంతిప్రభల వరణీయ రుచిమూర్తి!
గీతలను భాష్యమున్ గీలించు మతిప్రోఢ!
చేతమున హరి నిల్పఁజేసికొను యతిఱేఁడ!
సరస గద్య త్రయీ సంధాన గుణశాలి!
పరమపద సోపాన పాళీ వచఃకేళి!
వేదాంతసార కృతి వేదితాగమమర్మ!
వేదాంతదీప రుచి విన్యస్తాఖిల సుధర్మ!

### ఉత్కళిక

పాతముల్ వడి డెల్చి - పీరముల్ గడు నిల్చి
జిష్ణువాదము వేసి - విష్ణు మయముగఁ జేసి
తనయాన జగమెల్ల - అనయమ్ము వర్ధిల్ల
వర్ధిల్లు గుణసాంద్ర! వర్ధిల్లు యతిచంద్ర!

### సార్వ విభక్తికము

యతి రత్నంబవు నీవు – నిన్ను గొలుతున్ - ప్రాప్తించు నీచేత స
ద్గతి - నీకై కృతు లిత్తు - నీవలనఁ జేతఃప్రీతి సంధిల్లు - శ్రీ
పతి నీకుం గడుఁ గూర్చువాఁ డగుట సంపద్వృద్ధి నీయందు – శ్రీ
వ్రత! రామానుజ! మమ్ము నేలుకొనుమీ! స్వామీ! నమోవాకముల్

### అంకితాంక దళము

సూరుల్ పత్రమొ పుష్పమో యను విధిన్ రంగాఖ్యుఁ డీ
సారోదాహరణమ్ము నాంధ్ర కవితన్ సంధించి సద్భక్తిమై
శ్రీరామానుజ కీర్తి కౌముదిగఁ, ద్వచ్ఛ్రీపాద కళ్యాణకృ
న్నీరేజమ్ముల ప్రోల గాన్క యిడె, దీనిన్ స్వామి! గైకోఁగదే!

— ㅇ —

# శ్రీమద్రామానుజులు - భక్తి తత్త్వము

'విశిష్టాద్వైత వేదాంత విశారద'
శ్రీమాన్ చించాపట్టణం శ్రీరంగాచార్యులు, ఎం ఏ; బి యిడి.



## శ్రీ రామానుజ ప్రబోధము

"శ్రీమాధవాంఘ్రి జలజ ద్వయ నిత్యసేవా
ప్రేమా విలాశయ పరాంకుశ పాద భక్తమ్
కామాది దోషహర మాత్మ పదాశ్రితానాం
రామానుజం యతిపతిం ప్రణమామి మూర్ధ్నా."

మన భరత ఖండము పురాణ ప్రసిద్ధమైన పుణ్యభూమి, ఈ పవిత్ర ధరిత్రిపై ఎంద రెందరో మహామహులు జన్మించి, ఆధ్యాత్మిక తత్త్వములను ప్రకాశింపజేయు దర్శనము లనేకములను వేద వేదాంత సారమును సంప్రదాయ బద్ధముగ ప్రవచించి చెప్పి, ధార్మిక నిష్ఠను, సత్య సంధతను, భగవద్భక్తిని, సర్వ మానవ సమానత్వమును ప్రపంచమునకు చాటి చెప్పి, భావి తరములవారికి రాచబాటలు తీర్చి దిద్ది, చరితార్థు లయిరి.

పరమాత్మ - స్వరూప రూప గుణ విభవములతో సర్వోత్కృష్టుఁడై, అఖిల చేతనా చేతనములకు తానే ఆధారభూత మయి, తనకు వేరొక ఆధారము లేనివా డయి, దేవ మనుష్యాది జాతులును, శ్వేత కృష్ణాది వర్ణములును, వృద్ధి క్షయాది వికారములును, జనన మరణా ద్యవస్థలును లేనివా డయి, అప్రమేయము లగు జ్ఞాన శక్తి బలైశ్వర్య వీర్య తేజస్సు లను షడ్గుణైశ్వర్య సమన్వితు డయి,

ఎందును అంటక ప్రకాశించువాడయి, అజ్ఞానాది హేయగుణ రహితుడయి, అనంత నామములతో గూడి, అనంతకోటి బ్రహ్మాండములను సృష్టించుచు, వాని నన్నిటివి అనంత కోటి జీవరాశిచే ప్రకాశింపజేయుచు, సజ్జనులను కాపాడుట కొఱకు, దుర్మార్గులను శిక్షించుట కొఱకు, ధర్మమును కాపాడుట కొఱకును ప్రతి యుగమునం దవతరించుచున్నాడు. 'ఎప్పుడెప్పుడు ధర్మమునకు హాని కలిగి, అధర్మమునకు వృద్ధి కలుగుచున్నదో - అప్పు డప్పు డవతరించుచున్నా' నని శ్రీమద్భగవద్గీతయందు చెప్పిన దివ్య సూక్తి ననుసరించి, లోకము నుద్ధరించుటకు శ్రీమద్రామానుజులు అవతరించి, నిజమయిన వేదాంతార్థమును సిద్ధాంతీకరించి బోధించిరి.

## శ్రీరంగనాథాలయధిపత్యము - శ్రీవైష్ణవసంఘ నాయకత్వము

శ్రీరంగమునందలి శ్రీయామునుల శిష్యులు - శ్రీమద్రామానుజులు యతీంద్రులై, మఠమున ప్రవేశించిరని విని, వెంటనే శ్రీరంగనాథస్వామివారి పేరట, కంచిలోని వరదరాజస్వామివారికి, శ్రీరంగనాథాలయమున తమ సేవకై, శ్రీమద్రామానుజులను కంచి నుండి శ్రీ వరదరాజస్వామివారిసేనను వదలి, వెడలి వచ్చుట కనుమతి నీయ వలసినదిగా కోరుచు, వ్రాసి పంపిరి. కాని, శ్రీ వరదరాజస్వామివారు అర్చక స్వాముల ముఖతః ఈ కోరికను మొదట తిరస్కరించిరి. కాని, శ్రీ యామున శిష్యులలో ముఖ్యు డగు తిరువరంగత్తుపెరుమాళ్ అరైయార్ శ్రీవరదరాజస్వామివారిని స్తుతించుచు, ఆళ్వారుల అయిదు పాశురములను చక్కగ పాడి, నాట్య మొనర్చి, 'ఏ వరమైన ఇత్తు'నని వాగ్దాన మొనర్చిరి.

శ్రీరంగమును చేరిన వెంటనే శ్రీమద్రామానుజులు - మహాపూర్ణులను, తదితర యామున శిష్యవర్గమును కలిసికొనిరి. ఆలయము

నుండి ఊరేగింపుగ విష్వక్సేనుల విగ్రహము, శ్రీమద్రామానుజుల నాహ్వానించుట కనునట్లు తీసికొని రాబడినది. ఆహ్వాన పురస్సరముగ ఆలయమునకు వేంచేసిన శ్రీమద్రామానుజులు గర్భ గుడి యందు శ్రీరంగనాథుని సంస్తుతించుచు, పెరియాళ్వారుల 'తిరుప్పల్లాండు' పాశురములను, ఒండు రెండు శ్రీ యామునుల 'స్తోత్ర రత్న' శ్లోకములను మృదు మధురముగ పాడిరి. శ్రీ రంగనాథు లంత శ్రీమద్రామానుజులతో - 'ఉభయ విభూతుల ఐశ్వర్య సంపదను మీ చేతియం దుంచుచున్నాము. సర్వమును పరిశీలించిన పిమ్మట, చక్కగ నిర్వహించవలసినది' అని ఆజ్ఞాపించిరి.

ప్రముఖు లందరు వెంటనే గరుడ మంటమున సమావేశమైరి. శ్రీమద్రామానుజులు వస్తు వాహనములను, ఆలయ పరిచారక బృందమును, వారి విధులను, ఆలయ ప్రాకార మంటప పునర్నిర్మాణ కార్యక్రమములను, పుష్పోద్యాన నిర్వహణమును పరిశీలించి, చక్కగ కొనసాగించు ఏర్పాట్లు గావించి, శిష్యుడగు 'అకళంక నట్టాళ్వాన్' అను బ్రాహ్మణేతరుని ఆలయ నిత్య నైమిత్తిక పూజా పురస్కారాది కార్యక్రమ పర్యవేక్షకునిగ జేసిరి తమ పూర్వాచార్యులగు శ్రీ నాథ ముని, శ్రీ యామునమునులవలె శ్రీమద్రామానుజులు శ్రీ వైష్ణవ సంఘమునకు ఆచార్యులై, శ్రీరంగనాథాలయ 'శ్రీ కార్యము' అను పదవి (ప్రధానాధిపతి) యందును విరాజమానులై యుండిరి. కాని, శ్రీమద్రామానుజులు ఈ రెండు పదవులను వికేంద్రీకరించి యున్నట్లు తోచుచున్నది. తమ దివ్య దేశ యాత్రకు పూర్వము శ్రీమద్రామానుజులు - తమ మేనల్లు డగు 'ముదలి యాణ్డాన్'ను ఆలయ కార్యనిర్వాహకులుగ నియమించిరి. శ్రీమద్రామానుజులు పరమపదించిన తరువాత, ఆణ్డాన్ 'శ్రీ కార్యము' పదవి నధిష్ఠించి, తరువాత తమ మనుమలకు సంక్రమింపజేసిరి. అటుపిమ్మట కందాడై

కుటుంబమువారు సుమారు రెండు వందల సంవత్సరముల పర్యంతము అనగా - 1324 సంవత్సరమున తురుష్కులు రెండవ పర్యాయము శ్రీరంగముపై దాడి జరుపునంతవరకు శ్రీకార్యమును నిర్వహించుచు వచ్చిరి.

శ్రీమద్రామానుజులు శ్రీవైష్ణవ బ్రాహ్మణ కుటుంబమునకు చెందినవారైనందున, వేద వేదాంగములను అధ్యయనము, అధ్యాపన మొనర్చు విధియందు నియమబద్ధులై యున్నను, కొన్ని కొన్ని వైదిక యజ్ఞ యాగాది క్రతు నిర్వాహకులుగ వ్యవహరించు హక్కును గూడ కలిగి యుండిరి. శ్రీవైష్ణవ సంఘమునకు ప్రధానాచార్యులై యున్నందున, వారు ముఖ్యమైన మతాచార్య సంబంధ విధులను సహితము కలిగి యుండిరి. కాని, వారు దేవాలయ ప్రధానార్చకులుగ గాని, అర్చకులుగగాని వ్యవహరించుటలేదు. దేవాలయ పూజా క్రమమునందు అర్చకులు ప్రధాన పాత్ర వహించువారు. వారు ప్రధాన పూజా కార్యక్రమమును నిర్వహించుటే కాక, ప్రత్యేకముగ ఆలయమునందలి ప్రధాన దైవమునకు, దేవేరులకు నిరంతర మొనర్చు సంసేవనయందు నిమగ్నులయి యుందురు. మీదు మిక్కిలి, అర్చకులే దేవాలయ ప్రదాన దైవమునకు నూరుగ మాటాడుచుందురు. ఈ విషయము - 'అర్చక ముఖేన' అను పదము ద్వారా విదితమగుచున్నవి. మిగిలినవా రందరు - నామమాత్రావశిష్టులుగ నుందురు. అయినను, ఈ నామమాత్రావశిష్టులగువారు ప్రధాన మగు సేవా కార్యక్రమములలో ఉపచరించుచుందురు. అందువలన, శ్రీమద్రామానుజులకు, ఆ సందర్భమున శ్రీవైష్ణవ బ్రాహ్మణ పండితులలో శ్రీవైష్ణవ అర్చకులలో, బ్రాహ్మణ - బ్రాహ్మణేతర ప్రధాన వ్యక్తులలో పరస్పర సహకారభావమును పెంపొందింపవలసిన ఆవశ్యకత

యుండెను. శ్రీమద్రామానుజులు ఆలయ ప్రధానార్చకులు కాకపోయినను, కొన్ని కొన్ని సందర్భములలో అర్చక కార్యములను సమీక్షించి, నిర్వహింపజేయుచుండిరి. శ్రీమద్రామానుజులు ఆచార్య పీఠమును అధిరోహించిన పిమ్మట, శ్రీరంగనాథులు ఆయనకు 'ఉడయవరులు' (అధికారి - యజమాని) అను బిరుదమును ప్రసాదించిరి. ఆ విధముగ శ్రీమద్రామానుజులు శ్రీరంగనాథాలయమునకు మాత్రమే యజమానులు కాక, కలియుగ వైకుంఠముగ పరిగణింపబడు శాశ్వతానంద నిలయమునకే పోషకులుగ పరిగణింపబడిరి. శ్రీమద్రామానుజుల అనుచరుల దృష్టిలో - వారి దొరకె మహోన్నత గురు పదవి. వారిని ఆచార్యులుగ స్వీకరించినవారికి వారు నిజముగ, సమ్మాళ్వారుల దివ్య సూక్తిని నెరవేర్చునట్లు, కలియుగమును అంత మొందించుచున్నారు. బయటి కింకను ప్రాత యుగము కొనసాగుచున్నట్లు కనుపట్టినను, వారి మతానుయాయులు - వారు ధార్మికమయిన క్రొత్త యుగమును ప్రారంభించిరని విశ్వసింతురు.

## మతప్రచారము - దేశాటనము

శ్రీమద్రామానుజులు తమ శిష్య వర్గముతో - ఎన్నో ఏండ్ల పర్యంతము భారత దేశమున, కన్యాకుమారినుండి కాశ్మీరమువరకు అన్ని ప్రాంతములందు పర్యటించిరి. దేశములోని వివిధ దివ్యస్థలములను సందర్శించుటకై యాత్ర సలుపుట హైందవ సంప్రదాయమైనను, శ్రీమద్రామానుజుల పర్యటన - మరెన్నెన్నో యుద్దేశముల నెరవేర్చుటకు ఉపకరించినది. భారతదేశమునందు ఆయా ప్రదేశములలో నున్న వేదాంత పండిత శిఖామణులను గలిసికొనుట, వారి వారితో చర్చించి విభిన్న సిద్ధాంతములను దెలిసికొని, వానిలోని లోటుపాటులను ఖండించి చెప్పుట, తాము ప్రవచింపదలచిన - వేదాంత

పరమైన ఆస్తికత్వ సిద్ధాంత ప్రతిపాదనకు తగిన ప్రాచీన స్వరూప స్వభావ విశేషములను సేకరించుట వానిలో కొన్ని. శ్రీమద్రామానుజులు కాశ్మీరమునకు వెళ్ళి, బోధాయనముని వేదాంత సూత్ర వృత్తిని పఠించి, శ్రీభాష్యమును రచించిరి. శ్రీనగరమున సకల గ్రంథ సామగ్రి గల విద్యాస్థానమగు సరస్వతీ పీఠమునకు విచ్చేసి, భాష్యాది గ్రంథ ప్రతుల నిచ్చిరి. గొప్ప వాదము జరిగిన తరువాత అచ్చట పండితు లందరు ఆ గ్రంథములను శిరసా వహించి, తత్పీఠమందుంచిరి. అప్పటి పండితులు అంగీకరించిన గ్రంథములు మాత్రమే శ్రీనగరకోశ భాండాగారమున నుంచుట వాడుక. అచ్చటి సరస్వతీ పీఠమందు శ్రీమద్రామానుజులకు శారదాదేవి ప్రత్యక్షమై, విశిష్టాద్వైత వేదాంతపరమైన కఠిన ప్రశ్నల నన్నిటినో అడిగి, వారిచ్చిన సమాధానములకు మెచ్చి, వారికి 'భాష్య కారులు' అను సార్థకనామ మిడినది.

శ్రీమద్రామానుజులు శ్రీవైష్ణవ దేవాలయములందు ప్రతి దినము నిర్వహించు పూజా పురస్కార పద్ధతులందును గొప్ప మార్పుల ప్రవేశపెట్టిరి. తిరుమల కొండపై శ్రీ వేంకటేశ్వరస్వామివారి కోవెలలో అనేక పర్యాయములు వేదాంత విషయములు ఉపన్యసించిరి. స్వామి సన్నిధి కైంకర్యములను పునరుద్ధరించిరి. మైసూరు ద్వార సముద్రమునకు రాజు – బల్లాలుడు. అతడు జైనుడు. శ్రీమద్రామానుజులు రాజసముద్రమున కేగి, వాదమున జైనులను ఓడించిరి. శ్రీమద్రామానుజులు ఉపదేశించు అంశములు నిజమని రాజుకు విశ్వాసము గలిగినది. శ్రీమద్రామానుజులు అతనికి పంచసంస్కార మొనర్చి, విష్ణువర్ధనుడని నామ మిడిరి. అహోబలము, మహారాష్ట్రము మీదుగ శ్రీమద్రామానుజులు ఉత్తర దేశమునకు వెళ్ళి, అచ్చటచ్చట విశిష్టాద్వైత సంప్రదాయమును ప్రబోధించిరి. గుజరాతులోని గిరినా

రను దత్తాత్రేయ క్షేత్రము, ద్వారక, ప్రయాగ, కాశి, మథుర, హరిద్వారము, బదరికాశ్రమము మున్నగు దివ్య స్థలములను సందర్శించి, శ్రీమద్రామానుజులు తమ తరువాత శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంతము చక్కగ పరివ్యాప్తి నొందుటకుగాను 74 పీఠాధిపతులను నియమించిరి

## శ్రీ రామానుజ రచనలు

శ్రీమద్రామానుజులు తొమ్మిది సంస్కృత గ్రంథములను రచించియున్నారు ఈ గ్రంథములను గూర్చి, గరుడవాహన పండితుడు తన 'దివ్య సూచరితము' ౧౦ దొాక శ్లోకమున పేర్కొనియున్నాడు వేదార్థ సంగ్రహము, వేదాంత దీపము, వేదాంత సారము, శ్రీభాష్యము, భగవద్గీతా భాష్యము, 'శరణాగతి గద్య, శ్రీరంగ గద్య, వైకుంఠ గద్య' అను గద్య త్రయము, నిత్య గ్రంథము - శ్రీమద్రామానుజుల కీర్తిపతాకమై నిలిచియున్నవి

## శ్రీమద్రామానుజులు - పరబ్రహము

శ్రీమద్రామానుజుల రచనలు పెక్కు - మంగళ శ్లోకముతో ప్రారంభ మగును "మంగళాదీని, మంగళ మధ్యాని, మంగళాంతాని శాస్త్రాని ప్రథస్తే" అను అభియుక్తోక్తిని అనుసరించి, ఇది కేవలము శుభకరమగు ప్రారంభమునకే గాక, భగవంతుని యెడల, ఆచార్యుని యెడల, తమకుగల గొప్ప భక్తితాత్పర్యములను, గౌరవమును తెలియ జేయుటకును, విషయమును సూచ్యమానముగ సంగ్రహముగ చెప్పుట కను ఉద్దేశింపబడినది ఇవి - సంక్షేపముగ, శ్రీమద్రామానుజుల పరబ్రహ్మ పరమైన సిద్ధాంత విశేషమును తెలియజేయుచున్నవి పరబ్రహ్మము ఆదిపురుషుడని, శ్రీమన్నారాయణుడని, ఆయన

సమస్త కల్యాణ గుణావహుడని, అజ్ఞానాది హేయగుణ రహితుడని, సమస్త చేతనాచేతనములకు ఆధారభూతుడని, జగ త్సృష్టి స్థితి లయాదులు ఆయన లీలా వినోదమని, నిత్య విభూతియందు తిరు మామణి మంటపమున ఆదిశేషుని పర్యంకముపై శయనించి, శ్రీ భూ నీళాది దేవేరులు, అనంత గరుడ విష్వక్సేనాది నిత్య సూరులు, సనక సనందనాది ఋషివర్యులు సేవించుచుండ, కోటిసూర్య ప్రభా భాస మానుడై, నిరతిశయానందమున తేలియాడుచుండునని శ్రీమద్రా నుజుల రచన లన్నింటిలో వర్ణింపబడినది.

శ్రీభాష్యమున –

'పరబ్రహ్మము' అను పదము పురుషోత్తముని తెలియజేయు చున్నది. ఆయన స్వభావతః దోష రహితుడు. అనవధికాతిశయ కల్యాణ గుణ సహితుడు. అన్ని సందర్భములందును బ్రహ్మ మను పదము బృహత్వ గుణము కలిగియున్న దేనికైననను వర్తించును కాని, దాని ప్రాథమిక విశేషార్థము – 'నిరుపమానమైన దివ్యత్వమును, స్వరూపకత్వమును తదితరమహాగుణములు గలిగియున్న బృహత్త్వము' అని. అట్టివాడే సర్వేశ్వరుడు. అందువలన, బ్రహ్మ మను పదము ప్రాథమికముగ అట్టి భగవంతుని ప్రత్యేకించి చెప్పుటకు మాత్రమే ఉపయోగింపబడినది.

— (శ్రీభాష్యము : 1.1.1 పుట 2.)

వేదాంత దీపమున –

పరమాత్మ జీవాత్మకు పూర్తిగ వేత్తైనవాడు ఎందుచేత ననగా - సమస్త దోష రహితుడై, ప్రత్యేకముగ కల్యాణ గుణములు కలిగి, జీవాత్మల, ప్రకృతియొక్క సర్వావస్థలయందును పరివ్యాప్త

నయియుండి, వాని కాధారభూతుడై, నియంతయై, శేషియై యుండువాడు.

— (వేదాంత దీపము - ప్రవేశిక : పుట.1.)

భగవద్గీతా భాష్యమున –

'పరబ్రహ్మము' అను పరమ పురుషుడు ఈసర్వజగత్తునకు సృష్టి స్థితి లయములను తన క్రీడగ కలిగియున్నట్టివాడు. సమస్త దోష రహితుడైనవాడు. కేవలము మంగళ ప్రదమైన స్వరూపము గలవాడు. తనకు స్వాభావికమైన, నిరుపమానమైన, 'జ్ఞాన బలైశ్వర్య వీర్య తేజ శ్శక్తులు' అను షడ్గుణములే కాక, సమస్త కల్యాణ గుణ ప్రపూర్ణుడై, అనవధికాతిశయముగ తేజరిల్లువాడు.

— (భగవద్గీతా భాష్యము 18 - 73, పుట 131)

ఈ విధముగా శ్రీమద్రామానుజులు కేవలము భగవత్తత్త్వమునే కాక, మరెన్నో వేదాంత విషయములనుగూర్చి చర్చించి యున్నారు పరబ్రహ్మమునకు జీవునకు, పరబ్రహ్మమునకు ప్రకృతికి, పరబ్రహ్మము సమస్త-చరాచర వస్తు వితతికి శరీరియై యుండుట, పరబ్రహ్మముయొక్క- అవతారములు, తనను ప్రార్థించు వారిని పరబ్రహ్మము కరుణించుటాది విశేషము లెన్నో స్పష్టీకరించి యున్నారు.

అంతేకాక, శ్రీమద్రామానుజులు తమ గ్రంథములలో దైవ ప్రార్థనను గూర్చి, భగవంతుడు భక్తునిపై జూపు అంతు లేని దయ, ప్రేమను గూర్చి, భక్తులను తన సన్నిధికి చేర్చుకొనుటకై భగవంతుని కోరికను గూర్చి విశదీకరించి యున్నారు. అట్టి పరిచ్ఛేద మొకటి శ్రీభాష్యమందలి చివరి సూత్రమందు

కాంచనగుచున్నది. ముగింపునకు పూర్వము, వారు జీవుని స్వభావము పురుషోత్తమునిపై ఆధారపడియుండుటను, సంసారమునుండి ముక్తి నొందిన తరువాత జీవు డనుభవించు ఘనమైన గుణముల శాశ్వతత్త్వమును గూర్చిన సందేహమును వివరింపబూనిరి. కాని, ఒకవేళ ముక్తి నొందని జీవుని బ్రహ్మానందస్థితి పూర్తిగ భగవంతునిపై ఆధారపడినచో - సర్వతంత్ర స్వతంత్రుడైనందున, భగవంతుడు ముక్తి నొందిన జీవుని - తిరిగి సంసారబంధమునకు పంపునా ? అను సందేహ నివృత్తి చేయనలసియున్నది. అందుకై వారు —

"శ్రుతుల ననుసరించి తెలియవచ్చినట్లు, పరమ పురుషు డొక డున్నాడు. ఆయన పేరే పరబ్రహ్మము. ఆయన దోషరహితుడై, పరిపూర్ణ మంగళ ప్రదమైన స్వభావము కలవాడు. ఈ జగత్తుయొక్క సృష్టి స్థితి లయములకు కారణభూతమైనవాడు. సర్వజ్ఞుడు. ఆయన సంకల్పము నిరాఘాటముగ నెరవేర్పబడును. తన నాశ్రయించిన వారిని క్షమించి, ప్రేమించగల ఉదారుడు. అంతులేని దయగలవాడు అప్రమేయుడు. ఇంకను ఈ పరమాత్ముడు స్వామిభక్తిగల తన భక్తులచే పూజింపబడి, సంతోషించినప్పుడు, కర్మరూపమయిన అజ్ఞానమునుండి వారిని విడిపించి, సహజ జ్ఞాన రూపమయిన తన శుద్ధ సత్త్వమున అనవధికాతిశయానందమును పొందుటకు అనుమతించును. కాని, వారిని సంసారబంధమునకు త్రిప్పడు."

(శ్రీభాష్యము . 4-4. 21, 22 పుట 396)

అని వివరించియున్నారు. అందువలన, ముక్తి నొందిన జీవుడు తిరిగి సంసార బంధమునకు పంపబడడని తెలియుచున్నది. గీతా భాష్యమునందలి చాల భాగములందును బ్రహ్మము భక్తులు ధ్యానమునకు, ప్రేమకు అధీన మగు ప్రధాన విషయ మని విస్తరించ బడినది.

"హృదయపూర్వకముగ నన్ను పూజించుటచేత, జీవుని అసాధారణమైన కోరిక నన్ను చూచుటకు ప్రేరేపించును. వారి కోఱకు జీవుడు కలిగియుండునట్టి ప్రేమతో కూడిన తీవ్రమైన కోరిక క్షణకాలమైనను అతడు నా నుండి ఎడబాటును సహింపరానట్టిది. .. నా దివ్య రూపము అనంతమైన గుణములకు పెన్నిధి వంటిది. దివ్యమైన, ఆశ్చర్యకరమైన, నిత్యమైన, దోషరహితమైన, గుణములకు పెన్నిధి వంటిది. దివ్యమైన, ఆశ్చర్యకరమైన, నిత్యమైన, దోషరహితమైన, మహాద్భుతమైన ప్రకాశము, సౌందర్యము, పరిమళము, సుకుమారము, మనోహరత్వము, యౌవనము ఇత్యాది విశేషములచే సమ్మిళితమై, ఒప్పిదమై యుండును నా స్వరూప స్వభావము అవాఙ్మానసగోచరమైనట్టిది. నాయందు సాగిలబడువారల బాధలను తొలగించువాడను. నన్నాశ్రయించువారికి అంతులేని క్షమాయుక్తమగు ప్రేమ సముద్రుడను."

— (గీతా భాష్యము : 6-47 పుట 61.)

"తైల ధారవలె అవిచ్ఛిన్నముగ నీ మనస్సును నాపై కేంద్రీకరింపుము. నేను సర్వేశ్వరేశ్వరుడను. నేను సమస్త కల్యాణ గుణములు గలిగియుందును. అపవిత్రమగు ప్రతి విషయమునకును నేను వ్యతిరేకిని. నేను సర్వజ్ఞుడను. నా ఆజ్ఞ ఎల్లపుడు నెఱవేర్పబడును. ఈ సమస్త జగత్తునకు నేనే ప్రధాన కారణము. పరబ్రహ్మమును నేనే. పరమ పురుషుడను నేనే. పుండరీక దళమువలె నా నయనములు పొడవై, శుద్ధమైనవి. నేను అమరత్వ ప్రేమామృత భవ సాగరమును."

— (గీతా భాష్యము : 9 - 34. పుట 86)

"నాపై మానసిక ఏకాగ్రతను పొందుటయందు వెంటనే విజయము సాధింపజాలనిచో - ఉపదేశాత్మకమయిన అభ్యాసము ద్వారా నన్ను పొందుటకు ప్రయత్నింపుము. పరమాద్భుతమైన నన్ను మననము చేయుచుండుటచే యీ అభ్యాసము."

— (గీతా భాష్యము . 11 - 9 పుట 111)

ఈ విధముగా శ్రీమద్రామానుజులు - భగవత్తత్త్వమును చాల విస్తారముగ విశదీకరించియున్నారు 'పరబ్రహ్మము ఎవరు ?' అను ప్రశ్నకు గీతా భాష్య ప్రారంభములోని ఉపోద్ఘాత వ్యాఖ్యానమును పరిశీలించిన, శ్రీమద్రామానుజుల పరమాత్మ సిద్ధాంతము తేటతెల్లము కాగలదు. తదితర గ్రంథములలోని ఏ భాగములందును వివిధ రూపముల నింత వివరముగ చెప్పినట్లు కానరాదు.

మొట్ట మొదట ఈ ఉపోద్ఘాతము రెండు భాగములలో వివరముగ నున్నట్లు గమనింపవచ్చును. మొదటి భాగము - భగవంతుడు మనుష్యులకు, బ్రహ్మాది దేవతలకు ధ్యానార్చన ప్రయత్నముల ద్వారా నైనను సమీపింపరానివాడని చెప్పుటతో అంతమగుచున్నది. రెండవది - పురుషోత్తముడు తనను అర్చించు భక్తుల దృగ్గోచర ప్రాంతములకు వారికి సమాన మగు రూపములో దిగి వచ్చి, తనంతట తానే సమీపింప దగినవాడై యుండునని తెలియజేయబడినది. తరువాత, ఇప్పటివరకు, ఆ యా సందర్భములలో వివరించుచు వచ్చిన పురుషోత్తముని కల్యాణ గుణము లన్నియు రెండు వర్గములుగ విభజించి, మొదటి వర్గమున జ్ఞాన శక్తి బలైశ్వర్య వీర్య తేజస్సులను భగవంతుని షడ్గుణములు కలిగి యున్నవి. రెండవ భాగమున- 'దయ, సౌశీల్యము' చెప్పబడినది. అట్లే - 'సౌహార్దము, అనురాగము' అను సంబంధిత గుణములు ఉదాహరింపబడినవి. సౌందర్య మనునది-

రెండు భాగములందును చెప్పబడినది. ఈ రెండు వర్గములును శ్రీమద్రామానుజులకు తరువాతివారిద్వారా వివరముగ విశదీకరింపబడినవి.

ఏదెట్లున్నను — ఉపోద్ఘాతములోని రెండు భాగములును పరబ్రహ్మమును నిర్దిష్టమగు పదములలో వివరించును. మొదటి భాగము - పరబ్రహ్మ నారాయణుడని, ఎల్లప్పుడు ఆయన శ్రీదేవితో దివ్య దాంపత్యము వహించియుండునని, శ్రీవైకుంఠమున, సర్వోత్కృష్టమైన, నిరుపమానమైన సౌందర్యముతో - అద్భుతమైన దివ్యాభరణములతో నలంకరింపబడి, భావింప శక్యముగాని శక్తియుతమగు ఆయుధములతో, నిరంతరము ఉపచారము చేయుచుండు దేవతలతో సేవింపబడువాడని చెప్పబడినది. ఈ పరమ పురుషుడు జగదుత్పత్తి లయములకు కారణ భూతుడైనవాడని చెప్పబడినది. ఈ వ్యాపారము కేవల ప్రేరణచే, స్వీయ ముఖవైఖరిచే, ఆవశ్యకత లేకయే, నిర్ణిబద్ధమైన ఉద్దేశ్యము లేకయే - ఆయన నిర్వహించుననీ, ఐన, నిరంతరము మార్పుచెందునట్టి ఈ జగత్తు - పరమ పురుషుని స్వరూపమును ఎట్టి పరిస్థితియందును మార్చలేదని పేర్కొనబడినది.

ఉపోద్ఘాతములోని రెండవ భాగము పృథక్కరింపబడిన గుణములతో కాక, భగవంతుని కర్తవ్యములను తెలుపుచున్న విధాయకములతో చక్కగ కూర్చబడి యున్నది. తన స్వభావమును వదిలక, తనను దర్శించి, అలంకరించి, పూజించుటకు వీలుగ, ప్రాణులతో కలిసి యుండు భగవంతుడు తిరిగి తిరిగి అవతరించుచున్నాడు. తనను పూజించి, అర్చించినపుడు - భక్తుల ప్రార్థనలను, ఇహలోక సంబంధమైన శుభములను పరవశింపజేయు ఈ లోకమునుండి ముక్తిని, మరి తన తోటి సంసర్గమును ఆయన ప్రసాదించును. ఆయన శక్తివంత

మైన పరాక్రమ కృత్యము లన్నియు తత్క్షణము ప్రపంచమును దుష్టులనుండి విడిపించుటకై ఉద్దేశింపబడినది. ఆ పరాక్రమ కృత్యముల ప్రత్యేకోద్దేశ్యము మనుష్యుల హృదయములను బంధించి, ప్రబోధాత్మకముగ వారిని శరణాగతికి ప్రోద్బలపరచి, భక్తితో సరిపడుటకు వారిని జాగృత పరచి, వారు మోక్షమును సాధించునట్లు చేయుటయే అని తెలియజేయబడినది. మోక్షమునుగూర్చి పరమాత్మ ప్రబోధము, భక్తియోగమును గూర్చి ఆయన ఉపదేశము, ధర్మమును కాపాడుట - అధర్మమును తొలగించుట మొదలగు విశేషములు చక్కగ వివరింపబడినవి.

## శ్రీమద్రామానుజులు
## భగవత్స్వరూప స్వాభావిక గుణములు

శ్రీమద్రామానుజుల భగవత్పరత్వ సిద్ధాంతమును పరమాత్మ యొక్క అయిదు నిరూపక స్వభావములు పేర్కొనబడినవి. భగవంతుని సౌలభ్యమును తెలియజేయు ఇతర గుణము లన్నియు స్వరూపమునకు విరుద్ధమైనందున, వానిని వేరుపరచనైనది. భగవత్పరత్వము ఇదివరకే తెలియజేయబడియున్నను, సామూహికముగ తీసికొనబడిన ఈ నిరూపక స్వభావములు, జీవాత్మలకు పరత్వములో నున్న భేదమును తెలియజేయుచు స్పష్టముగ వివరింపబడినవి. ఈ అయిదు నిరూపక గుణములు ఉక్త్యానుసారముగ సర్వేశ్వరున కను వర్తించకున్నను, ఇతర తత్త్వములతో సంబంధించినవి. శ్రీమద్రామానుజులు ఏక కాలమున పరబ్రహ్మ స్వరూపమును, మరి ఇతర తత్త్వములతో పరబ్రహ్మ సంబంధమును గూర్చి విచారించిరి.

శ్రీమద్రామానుజులు వేదార్థ సంగ్రహమున మొదట జీవాత్మ స్వరూపమును వివరించుచు, అది ప్రాకృత శరీరములకంటె విలక్షణ

మైనదని ప్రాకృత శరీరములం నుండిన దానిని, జ్ఞానానంద లక్షణముచే చెప్పుచుండునని తెలిపిరి. జీవాత్మకు అంతర్యామియై, పరమాత్మ విల సిల్లుచుండునని, తరువాత పరమాత్మను ఇట్లు నిర్వచించిరి.

"పరమాత్ముడే విశ్వముయొక్క సృష్టి స్థితి లయములకు సంసార మును పాలించుటకు ప్రధాన కారణము. ఇతర తత్త్వములకంటె ఆయన స్వరూపము విలక్షణమైనది. ఎందుచేత ననగా, సమస్త దోష ములకు ఆయన వ్యతిరేకి. అపారమైన మంగళమునకు ఆకరము, అనవధికాతిశయమైన, అసంఖ్యాకము లగు కల్యాణ గుణములు కలిగిన వాడు. ఆయన ఉపనిషత్తులం దంతటను 'సర్వాంతర్యామి' 'పర మాత్మ' అను వివిధ పదములద్వారా తెలియబడువాడు. ఆయనయే భగవానుడైన నారాయణుడు - పురుషోత్తముడు."

—(వేదాంత సారము · 6 పారా.)

ఇట జీవాత్మకు జ్ఞానానందములు స్వరూప గుణములని చెప్ప బడినవి. అవే స్వరూప గుణములు పరమాత్మకు చెప్పబడియుండలేదు. కాని, జీవుల సమస్తమైన మార్పులకు పరమాత్మయే ప్రధాన కారణమని నొక్కి చెప్పబడినది. పురుషోత్తముడుకూడ అద్వితీయమైన స్వభావము గలిగియుండి, ఆత్మ అయియున్నందున, జ్ఞానానందము లను గుణములు కేవలము ఆయనచేత వహింపబడినవని తెలియుచున్నది. పురుషోత్త మునకు, తదితర వస్తువులకు(చేతనాచేతనములకు)గల ప్రధాన విలక్షణత్వము, సృష్ట్యాది వ్యాపార హేతువని పరిగణింపబడినది. కాని, ఈ 'విలక్షణము' అను పదము తరువాత ప్రత్యేకించి చెప్పబడినది. ఆయన అన్ని పదార్థములకంటె విలక్షణమైనవాడని చెప్పుటకు - ఆయన పరిపూర్ణత్వమే కారణము. అంతే కాక, అమంగళము లన్ని టికి విరుద్ధమైనవాడై, సమస్త శుభములకు ఆకరమై, సమృద్ధమ త్తయిన, అతిశయింపరాని అద్భుత స్వరూపములు గలవాడు అని విప్పి

చెప్పబడినది. తరువాత నిర్వచన భాగము భగవన్నారాయణుడను 'పురుషోత్తముడు' అను ఉపనిషత్తులలో తెలియవచ్చు ప్రధానమైన నామావళిని పేర్కొనుచున్నది. ఈ నామములు మూడు ముఖ్యమైన గమనికలను సూచించుచున్నవి. భగవంతుడు చివరి సత్త్వము, ఆయన యే ఆత్మ, ఆయనయే పరము - పరమము - ఉత్తమము ఇక, ఆయన ఈ చివరి ప్రత్యేక లక్షణమే, ఆయన అన్ని తత్త్వములకన్న విలక్షణమైనవాడని సూచించుచున్నది. ఇట 'పరము' అనగా - (ఇతరములకన్న) శ్రేష్ఠతమమైనవాడను అర్థమును వివరించుచున్నది.

"ఎవరినుండి సమస్త ప్రాణు లుద్భవించుచున్నవో, ఉదయించిన సమస్త ప్రాణులు ఎవరి వలన కాపాడబడుచున్నవో, నశించినప్పుడు తిరిగి అవి ఎవరిని చేరుచున్నవో, అది యంతయు నీవు చక్కగ తెలిసికొనదలచితివా - అదియే బ్రహ్మము" అని, తైత్తిరీయ ఉపనిషత్తు (3-1-1)లో వివరింపబడిన విశేషమును ఆధారముగా చేసికొని శ్రీమద్రామానుజులు - 'వేదాంత సారము'న పరబ్రహ్మ స్వరూపమును వివరించిరి. ఛాందోగ్యోపనిషత్తులోని (6-2-1&3) సూత్రములు, శ్వేతాశ్వతర ఉపనిషత్తులోని మూడు భాగములు, భగవద్గీతలోని ఒక శ్లోకము దీనినే విస్తరించుచున్నవి. "బ్రహ్మము జగత్తునకు కారణభూతుడై, జీవాత్మలకు ప్రకృతికి భిన్నమయినవాడై, వానిపై ఆధిపత్యమును వహించియుండువాడు" అనునది వీనిలోని సారాంశము. పరమాత్మ జీవాత్మలకు గల భేదమును శ్రీమద్రామానుజులు ఈ క్రింది విధముగ విస్పష్టపరచియున్నారు

'నేను అస్థిరమయిన పదార్థములకన్నను, స్థిరమయిన జీవాత్మలకన్నను సర్వోత్కృష్టుడనై ఉండుట కారణముగ లోకమునందు, వేదములందు పరమపురుషుడుగా ప్రసిద్ధి కెక్కి యున్నాను.'

— (వేదాంత సారము, 1. 1. 1. పుట. 8)

శ్రీభాష్యమునందు బ్రహ్మముయొక్క నిరూపక స్వభావములు కొన్ని వివరింపబడియున్నవి.

ఈ సూత్రము బ్రహ్మము జగదుత్పత్తి స్థితి లయ కారకుడుగ తెలియజేయుచున్నది. 'సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ' అను సూత్రము బ్రహ్మయొక్క స్వరూపమును ఇతర గుణములనుండి వేరుపరచి చెప్పుచున్నది. ఇట 'సత్యము' అను పదము బ్రహ్మము యొక్క నిరుపాధికత్వమును, మార్పు చెందునట్టి జడపదార్థములకు బ్రహ్మమునకు గల భేదమును, ప్రపంచమున జడ పదార్థములతో సంబంధించియున్న జీవులకును, బ్రహ్మమునకు గల భేదమును విశదీకరించుచున్నది. 'జ్ఞానము' అను పదము - శాశ్వతమైన, సంకోచము నొందని, జ్ఞాన పరిస్థితిని తెలియజేయును. ముక్త జీవుడు సంకోచము నొందునట్టి జ్ఞాన పరిస్థితికి, కొన్ని సమయములందు లోనగుచుండుటచేత, వానికి బ్రహ్మమునకు గల భేదమును విశదీకరించుచున్నది. 'జ్ఞానము' అను పదము శాశ్వతమైన, సంకోచము నందలి జ్ఞాన పరిస్థితిని తెలియజేయును. ముక్త జీవుడు సంకోచము నొందునట్టి జ్ఞాన పరిస్థితికి కొన్ని సమయములందు లోనగుచుండుటచేత, వానికి - బ్రహ్మమునకు గల భేదమును సూచించును. 'అనంతము' అను పదము - బ్రహ్మ స్వరూపముయొక్క అపరిమితిని, అనవధికతను, ఒక ప్రత్యేకమైన వాస్తవమైన స్వభావమును వివరించును. భగవత్స్వరూపము గుణమును కలిగియుండునది. కనుక, ఆయన అనంతత్వము ఆయన స్వరూపమున, మరి ఆయన తదితర గుణములందును స్థాపించబడినది. ఈ అనంతత్వమను గుణము - ముక్తులు, బద్ధులు అను జీవులనుండి, భేదము గల బ్రహ్మముయొక్క 'సత్యము, జ్ఞానము' అను పదములనుండి వారు వేరుచేయబడినట్లే, నిత్య జీవులును వేరుచేయబడినారు. ఎందుచేత

ననగా- వారి స్వరూపము, తదితర గుణములును, బ్రహ్మము యొక్క అతిశయింపరాని దివ్యతత్త్వమునకు సాటిరావు.

— (శ్రీభాష్యము : 1 - 1 - 2 . పుట. 106)

ఈ సందర్భమున శ్రీమద్రామానుజులు బ్రహ్మమునుగూర్చి ఉపనిషత్పరమయిన నిర్వచనమును వ్యాఖ్యానించుచు, మూడు విధములగు జీవులలో మొదటి వర్గమునకు చెందిన జీవులకు రూప మిచ్చుట కారణముగ, ప్రకృతి క్రమముగా ఒకదాని తరువాత ఇంకొకటి బ్రహ్మమునుండి వినాయించబడినది. ఈ పరిస్థితియందు జీవులనుండి బ్రహ్మము యొక్క స్వరూపముగు అనంతత్వమును పొందలేరని విదితమొనర్ప బడినది.

శ్రీమద్రామానుజులు సర్వవ్యాపియైన బ్రహ్మమును జీవాత్మనుండి వేరుపరచి చూపుచు, జీవాత్మను అణువని వివరించిరి. జీవాత్మ యొక్క అణుత్వమునకు, పరమాత్మ యొక్క విభుత్వమునకుగల భేదాను శ్రీమద్రామానుజల తరువాత ఒక ప్రధాన భేదముగ తీసికొనిరి.

'సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ' అను సూత్రమందు వివరింపబడకున్నను, 'ఆనందము' మరియొక స్వరూప గుణము వేరుగ వివరింపబడినది. బ్రహ్మమునకు ఇది అత్యంతావశ్యకమైనట్టిది. ఆనంద మనునది జీవాత్మకును ఆవశ్యకమైన స్వరూప గుణముగ పరిగణింపబడినది. శ్రీమద్రామానుజులు ఆనంద నిర్భరుడు అను అర్థముగల 'ఆనందమయుడు' అను పేరు ప్రత్యేకముగ బ్రహ్మమునకు సంబంధించినదే కాని, జీవాత్మలకు సంబంధించినది కాదని నొక్కి చెప్పిరి. బ్రహ్మము 'నిరతిశయ దశా శిరస్కాభ్యస్యమానుడు, పరిమితానందమును, అపరి

మిత దుఃఖమును పొందు జీవాత్మకు ఈ ఆనందము సాధ్యము కాన ట్టిది, కాన, పరమాత్మకు మాత్రమే నెలవు' అని విప్పి చెప్పబడినది.

ఐదవ స్వరూప గుణము 'అమలత్వము' అనునది. బ్రహ్మమును గూర్చిన శ్రీమద్రామానుజుల ప్రతి వివరణమును, సాధారణముగ 'నిఖిల హేయ ప్రత్యనీకుడు' 'నిరస్త నిఖిల దోష గంధము గలవాడు' అను పదములు గలిగి యుండును. శ్రీమద్రామానుజులు అమలత్వమును ఈ క్రింది విధముగ నిర్వచించియున్నారు.

అమలత్వ మనగా - 'అపహత పాపమత్వమ్' 'అపహత కర్మ త్వమ్.' చెడునకు, కర్మకు లోబడకుండుట. జీవాత్మలు కర్మకు లోబడిన వారు. ఎందుచే ననగా - వారు కర్మానుగుణ్యమైన సుఖ దుఃఖములను అనుభవింతురు. అందువలన, జీవాత్మ కంటెను భిన్నమైన పరమాత్మకు మాత్రమే చెడునకు లోబడక యుండు స్వరూప గుణ ముండును. బ్రహ్మముయొక్క ఈ స్వరూప గుణమును ఆధారముగ జేసికొని ఏర్ప డిన మరి కొన్ని శ్రుతి విహితమైన పేర్లు - 'ఇచ్ఛా ప్రపంచాధిపతి యైనవాడు, అందరికిని అంతర్యామియై యుండువాడు' అనునవి.

— (శ్రీభాష్యము . 1 - 1 - 21. పుట. 188.)

ఈ విధముగ పరమ పురుషుడు 'నిఖిల హేయ ప్రత్యనీకుడై, జీవాత్మ కంటెను సర్వ విధముల విలక్షణమైనవాడై తనరారునని తెలియ జేయబడినది భగవంతుడు నిత్యవిభూతియందు వేంచేసి యున్న ప్పుడును, తన భక్తులను కాపాడుటకై ఎత్తిన అవతార రూపము లందును నిర్మలాకృతిగలవాడు. జీవాత్మలో విరాజమానుడైన పర మాత్మ శరీరమునకు గలుగు సుఖ దుఃఖముల ననుభవించడు. 'అపహత పాపమత్వమ్' అని చెప్పుటచే, జీవుని సుఖ దుఃఖములు అతని కర్మ

ఫలమై యున్నందున, జీవుని ఏ కర్మకును భగవంతుడు లోను కాడ విస్పష్టీకరింపబడినది.

జగత్తునందలి సాధారణ బ్రహ్మ స్వరూపమునుగూర్చియు ఇదియే చివరి నిశ్చితాభిప్రాయముగ వ్యక్తీకరింపబడినది.

"సంకోచ వ్యాకోచముల నొందు ఘటాది వివిధ వస్తువులందు ఆకాశము విడి విడిగా ఆవరించియున్నను, వాని అసంపూర్ణతలందు అది తన యంతట తానే తాకుటలేదు. వివిధ పరిమాణములుగల జలాశయములపై సూర్యుడు ప్రకాశించుచు కనుపట్టుచున్నను, వాని హెచ్చు తగ్గులవలన అతడు తాకబడుటలేదు. అదియే విధముగ వివిధాకారములు గల ప్రాణులందును, భూమి మొదలగు కొన్ని పదార్థములందును, తదితర జ్ఞానులందును, వారి సంకోచ వ్యాకోచాది అసంపూర్ణతలచే స్పృశింపబడక, అన్నిటియందును ఉపస్థితుడయి యున్నను, పరమాత్మ తన అనంత కల్యాణ గుణములను ప్రసాదింప జేయుచు, అసంపూర్ణ మను స్వల్ప గంధముచేనైనను స్పృశింపబడడు. నీటిలో లేనందున, నీటిలో ప్రతిబింబించిన సూర్యుడు నీటిలోని అసంపూర్ణతల చేత మార్పును చెందలేదు. పరమాత్మ వాస్తవముగా భూమియం దుండును కాని, సూర్యుని ప్రతిబింబముతో నొక సాదృశ్య మున్నది. అసంపూర్ణతలచేత మార్పును జెందక, నీటిలో ప్రకాశించిన సూర్యునివలె, పరమాత్మ స్వభావముకూడ ప్రత్యేకముగ అన్ని అసంపూర్ణతలకు వ్యతిరేకమైనట్టిది. అందువలన, ఇతరుల దోషములలో పాలుపంచుకొను నిమిత్తము ఏమాత్రము అయనకు లేకయే, పరమాత్మ భూమియం దుండును."

— (శ్రీభాష్యము . 3 - 2 - 20 పుట. 311)

వేరొక సందర్భమున శ్రీమద్రామానుజులు భగవంతుని నిర్మలత్వమునుగూర్చి, సూక్ష్మమైన నిశ్చితాభిప్రాయము నిట్లు వెలిబుచ్చిరి.

జడ పదార్థము లన్నియు (స్వాభావికముగ) హేయమైనవి కావు. కర్మానుగుణ్యమైనవాని పనుల స్వభావము ననుసరించి, ఒక వస్తువు కేవలము పరమ పురుషుని సంకల్ప ప్రభావమున, ఒక మనుష్యుని కొక సందర్భమున కష్టమును, వే రొక సందర్భమున సుఖమును, ఒక మనుష్యుని కొక సందర్భమున సుఖమును, వే రొక సందర్భమున కష్టమును కలిగించును అందువలన, జీవాత్మ కర్మకు లోనయి యున్నందున, ఆ యా పదార్థములతో, జీవాత్మ సంబంధము పాప పంకిల మగును. కాని, పరమ పురుషుడు తుదకు తాను వశీకృతుడయి యుండుటచేత, సమస్త వస్తువులపై ఆధిపత్యము చెల్లించుచుండుటచే ఈ సంబంధము ఆయన కొక లీలయై, వినోదమును తెలియజేయును."

— (శ్రీభాష్యము 3 - 2 - 12 పు. 308.)

అమలత్వమును గురించి ఈ అవగాహనయే శ్రీమద్రామానుజుల సిద్ధాంతము. ఒకవేళ మనకు దివ్యమైన కను లుండి చూడ గలిగినచో - విశ్వమే భగవంతుని శరీరము, ఆయన సర్వోత్కృష్టమైన సరాజ్యము, ప్రత్యక్ష లీలావిభూతి.

## శ్రీమద్రామానుజులు - భక్తి

వేదార్థ సంగ్రహములోని చివరి మూడు భాగములు భగవంతుడు సర్వోత్కృష్టమైన రూపము గలిగియున్నవాడని, వేదములు అపౌరుషేయములని, భక్తియే భగవంతుని గూర్చిన ఒక ప్రత్యేక జ్ఞానమని, భగవంతునకు చేయు సేవ యని, సేవకత్వ మనియు నిర్ధారించి చెప్పుచున్నవి. శ్రీభాష్యములోని ప్రథమ సూత్రమునందలి లఘు సిద్ధాంతముకూడ భక్తి విశేషము నిట్లు తెలియజేయుచున్నది.

"కర్మ సంచితమున కలిగిన అజ్ఞానమును పోగొట్టుకొనుటకు వేద సూక్తుల పరిజ్ఞానము కాని, సత్యమును బుద్ధివిశేషముచేత తెలియుటవలనగాని సరిపోదు. ఏ జ్ఞానమునకు కర్మను వినాశ మొనర్చి, అజ్ఞానమును తొలగించునట్టి శక్తి కలదో - అదియే జ్ఞానము. అది ధ్యానముతో, భక్తితో అనన్యమైనట్టిది. యజ్ఞములు, దైవభక్తిపరమైన క్రతువు లన్నియు బ్రహ్మముయొక్క భక్తియుతమైన జ్ఞానమును కలిగించుటకే 'జ్ఞానము' అనునది బ్రహ్మమును చేరుకొనుటకు ఆధారము. జీవితమున వివిధ దశలకు విధింపబడిన కర్తవ్యములు, కర్తవ్యముల క్రమార్థమైన విమర్శనము, ఆ కర్తవ్యముల నుండి కావలసిన వాని స్వభావమును కనుగొనుట మరి ఆ కర్తవ్యముల అనిత్యత, పరిమితి మొదలగున వన్నియు పరబ్రహ్మమునుగూర్చిన క్రమబద్ధమైన విమర్శకు పూర్వము అత్యావశ్యకమైనవిగ యేర్పడును."

— (శ్రీభాష్యము 1 . 1 . 1 పుట 1)

శ్రీమద్రామానుజుల దృష్టిలో కర్మ నెక్కువ చేయు మతపరమైన కార్యములద్వారా, కర్మ ప్రభావము నశింపజేయబడజాలదు. ఐనను కర్మను, అజ్ఞానమును నశింపజేయుటకు మార్గము నొడగూర్చు సాంఘిక, మతపరమయిన విధులను, విధులవలె (ప్రయోజనమును అపేక్షింపక) ఆదరించుట ఒక విధమయిన భక్తి అభివృద్ధి చెందుటకు ఆవశ్యకమైన నిబంధన అయినట్లు వారు భావించిరి భక్తిని గూర్చిన శ్రీమద్రామానుజుల ఉద్దేశ్యములు కొన్నిటిని గీతార్థ సంగ్రహమును దృష్టియం దుంచుకొని, 'వాన్ బుటెనెన్' మహాశయుడు ఈ క్రింది విధముగ వివరించినాడు -

"శ్రీ యామున, శ్రీమద్రామానుజు లిరువురును జ్ఞాన కర్మ యోగములు - వాని సంబంధ మేమై యున్నను, కేవలము సమా

యుక్త పరములగు సంగములని, అవి ఆత్మను ధ్యానించుటకు తప్పు, భగవంతుని పొందుటకు తోడ్పడ వని భావించిరి. భగవంతుడు కేవలము భక్తిద్వారా పొందగలడు. అందులకు ముందు తెలిపిన జ్ఞాన, కర్మలను శిక్షణాలు అత్యంతావశ్యకమయిన సాధనములు. ఈ సిద్ధాంతమే గీతా సార మని ఇరువురును సమ్మతించిరి శ్రీమద్రామానుజుల పెక్కు అభిప్రాయములు శ్రీ యామునుల గీతార్థసంగ్రహమునుండి నేరుగ పొందినట్లు తోచుచున్నది ఉదాహరణకు - ఆ క్రియలు, ఆచార సంబంధమైన క్రియలు భగవంతుని పొందుటకు ఉపయుక్త మగును. భక్తులు మూడు విధములు. 1. ఐశ్వర్యార్థులు (2) కైవల్యార్థులు (3) జ్ఞానులు. కాని, చివరివారుమాత్రమే భగవంతుని పొందుదురు

అందువలన, బ్రహ్మముయొక్క ప్రధానమైన స్వభావము జ్ఞానమనియే తెలియుచున్నది. బ్రహ్మముయొక్క స్వభావమునే కాక, స్వరూపమునుగూడ తెలియజేయుచుండుటచేత, 'జ్ఞానైకస్వరూపము' అని తరచుగ వాడబడుట, కాంచనగుచున్నది. బ్రహ్మముయొక్క జ్ఞానైక స్వరూపమును వర్ణించి చెప్పుటకు 'ఆనందము' అనునది మరియొక మార్గము. కనుక, జ్ఞానమువలెనే, జ్ఞానముతో కలిసి ఆనందము కూడ భగవంతుని స్వరూపమని తెలియనగుచున్నది. అందుచేతనే పరమ పురుషుని తరచుగ 'జ్ఞానానందైకస్వరూపుడు' అని వర్ణించి చెప్పుట కనిపించును.

శ్రీమద్రామానుజులు గీతాభాష్యమునందు భక్తిని గూర్చి వెలువరించిన అభిప్రాయములే శ్రీభాష్యమునందును వ్యక్తీకరింపబడినవి. కాని, గీతాభాష్యమున నిరంతర భగవత్ప్రతిపాదకములగు, భక్తిపరమైన, ఎనోభావనమైన, మనోభావపరమయిన ఆకారములను ప్రేమించుటకు వారు ఇష్టపడినట్లు విదిత మగుచున్నదని వాన్ బుటెనెన్ మహాశయుని అభిప్రాయము.

శ్రీవైష్ణవ మతస్థు లగు వారికి నిత్య పారాయణ గ్రంధరాజములుగ శ్రీమద్రామానుజుల గద్యత్రయ గ్రంథములు ప్రధాన స్థానము నలంకరించియున్నవి. శరణాగతి గద్య - భక్తులు భగవంతుని శరణు వేడుటను గూర్చి వివరించును. శ్రీమద్రామానుజులు మొట్ట మొదట పెరియ పిరాట్టి యగు శ్రీదేవికి శరణాగతి చేసి, దయను వేడి, భగవంతుడగు నారాయణుని శరణు పొందుటకు ఆశీర్వదించుమని ప్రార్థింతురు. భగవన్నారాయణుని సంస్తుతించుచు, శ్రీమద్రామానుజులు తమ అసంఖ్యాకము లగు దోషములను మన్నించుటకు, గీతాశాస్త్రమున తెలియజేయబడిన మహా భక్తునిగ జేయుటకు తమలో పరభక్తి, పరజ్ఞానము, పరమ భక్తులు ఉల్లసిల్లునట్లు ప్రసాదించుటకును వేడుదురు. శ్రీరంగ గద్యమున తమను నిత్య కింకరులుగ స్వీకరించి అనుగ్రహించుటకుగాను శ్రీరంగనాథుల పాద పద్మములకడ స్తోత్రము యొక్క చేయుచు ప్రపత్తి చేయుదురు వైకుంఠ గద్యమున శ్రీ మహావిష్ణువుల నిత్యవిభూతి యగు వైకుంఠ వర్ణన మున్నది అందు ప్రతి ఒక్కరును భగవంతుని శరణు వేడిన పిమ్మట, ప్రతి దినమును క్రమముగ ధ్యానించుచుండవలెనని చెప్పబడినది.

వేదార్థసంగ్రహము చివరి భాగమున 'భక్తి' అనగా - ఒక విధమైన ప్రీతి యని, ఈ ప్రీతియే జ్ఞాన మనియు చెప్పబడినది. ఇందు 'ఆనందము'కూడ భాసించుచున్నది,

"జ్ఞానము ఆనందింపజేయు ఉద్దేశ్యము కలది, ఆనందకరమైనది' స్వయముగ ఆనందమైనది, సుఖకర మైనది. బ్రహ్మమునకు గాక, ఇతర ఉద్దేశ్యములకై కూడుకొనియున్న జ్ఞానానందములు పరిమితములు. కాని, బ్రహ్మము కొఱకు ఏర్పడిన ఈ సుఖానంద స్వభావముగల జ్ఞానము అనంతమైనట్టిది, శాశ్వతమైనట్టిది. బ్రహ్మమే 'ఆనందము' అనునది ఈ సూత్రార్థము అని తెలియజేయబడినది.

— (వేదార్థ సంగ్రహము . పాచా . 142)

## శ్రీమద్రామానుజులు
## పరత్వము - సౌలభ్యము

శ్రీమద్రామానుజులు 'సౌలభ్యము' అను పదమును ఉపయోగించి యుండలేదని, కొన్ని సందర్భములలో మాత్రమే 'పరత్వము' అను పదమును ఉపయోగించియున్నట్లు విజ్ఞుల అభిప్రాయము. ఐనను, వారి రచనలను వ్యాఖ్యానించినవారు, ఇతర పదములలో వారు వెలిబుచ్చిన సిద్ధాంతపరమయిన ముఖ్యోద్దేశములను, ఈ రెండు ప్రత్యేక పదముల యందు వ్యక్తీకరించుటలో కృతకృత్యు లయిరి.

'పరత్వము' అను పదము శ్రీభాష్యమున మూడు నాలుగు తడవలు ఉపయోగింపబడినది. ఈ సూత్రములద్వారా శ్రీమద్రామానుజులు ఖండింపదలచిన ముఖ్యాంశము 'పరత్వము' కంటెను 'పరతరము' ఉన్నదను విషయము. అందువలన, వారు దీని అర్థము పురుషోత్తముడు, 'ఇతర వస్తువు లేవియు పురుషోత్తమునకు సాటి రావు' అని వివరించిరి. అదియే విషయమును ఇంకను విస్తరించుచు వారు - 'అందుచేత పరత్వమనునది సర్వజ్ఞుడు, అగోచరుడు, పురుషోత్తముడు, ఆయన నిజముగ పరాత్పరుడు' (శ్రీభాష్యము 3-2-36, పుట 316) అని స్పష్టీకరించిరి. 'పర' 'పరమ' 'పరతర' అను పదములు పెక్కు తడవలు ఉత్కృష్టార్థముననే ఉపయోగించి యున్నను, కొన్ని సందర్భములందు 'ఇతరను కంటెను' అను అర్థమందు దుపయోగించి యున్నారు. మరికొన్ని సందర్భములలో - 'పరతర' 'పరతరత్వం' అను పదము లుపయోగించునప్పుడు శ్రీమద్రామానుజులు పురుషోత్తముని ఒకటిగాని, అనేకములు గాని పరిమాణములు వివరించి యున్నారు. గీతలోని 'మత్తః పరతరంనాస్తి' (7-7) అను శ్లోకమునకు వారి వ్యాఖ్యానము వలన ఈ విషయము మరింత స్పష్టమగుచున్నది.

అన్ని వస్తువులకు కారణమైన ఉభయ విభూతులకును నేను హేతువును. ప్రకృతి వస్తువులకు శేషిణులయి యున్న బుద్ధి గలవారికిని నేనే శేషిని. నేను పరతరుడను. అనిదియే విధముగ సర్వ జ్ఞానమును సృజనాత్మక శక్తియు, అనంతమైన బలమును గుణములను గలిగి యున్నందున, నేను పరతరుడను అంతే కాక, నా కంటెను అట్టి గుణములు కలిగి, విలక్షణమైన, పరితర మేదియు లేదు."

— ( గీతా భాష్యము 7 - 7 పుట. 64 )

వేదార్థ సంగ్రహామునందును శ్రీమద్రామానుజులు 'పరత్వము' అను పదమును అనేక పర్యాయములు ఉపయోగించి బ్రహ్మాదిదేవతలపై పురుషోత్తముని పరత్వమును స్థాపించి యున్నారు. పరబ్రహ్మ మెవరు ? అను ప్రశ్నకు శ్రీమద్రామానుజులు ఈ క్రింది విధముగ సమాధాన మిచ్చియున్నారు.

"బ్రహ్మ పరమ పురుషుడు కాడు. కాని, భగవన్నారాయణుడు విష్ణువు, విశేష శారీరక రూపమున నున్నవాడు" అని చెప్పి, "ఈయనను మించిన పరత్వము ఏదియు, శక్తిమంతమైన సృష్టికి కారణ మగు ప్రధాన పదార్థము లేదు" అని విశదీకరించిరి.

.. (వేదార్థ సంగ్రహము . 97. 101 - 104 )

ఇక సౌలభ్యము అను పదమును గూర్చి విచారించినపుడు, శ్రీమద్రామానుజులు ఈ పదమును ఉపయోగింపకుండుట మిక్కిలి ఆశ్చర్యమును కలిగించును. 'సులభము' అను విశేషణమునుండి, 'సౌలభ్యము' అను జాతినామవాచకరూప మేర్పడినది. 'సులభముగ పొందదగినవాడు' అని దాని అర్థము భక్తుల వ్యక్తిగత సంబంధముల సందర్భమున, ఆ పదమునకు - 'సులభముగ చేరదగినవాడు. సమీపింప దగినవాడు' అని అర్థము. 'సులభము' అను విశేషణ రూపము

నైనను శ్రీమద్రామానుజులు అరుదుగా ఉపయోగించుటే కాక, భగవద్వర్ణన సందర్భమున దాని నుపయోగింప లేదు.

గీతలోని (8-14) శ్లోకమును వ్యాఖ్యానించుచు శ్రీమద్రామానుజులు 'సులభము' అను పదమును ఉపయోగించియున్నారు, ఎవరు ఇతర పదార్థములను గూర్చి ఆలోచింపకనన్ను నిరంతరము జ్ఞప్తియందుంచుకొందురో, అట్టి నిష్ఠగల యోగికి నేను 'సులభుడను.' భగవంతుని చేరుటకు గల నిగూఢ రహస్యమును శ్రీమద్రామానుజులు వ్యాఖ్యానములు వ్యక్తీకరించుచున్నవి. వారు-'సులభము' 'సౌలభ్యము' అను రెండు పదములను వదలి వేయుటకు కారణము - అవి భగవత్స్వభావమును, భగవంతుని పొందుటకు గల మార్గములను దురవగాహ మొనర్చుటకు దారితీయుననియే తప్ప, వేరు కాదు.

## శ్రీమద్రామానుజులు
## శేషి - శేష సంబంధము

శ్రీమద్రామానుజులు వేదాంత శాస్త్రమున శేషి - శేష సంబంధ భావ మనునది ఒక ప్రధానమైన ఉద్దేశ్యము. శ్రీమద్రామానుజులు శేషి - శేష పదములను కొన్ని ప్రత్యేక సందర్భములందువలె తరచుగా ఉపయోగించకున్నను, వానిని తెలిసికొన్నచో దేహాత్మ సంబంధ విషయము అవగతము కాజాలదు.

'శేషము' అను పదమునను 'మిగులు' అని ముఖ్యార్థము. మరియొక వ్యుత్పత్త్యర్థము 'సహాయ' 'సహాయకమైనది' అనునది. కర్మమీమాంసయందు ఈ అర్థముననే, సహకారియైన (ఒక దానితో చేరిన ఉపకరణము) అని అనగా - ఇతరమునకు ఉపయుక్తమైయుండి చేరియుండు భాగము అని. 'శేషి' అనగా - ఇతర మూలవస్తులచే

సహకారిణియై యున్న ఒక ప్రధానమైన మూల వస్తువు - (వేదా సం. పారా. 121. పు 274.) అని వివరింపబడినది. కృష్ణదత్త భరద్వాజ లను పండితులు - 'శేషము' అనగా - ఇతరమునకై ఏర్పడి యున్న వస్తువని, అట్టి వస్తువు కొఱకు కేర్పడియున్నదే 'శేషి' అని వక్కాణించిరి. (Philosophy p. 111) వీరే ఈ రెండు పదములను నిర్వచించుచు - 'శేషము' అనునది ఒక పొందబడిన వస్తువు అనియు – 'శేషి' అనగా, అనుభవించువాడు (భోక్త అయినవాడు) అనియు తెలిపిరి

శ్రీమద్రామానుజులు తమ వేదార్థ సంగ్రహమున ఈ రెండు పదముల విశిష్టార్థమును ప్రతిపాదించునపుడు, ఏది ప్రధానవిషయమో ఏది అప్రధాన విషయమో వివరించిరి.

"శేష - శేషి సంబంధ మనునది ఏ స్థితియందైనను ఈ అర్థము నిచ్చును. భగవంతునకు ప్రశస్తమైన కైంకర్య మొనర్చుటయందే సమస్త పదార్థముల కేవల స్వరూప ప్రాధాన్యత విలసిల్లుచుండును. తమ ఉనికియందు సమస్త పదార్థములు భగవంతునకు శేషభూతమై యున్నవి. అందువలన, ఆయనయే సమస్త పదార్థములకు యజమాని, శేషియైనవాడు సూత్రములందు ప్రకటించబడినట్లు, ఆయనయే సమస్తమునకు వశియైనవాడు ప్రభువు, ఈజగత్తునకు పతియైనవాడు."

— (వేదార్థ సంగ్రహము . ప్రారా . 121. 122 పుట 274)

శ్రీమద్రామానుజుడు ఈ సందర్భమున, స్వామి (యజమాని) సేవక (భృత్య) సాదృశ్యమును చెప్పుటయే కాక, దానిని భగవంతునకు, జగత్తునకు అన్వయించి చెప్పిరి. భగవంతుడు సమస్తమునకు యజమాని, పతియును. సమస్త జీవరాశి అంతయును ఆయనకు

భృత్యులు. యజమానితో పోల్చి చెప్పబడిన ప్రధాన పురుషుడు కేవలము తన భృత్యుల క్రియవలన మాత్రమే ప్రయోజనము పొందువాడు కాక, తన భృత్యుల ప్రయోజనము కొఱకును పాటుబడు నను విషయము శ్రీభాష్యమున విశదీకరింపబడినది. వేదార్థ సంగ్రహమున శేషియైన పరమాత్మకు, శేషుని చేత కైంకర్య మొనర్ప (సంసేవింప) బడుచుండునని పరమాత్మ ప్రయోజనమునకే శేషు డుండునని వివరింపబడగ, శ్రీభాష్యమున శేషి అయిన పరమాత్ముడును శేషునికి ప్రయోజనము కలిగించునని చెప్పబడినది.

శ్రీరామానుజుల అనుయాయుల దృష్టిలో - ఈ రెండవ అభిప్రాయము గొప్ప ప్రాధాన్యతను వహించినది. పరమ పురుషుడగు శేషియొక్క కర్తవ్యము శేషుని కాపాడుటయే అను అంశముపై ప్రపన్నునకు మోక్షమునందు గల విశ్వాసము ఆధారపడి యున్నది. శ్రీ వేదాంత దేశికులు 'రహస్య త్రయ సారము' అను గ్రంథమున ఇదియే విషయమును గూర్చి చర్చించుచు, 'ఈశ్వరుడు తనకు దాసభూతు లగువారి నందరిని రక్షించుటకు శక్తి కలిగినవాడు, రక్షించును గూడ. కాని, చేతనునకు తనను తాను రక్షించుకొను శక్తి లేదు, నియంత, వశ్యమైనవాడు. నిరుపాధిక శేషుల ఉనికికి కారణభూతుడై, వారి ఉనికి నిరుపాధికముగ తన ఆధిపత్యమునకు లోనై యుండుట చేత వాస్తవముగా తనకు జెందిన బలహీనులగు వారిని కాపాడుట - బలవంతుడగు యజమానిగ ఆయన బాధ్యత. అయినను, ఈశ్వరుడు తన రక్షణను పొందుటకై జీవుడు ఏదియో యొక ఉపాయమును అనుసరించిన తరువాతనే అతనిని రక్షించుటకు నిశ్చయించును' అని వివరించియున్నారు. శ్రీవైష్ణవ సంప్రదాయమును అనుసరించి భగవంతుడు తనపై ఆధారపడినవారి నందరిని రక్షించుటకు నిర్బంధ

మేర్పడకున్నను, స్వభావతః తనకు ప్రపత్తి చేసినవారి నందరిని తప్పక ఆయన కాపాడగలడనియు, తరువాత క్రమముగా తనకు తప్పక శేష భూతులయిన ప్రాణు లందరిని కాపాడగలడనియు సంభావింపబడినది.

తమ రచన లన్నింటియందును శ్రీమద్రామానుజులు శేష - శేషి సంబంధమును వివరించియున్నను, వేదార్థ సంగ్రహమున ఈ విషయమును విస్తరించినంత విశేషముగ మరే గ్రంథమునందును వివరించి యుండలేదు.

## శ్రీమద్రామానుజులు - ప్రపత్తి, భక్తి

శ్రీమద్రామానుజుల గద్యత్రయ గ్రంథము ప్రపత్తి సిద్ధాంతమును విపులీకరించుచున్నదని విజ్ఞులు సంభావించిరి. జీవుడు మోక్షము నకై జ్ఞాన, భక్తి, ఉపాయములను అనుసరింపబడకున్నను, కేవలము తనను తాను భగవదర్పిత మొనరించుకొని 'ప్రపత్తి' చేసి యున్నచో కాపాడబడునని తెలియజేయబడినది

శ్రీమద్రామానుజులు వ్యాఖ్యానించి చెప్పిన ప్రపత్తి ముఖ్య సూత్రము భగవద్గీత చరమశ్లోకముపై (18 - 66) ఆధారపడి యున్నది. వారు చరమ శ్లోక వ్యాఖ్యానము ద్వారా ప్రపత్తిని చక్కగ వివరించిరి. 'సర్వ ధర్మాన్' అను పదమును వ్యాఖ్యానించుచు ఇంతకుమున్ను బోధింపబడిన కర్మ, జ్ఞాన, భక్తి యోగములందలి 'ఫలమును' అని చెప్పబడినది. అనగా - ఆ యా ధర్మములను వదలివేయరాదనియు, భగవత్ప్రీతికై వానిని ఆచరించుచునే ఉండవలె ననియు, వదలివేయవలసినవి కేవలము కర్మలవలనగలుగు ఫలములనియు తెలియజేయబడినది. భగవంతుడే 'ఉపాయము - ఉపేయము' అని విశ్వసించి, శరణువేడుట ప్రశస్తమని చెప్పుచు, ఆవిధముగ భగవంతుని శరణువేడి

పూజించు భక్తులకు - ఆయన, తనను చేరకుండ నిరోధించువారి పాప ములనుండి వారిని విడిపించి, మోక్షమును ప్రసాదించునని వివరించిరి.

'సర్వ ధర్మాన్' అను పదమునే వేరొక చోట, మరియొక విధముగ వ్యాఖ్యానించుచు శ్రీమద్రామానుజులు – 'పాపములను పోగొట్టునట్టి ప్రాయశ్చిత్తార్థమైన క్రియలు' అని, ఆ పాపములను పోగొట్టుటకు రూపొందింపబడిన క్రియలును అసంఖ్యాకములనియు, వానిని నెరవేర్చుట కష్టమనియు, జీవితము స్వల్పకాలికమైనందున, అట్టి ప్రాయశ్చిత్తార్థమైన క్రియలను అభ్యాస మొనర్పవలదనియు, అందుకు బదులు భగవంతుని ఆశ్రయింపుమని శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు ఉపదేశించెను. భక్తియోగము ననుసరింపకుండ అడ్డగించు పాపములను సహితము తొలగించెదనని భగవానుడు సెలవిచ్చెను.

శ్రీ యామునుల గీతార్థ సంగ్రహము 18 అధ్యాయములో 22 - శ్లోక తాత్పర్యమునే శ్రీమద్రామానుజులు తమ మొదటి వ్యాఖ్యానమున అనుసరించునట్లు విజ్ఞులు భావించిరి. ఇందు చివరి ప్రసంగము జ్ఞాన ధర్మమైన ఈశ్వర కర్తృత్వతాబుద్ధిని వివరించుచున్నది. గీతాభాష్యమునందంతటను శ్రీమద్రామానుజులు ఈ విషయమునే నొక్కి వక్కాణించియున్నారు. కాని, వారు మోక్షమును పొందుటకు కర్మసంబంధమైన మానవ ధర్మము లన్నిటి అనువర్తనమును గూర్చి వివరించిరి.

'ఈ విధమైన ఆరాధన లన్నియు కొనసాగించవలసినదే కాని, మోక్షమును పొందుటకు ఇవి యన్నియు అప్రధానమైన ఉపాయములు. ఎందుచేనన, భగవంతు డొక్కడే ఉపాయము, ఉపేయము. ఆయనయే ఆరాధింపజేయువాడు , ఆరాధింపబడువాడు. ప్రపత్తి అనునది భక్తికి మరుగ చెప్పబడినది కాదు. కర్మ జ్ఞాన భక్తులకు ప్రాధాన్య

మీాయక, భగవంతుని కర్తవ్యమునందే సంతృప్తిని గలిగియుండి, భక్తుడు తన అయోగ్యతను చాటుచు, నిరంతరము భక్తిని ప్రకటీకరించుటయే 'పపత్తి' అని, జాన్ బ్రెయిన్టెన్ కార్మేన్ మహాశయుని అభిప్రాయము. ప్రపత్తి ఒక భక్తికార్య మనియు, తద్వారా ముక్తిని తప్పక పొందవచ్చుననియు శ్రీమద్రామానుజుల తరువాత వ్యాప్తిలోనికి వచ్చినది. తరువాత తరువాత, ప్రపత్తికి వేరు వేరు నిర్వచనము లిచ్చి, వేరు వేరు విధములుగ ఆచరింపవచ్చుననియు చెప్పబడినది. ఐనను, శ్రీమద్రామానుజుల ప్రపత్తి సిద్ధాంతము తరువాత కాలమున విస్తృతమైన అవగాహనకు ఆధారమైనది. శ్రీమద్రామానుజులు మౌలికముగా భగవద్గీతను విశదీకరించుటయందును, నిగూఢపరచుటయందును శ్రీ యామునాచార్యుల ననుసరించి, మానవుని మతపరమైన ప్రయత్నము లన్నియు మోక్షమును పొందుటకు సాధనములని, సంబంధము కల్పించి చెప్పిరి. అందువలన, భగవంతుడే మనుష్యునికి ముక్తిని ప్రసాదించునని నమ్మి, నిరంతరము సంతోషాంతరంగుడై, నామస్మరణ మొనర్చుచు, వినయ విధేయతలతో సేవా పరాయణత గలిగి, ఉపకరించువాడే ప్రపన్నుడని తెలియుచున్నది.

ఈ సందర్భమున, శ్రీమద్రామానుజులు భగవద్గీతలోని 18-వ అధ్యాయమందలి 68 - వ శ్లోకమునకు చేసిన వ్యాఖ్యానము సహితము గమనింపవలసి యున్నది. శ్రీకృష్ణభగవానులు అర్జునునితో చివరి మాటగ భక్తి యోగమును గూర్చి ఉపదేశించుచు, భగవంతునకు మిక్కిలి ప్రీతిపాత్రమైన జ్ఞానము, ఆరాధన, చింతనములతో గూడిన ధ్యానమునే సాధకుడు నిరంతరము అనుష్ఠించుచుండవలయునని విశదీకరించిరి. కేవలము ఆచార కర్మల ద్వారా భావరహితమై కాక, భగవంతుని పరమ ప్రీతితో పూజించి ధ్యానించుచుండవలయుననియు, అది ఒక దాసుడు తన యజమానికి ఎడతెగక సేవ చేయుచు, సంతోషపరచునట్లు, శేషత్వ పరతంత్రుడై, భగవత్ప్రీతికై పాటుబడ

వలయుననియు చెప్పబడినది, (గీతా భా. 18-65. పు 169) ఇట్లు భక్తి ప్రపత్తి యుతమైన జీవిత విధాయకము బహుధా వివేచించి చెప్పబడినది. ఇది కేవలము శ్రీమద్రామానుజుల రచనలోని విశేష మని కాక, భగవంతునికి ప్రీతి గలిగించి ప్రయోజనము నొనగూర్చు ననియు గాక, జీవుడు తన స్వరూప విశేషమని, తప్పక ఆచరింప వలసినదనియు, ఆనందదాయకమైనట్టి దనియు, దృఢముగవిశ్వసించి, కర్తవ్యోన్ముఖుడు కావలయును.

శ్రీమద్రామానుజులు స్థాయించిన సంప్రదాయ విశేషములు కొన్ని మాత్రమే ఇందు సంక్షిప్తముగ చర్చింపబడినవి. వారు ప్రవచించి చెప్పిన విశిష్టాద్వైత సిద్ధాంత రహస్య విశేషములు నిరుపమానములు, లోక ప్రసిద్ధములు, లోక కల్యాణ కరములు. జీవకోటిని అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడగు శ్రీమన్నారాయ ణుని పాదపద్మముల చెంతకు చేర్చి, తరింపజేయుటయందు అవి సర్వవిధముల సమర్థములై తేజరిల్లుచున్నవి.

"రామానుజార్య దివ్యాజ్ఞా, వర్ధతా మభివర్ధతామ్."



# శ్రీ యతిరాజ వైజయన్తి

'ఉభయ వేదాంత శిరోమణి'

శ్రీమాన్ తిరుమల నరసింహాచార్యులు, ఎం. ఏ. యల్. టి.



శ్రీకరము శుభంకరమును
ప్రాకటముగఁ బుణ్యకరము భవవిరతికర
మ్మేకడ శ్రేయస్కర మయి
సాకును 'యతిరాట్' పదాను సంధాన మిలన్.

యతుల - చరితాలి చతురాల్
యతిరాజుని చరిత మెందు నతి చరితమ్మై
మతిమంతులకే దక్కుఁగ
నితరుల కలవియె నుతింప నెటుఁ దలపడినన్.

మతములలో రామానుజ
మత మనుపమ సాత్త్వికమ్మ మంజుల మెన్నన్
మత సామరస్య మహిత
మ్మతుల నయ విశేష విహిత మానందముగాన్.

రామానుజ దివ్యాజ్ఞను
నేమమ్ముగ నెఱపు భక్తి నిరతుల కెల్లన్
సేమ మ్మిహ పరముల నభి
రామమ్ముగ నొనరు టబ్బురమ్మన నగునే!

ద్రష్టయై కవితా విశిష్టుండు నగువాఁడు
    రామానుజార్యాఖ్యుఁడో మనీషి
జ్ఞానియై వేద విశారదుఁ డగువాడు
    రామానుజార్యాఖ్యుఁడో మనీషి
యోగియై వైశిష్ట్య యుక్తి రాజిలువాఁడు
    రామానుజార్యాఖ్యుఁడో మనీషి
వెజ్జునై వేదవిశారదుఁ డగువాఁడు
    రామానుజార్యాఖ్యుఁడో మనీషి

బోధయును - ధార్మికుఁడు నయి పొసఁగువాఁడు
వాక్ప్రవీణుఁడు - సుమతి ప్రవర్తకుండు
నరయ నాచార్య శబ్దార్థుఁ డైనవాఁడు
సరస రామానుజార్య సంజ్ఞక మనీషి.

**రామానుజార్య** సన్నామాంకితుడు మించు
    ధరణి 'నలో' యను స్ఫురణ దలఁగి
యతిరాజ లాంఛనాంచితమూర్తి రహించు
    సర్వతారక రహస్యము వెలార్చి
గురుఁడు 'నుడైయవర్' వరనామముఁ డలరారు
    నుభయ విభూతిఁ దా నొనర నేర్చి
మన్నాథుఁ 'డెంబెరుమానారు' పేర్మిఁబు
    నేరికి నేలికై యొసఁగ మొసఁగి

సకల జనగణ తారణ సాధనమ్ము
హితము - మహితము మధురమౌ మతము నెఱపి
అందుబాటుగ బత్తి బాటందజేను
దిద్దు నా భాష్యకారు నే ప్రొద్దు గొలుతు.

**దివ్యాజ్ఞా** దానదక్షాయ
భవ్య మోక్షార్థ హేతవే
కరుణార్ద్రాన్త రఙ్గాయ
గురూణాం గురవే నమః.

'**వర్ధతాం** సర్వమానవ వర్గ, యనుచు
నర్థి మెయి 'జియ్య' రెంతియు నహము వీడి
బద్ధ కరుఁడయు గురునకు బత్తి కిటుకు
బద్ధ కంకణుఁడయి చాటెఁ బ్రజల కెల్ల.

**అభివర్ధతాం** యతిపతే
రుభయ తరణ కరణ లౌకికోపక్షేయమ్
శుభకర 'శరణాగతి' స
న్నిభ సులభా నాస్తి మాన్యనీతి రివన్యామ్,

భజే కాన్తిమత్యాత్మజం మౌనిరాజం
భజేఽహం విపశ్చిద్వరేణ్యం శరణ్యమ్
భజేఽపాస్త మాయా వితర్క ప్రకారం
భజేఽహం భజేఽహం సదా భాష్యకారమ్.



# శ్రీమద్రామానుజులు - విశిష్టాద్వైతము

'విశిష్టాద్వైత వేదాంత శిరోమణి'

శ్రీమాన్ కె. లక్ష్మీ నరసింహాచార్యులు, ఎం. ఏ.



'య త్పాదపద్మద్వయ మాశ్రితానాం, సంసారసింధో స్తరణాయపోతః
రామానుజం తం రమణీయమూర్తిం, సేవే సదా సంయమి భాష్యకారమ్,''

## అవతారిక

*(General Introduction)*

మానవ మానసికాబ్జ వికాసమునకును, విజ్ఞాన వ్యాప్తికిని, శిల్ప శాస్త్రాభివృద్ధికిని కావలసిన ప్రధానాంశములు రెండు. ఒకటి - సంఘ స్థైర్యము, రెండవది - నిష్కంటక జీవనము. నిరంతర భ్రమణ శీలురును, బాహ్యాంతః కలహ ప్రకంపిత చిత్తులు నగు జనులకు మహోన్నతాశయము లలవడుట దుర్ఘటము. ప్రకృతి తన యమూల్య రత్నములను వర్షించి, భరత ఖండమును రత్న గర్భగా నొనరించినది. ఉదగ్భాగమున పూర్వాపర సముద్ర వేలావనముల నంటి, అభ్రంకష శృంగ సంఘాత సముద్భాషిత మగు శైలాధిరాజమును, తక్కిన దిక్కుల నపార పారావార పరిఖయు ఆర్య వసుంధరకు పెట్టని కోటలు. వీని నడుమన కృష్ణ పచ్యము లగు క్షేత్రములు, స్వచ్ఛ స్వాదు సలిల ప్రపూర్ణము లగు మహా నదులు, పరిపక్వ ఫల భార వినమ్రము లగు వృక్షములును భారతీయుల కయాచి తాన్నపానములను ప్రసాదించినవి. కావున, వీ రుదర పోషణాయాస కర్శితులు కాలేదు. ప్రపంచ

మొక విశాల రణరంగ మనియు, ధనార్జనమే పరమావధి యనియు, పర ప్రాణహరణమే పరవిద్య యనియు వీ రెన్నడును భావించియుండ లేదు. భగవత్ప్రసాదితము లగు కాయిక మానసిక శక్తుల నిట్టి తుచ్ఛ విషయములలో వినియోగింపని మనుజుఁడు - ఆధ్యాత్మిక చింతా తత్పరుఁ డగుట సహజము. ఘర్మాంశు కిరణ క్లాంత మగు ఆర్యుని శరీరము తపోవన తరుచ్ఛాయల విశ్రమింపఁ గోరుట వింత కాదు. నిరంతర నీల నీరదాచ్ఛాదితము లగు పర్వతములు, గంభీరారణ్యములు, ప్రోచ్చండ సత్త్వ స్వన ప్రతిధ్వానితము లగు గిరి కందరములును ఆర్ష హృదయమున భగవ న్మహిమాభివర్ణనము లగు వైదిక మంత్రముల నుద్బోధించినవి. ఆర్ష కాలమునుండి ఆధునిక సమయము వఱకును భారతీయుని చిత్తము తీర్థయాత్రా రసికము. ఆర్యావర్తము నందలి రమణీయ దృశ్యము లన్నియు వారికి తీర్థములే. ఆసేతు శీతాచల గతములగు ఈ ప్రకృతి విలాసము లను దర్శించి, వారు చిత్త శాంతిని సంపాదించుకొనుచుండిరి. వైరాగ్య సంపన్నులగు పురుషులకు ఈ పవిత్ర స్థలములే తత్త్వ పరిశీలనాగారములు ఐహిక ఆముష్మిక జీవితార్థ బోధకము లగు సూత్రము లిందే అవతరించి. భాష్యము లందు విస్తరింపఁబడినవి. నిరుపద్రవమును, నిరాడంబరము నగు జీవనమును, ప్రకృతి సౌభాగ్యమును పొంది, ఆహార సమృద్ధియు, చిత్త శాంతియు వీరికి ఉదాత్త భావోద్బోధమునకు కారణము లయ్యెను. ఇవి హేతువులుగా భారతీయ విజ్ఞాన వృక్షము ఆధ్యాత్మిక ఫలముగా పరిణమించి, సంసార మరుస్థలార్తులకు ఆప్యాయనకర మయ్యెను.

ఇట్టి నైసర్గిక సౌభాగ్య సంపన్న మగు దేశమును ఆలవాలముగాఁ బడసిన భారతీయులు కేవలము ఔదరికులై, భోగపరాయణు లగుట సహజము. కాని, భగవ దనుగ్రహమున వారికి తత్త్వ వివేచనాక్షమ మగు కుశాగ్రబుద్ధి - జన్మసిద్ధ మగుటచే, హేతువాదమునం దత్యంత నైపుణ్యమును వహించి, తత్త్వ పరిశీలనమునకు గడంగిరి.

గ్రీకు తాత్త్వికుఁడగు 'ప్లేటో' - తన వారి కుపదేశించిన యమూల్యమగు సందేశ మిట్టిదిరా్ఁగదా! 'ఎట్టి విపత్తు సంభవించినను శిరసావహింతుము. కాని, హేతువాద నిరాసకులము మాత్రము గాకుందుముగాక!' యని ఆ మహనీయుఁ డాత్మీయులను హెచ్చరించెను. ఈ దారిద్ర్యము భారతీయులకు లేదు.

ఖండాంతరములయందలి జనులు తమ శక్తి సామర్థ్యములను లౌకిక కార్యములందే విశేషముగా వ్యయపఱచుచు, విశ్రాంతి సమయములందు మాత్రమే తత్త్వ విచారమునకు కడంగుచుండిరి. ప్రాచీన భారతమున తత్త్వ విచారము శాస్త్రాంతర పరిజ్ఞానమున కుపకరణముగా భావింపఁబడక, పృథగాత్మకముగానే ఉండెను. ఇది మధ్య యుగమున మఱొక స్వరూపమును దాల్చినది. బేకన్, న్యూటన్ (Becon, Newton) అను తాత్త్వికుల దృష్టిని ఇదియే ప్రకృతితత్త్వ పరిశీలనముగా మార్చినది. 19 - వ శతాబ్దము నందలి తాత్త్వికులు దీనికి రాజనీతితోఁడను, ఐతిహాసిక - సాంఘిక శాస్త్రములతోఁడను ఐక్యము కల్పించిరి. భరత ఖండమున నిదియే ప్రాధాన్యమును వహించి, సకల శాస్త్రోపకార మయ్యెను. దీని సహాయము లేకయున్న, విజ్ఞానము శూన్యముగా భావింపఁబడినది. ముండకోపనిషత్తునం దిదియే సర్వవిద్యా ప్రతిష్ఠాపకముగా నిర్వచింపబడినది. కౌటిల్యుఁడు దీనిని తత్త్వాలోకన దీపికగా వచించెను. పరిదృశ్యమాన మగు చరాచరాత్మక జగత్తత్త్వము నూహించు మానవుని మానసిక వ్యాపారమే వేదాంత విచారము. కావున నిది, ఆ యా వ్యక్తులకు సంబంధించిన జాతి మత విజ్ఞానములతో చెలిమి కలిగి వర్తించుచుండెను. ప్రతి జాతియు తనకు నైజమగు శీలమును, బుద్ధి వైభవమును గలిగి, తన ప్రత్యేకతను గోల్పోవక యుండుట లోక సిద్ధము. అనేక సహస్రవర్ష పురాణ మగు భారత జాతి, పురాణమయ్యును - నవమే యగుటయు - కాల వశమున బహు విధ సమ విషమ దశా పరిణామముల

నందియు, తన స్వత్వమును విడనాడక యుండుటయు సర్వజనవిదితము. భారతీయులు తమ ప్రత్యేకతను నిర్వహించుకొనఁగల్గినంత కాలమును - ఆర్ష సంప్రదాయ సిద్ధములగు మానసిక శాస్త్ర ప్రవృత్తులను స్వాధీనముగాఁ గల్గియే యుందురు. పార్థక్య మనఁగా - ప్రత్యేకాభివృద్ధిగాని, విభేదక ధర్మము కానేరదు. ఆత్మ తత్త్వ పరిశీలనమునకు గడంగినపుడు, మానవజాతియందుగల పరస్పర వ్యక్తులకు మానవత్వము సామాన్యమే కనుక, పరిపూర్ణ విభేదక ధర్మము మృగ్యము. విభేదక ధర్మములు వయః పరిణామము ననుసరించియు, సాంఘిక జీవనమునకు సంబంధించియు. మానసిక వృత్తుల నవలంబించియు కొంతవఱ కేర్పడగలవు.

ప్రాచీనమైన ఆర్య విజ్ఞాన వైభవము అనితర సాధారణమైనది. గ్రీకు తాత్త్వికుల సమయములలో నిది యూతగా గొన్న దనుట పాశ్చాత్యుల యపోహ. ఉభయ సిద్ధాంతములయం దుండు స్వల్ప సాదృశ్యములు ఆ యూహను నిరూపింపఁజాలవు. మానవత్వ మెపుడు సామాన్యమో, అప్పుడే తుల్య పరిస్థితులు సామ్యానుభూతినిఁ గల్గింపఁగలవు. అలకాసాంద్రుని దండయాత్రకును, ఉత్తరమున భారత విజ్ఞానము పశ్చిమ ఖండమునకు వ్యాపించిన దనుటయే సమంజసము.

ఆర్యులు అనాది కాలమున ఏక జాతిగా, ఏక దేశమున నుండిరని ఐతిహాసిక సిద్ధాంతము లుండునుగాక. అతిదూరమగు కాల సముద్ర గర్భమున లీనమైయున్న సత్య రత్నములను ఈనాఁడు అనుమాన జాలముల నుద్ధరించుట - అంత సాధ్యమైన పని కాదు. తత్ప్రయత్నమున ఐతిహాసికుల యుద్యమము కించి త్ఫలదాయకమే యైనను, అనేక యూహాపోహలకు తావల మగుటవలన, ఇదమిత్థమని నిరయింపజాలదు. ఒకవేళ వా రేకజాతిగా ఆసియా ఖండమధ్యమున నుండి రని విశ్వసించినను, వా రటనుండి ఆర్యావర్తమునకు

వచ్చిన తరువాత, స్వజన సంఘర్షణమును విడనాడుకొని, ప్రత్యేకముగా స్వీయ విజ్ఞానమును విస్తరింపఁజేసి రనుట నిర్వివాదాంశము. వాయువ్య దిశనుండి అనేక సమయములందు ఆర్యావర్తములోనికి ప్రవహించిన మహత్తర తురుష్క వాహినులు సుస్థిరమగు ఆర్య విజ్ఞాన సౌధమును విచ్ఛిన్నము చేయఁజాలకుండెను. నాగరకులగు గ్రీకులు దిగ్విజేతయగు అలక్సాండరుని యాజమాన్యమున భారతమున కవతరించినది మొదలు, ఖండద్వయమునకును పరస్పర సంబంధ మేర్పడుట వలన, భారతీయ విజ్ఞానమునే గ్రీకులును, అరబులును పశ్చిమమునకు వ్యాపింపఁజేసి రనుట విశ్వాసార్హము. కావుననే, భారతీయ విజ్ఞాన వైభవము తదనుచ్ఛిష్టతా మూలక మని ఇంతకు మున్నే నుడివియుంటిమి.

ఆర్యావర్తమున వేదాంత విచారము ఆత్మానాత్మ వివేకరూపమైనది. దైవ దుర్విపాకమున భారతమునకు సంభవించిన ఐతిహాసిక కాలిక విప్లవముల నుత్తరించి, యుద్గ్రీవమై నిలిచిన ఆర్యవిజ్ఞాన సౌధము ఈ యవినశ్వర మగు ఆత్మ తత్త్వముపై నిర్మింపఁబడినది. పాశ్చాత్య వాహినులు వెల్లి విరిసి, వీనిని ముంపఁదలచినవి. కాని, అవి యన్నియు ఈ పర్వత తుల్య ప్రాసాద పాదమున విశీర్ణము లయినవి. అనంత స్థిర ప్రశస్త రూప మగు జగత్తత్త్వమున కాధారమైయున్న మూల శక్తిని ఆంతర దృష్టితో జూచి, సమన్వయించుటయే జీవిత పరమావధి యనియు, నిరతిశయ సుఖ హేతు వనియు నిరూపించుటయే వేదాంత శాస్త్రమునకు విషయము. గీతలు, ఉపనిషత్తులును లౌకిక దృష్టాంతములఁ గొని, మహత్తర మగు పరమార్థ తత్త్వమును జిజ్ఞాసితముగ ప్రదర్శించినవి. ఉపబృంహణ రూపములగు పురాణములు ఉపాఖ్యాన రూపమున ఈ యర్థమునే విశదీకరించినవి. వైదిక విజ్ఞానమే భారతీయ నాగరికతకు మూలస్తంభము. తత్త్వవేత్తలే సంఘమునకు దర్శకులుగా నుండవలె నను 'ప్లేటో' సిద్ధాంతము ఈ

ఖండమునందే ప్రథమమున నాచరింపబడినది. అదృష్ట వశమున ఆర్ష మత సిద్ధాంతములు మూఢ విశ్వాసములపై ఆధారపడియుండలేదు.

సిద్ధము లగు శ్రుతులు, బ్రహ్మప్రతిపాదకము లగు ఉపనిషత్తులు, ప్రమాణ ప్రమేయ పరిశోధకము లగు బౌద్ధ సిద్ధాంతములు, జగత్తత్త్వ నిగరణ చణ మగు శంకరాద్వైత మాయావాదము, శ్రుతి, స్మృతి, ఆగమ, పురాణ, ఇతిహాస సమన్వయ సారభూతమును, తర్క జటిలము నగు రామానుజ దర్శనమును, తదితరము లగు సర్వ దర్శనములును తాత్త్విక దృష్టితోడను, రాగద్వేష రహితమగు మనో వృత్తి తోడను పరిశీలించు విద్యార్థికి, సకలార్థప్రదములగు కామధేను వులే యగును. వర్ణావర్ణ విభేద శంకాస్పదుఁడగు పాశ్చాత్య విద్యార్థికి భారతీయ వాఙ్మయ మెట్లు ఫలప్రదము కాఁజాలదో, అట్లే - మ్లేచ్ఛ ప్రోక్తము సర్వమును తుచ్ఛ మను భారతీయునకు సైతము ఖండాంతర దార్శనిక విజ్ఞానము కార్యకారి కానేరదు. నిష్పక్షపాత బుద్ధులగు శేముషీ సంపన్నులకు ఉభయలోక పురుషార్థప్రద మగుట సత్యము.

భారతీయ దార్శనిక విజ్ఞానమునందలి పారిభాషిక పద సముదాయము ఆంగ్లానువాదమున కనుకూలము గానందున, ఖండాతర వాసుల కీ తత్త్వము బహుకాల మనాఘ్రాతమై యుండెను. ఈ శబ్దాడంబర కవచమును భేదించి, అంతర్గత మగు విజ్ఞానామృతమును గ్రోలఁ గల్గిన శ్రమాను రూపమగు ఫల మనశ్య భోక్తవ్య మగును. సకల భూతములందును కుశాగ్రబుద్ధుల నాకర్షించిన సమస్యల కిందు సమాధానములు గలవు. కేవల మానవజాతి సామాన్యములగు తత్త్వములిందు విశదీకరింపఁబడియుండుటవలన, వర్ణావర్ణ సిద్ధాంతములకు తా వుండుట యరుదు. ఆసియాఖండమునం దఖండ వ్యాప్తి నొందిన బౌద్ధ వైదిక

వాఙ్మయము లిందు సంగ్రహింపఁబడియుండుటచే, తత్పరిశీలనము లేని లౌకిక పారలౌకిక తత్త్వజిజ్ఞాస - యసంపూర్ణమే యగును.

భారతీయ దార్శనిక చరిత్రము అతిప్రాచీన మగుటచే, దర్శన కర్తల దేశ కాల పరిస్థితులు దురవగాహములుగా నున్నవి. కావున, దర్శన తత్త్వమును చరిత్రాత్మకముగా - పౌర్వాపర్య విమర్శనాను పూర్వకముగా రచించుట దుర్లభము. అనంత కాల గర్భమున లీనమైపోయిన విషయము లీ నాఁడు నిష్కృష్టముగా నిర్ణయింపఁ బూనుట కౌతుకావహమే యైనను, పూర్ణ ఫలప్రదము కాఁజాలదు. అద్భుతావహము లగు ఊహాప్రపంచములకును, అభూత కల్పనలకును, అసంభవములగు అపసిద్ధాంతములకును ఆలవాలమై, గత వృత్తాంతము లను ప్రాచీన చరితాన్వేషణ ప్రక్రియ ఇదమిత్థ మని నిర్ణయింపఁజాల కున్నది. విశీర్ణము లగు శిలా లేఖనములనుండి వివిధ చరిత్రాంశములును సంగ్రహింపఁబూనుటయును సాహసమే. అతీతములును, విచ్ఛిన్నములు నగు వృత్తాంతముల కైక్యముఁగల్పించుచు, ఇతివృత్తములను సమన్వ యించుటలో - ఊహాపోహల కెంతేని యవకాశము గలదు. ఇందలి సత్యాసత్యములు సర్వేశ్వరునకే యెఱుక.

విజ్ఞాన ఘనము లగు ఔపనిషద దర్శములును, కర్మ బ్రహ్మ మీమాంసా శాస్త్రముల యందలి న్యాయసిద్ధాంతములు, బౌద్ధ వాఙ్మ యమునందలి మానసిక తత్త్వ పరిశోధనలు, జగన్నిగరణచణము లగు మాయావాద ప్రాసాదములు, సర్వ విజ్ఞాన యాథార్థ్య స్థాపకము లగు వైదిక తత్త్వములును మానవ మనో వికాసమునకు, లోకకల్యా ణమునకు ఎంతయు ఆవశ్యకము లనుట నిర్వివాదము.

ప్రత్యేక దార్శనికులును, మేధా సంపన్నులును, శ్రద్ధానంతులు నగు ప్రాచ్య పాశ్చాత్య విద్వాంసులు ఆధునికు లనేకులు పఠించి, సార

భూతము లగు గ్రంథములను రచించుచునే యున్నారుగాని, దర్శనోదయ - అభ్యుదయ - పరిణామము లనేకరీతిని పరిశీలించి, భారతీయ తత్త్వ శాస్త్ర ప్రణాళికను యథావస్థితముగా ప్రదర్శించు విపుల గ్రంథములు చాలవరకు తక్కువగా నున్నవి. సంస్కృతమున 'సర్వ దర్శన సంగ్రహము', ఆధునిక 'దర్శనోదయము' అనునవి ప్రాచీన నవీనములు కొన్ని మాత్రమే గలవు. ఆంగ్లమున దాస్ గుప్త, రాధాకృష్ణ పండితు లీ పద్ధతినే విపులముగా గ్రంథరూపమున ప్రదర్శించిరి.

## ఉపోద్ఘాతము

*(Special Introduction)*

తత్త్వశాస్త్రము మానవ వ్యవహారికావసరముల కుద్భవించినది. ఏదైన నొక దర్శనము ప్రధాన మానుష స్వాభావిక భావ సమన్వయము నొనరించి, మత హృదయావిష్కరణము చేయలేకున్నచో, ఆ దర్శనము సార్వ జనీనము కాంజాలదు. దార్శనికుల తత్త్వ చింతనము మన సాంసారిక బాధల నుపశమింపఁజాలకున్న, అట్టి చింతనము బుద్ధి వైభవ సూచక మాత్రమేగాని, ప్రయోజనాత్మకము, ఆచరణీయము, కాంజాలదు. కూటస్థ నిత్య శుద్ధ బుద్ధ నిర్విశేష చిన్మాత్రమగు శాంకర పరబ్రహ్మము కాష్ఠ ప్రాయము, పాషాణ సదృశము నిశ్చలము, ప్రభావ రహితము నగుటచే, మానుష హృదయములందు భక్తి భావ మంకురింపఁజేయఁజాలదు. అవాఙ్మానసగోచరమగు శాంకర కూటస్థ చైతన్యము ఉపాసకులను తృప్తి పరచజాలదు. దార్శనిక, మతధర్మములకు దేవుని తెలిసికొనుట సత్యము నెఱుంగుటయే యని భావించువారలకు శాంకర దర్శనము పాండిత్య స్ఫోరక నిగ్రహ స్థానమునకు పరినిష్పన్న ప్రథమోదాహరణముగ గన్పట్టును అద్వైత పరబ్రహ్మము స్వాభావిక మానుష భావములతోడను, సుశిక్షిత శేముషీ శక్తితోడను సమన్వయింపదు. పరిదృశ్యమాన ప్రపంచము మిథ్య యనియు, దైవము నీరస మగు బ్రహ్మ మనియు, అతి ప్రకాశ

విన్మాత్ర స్వరూపమై, జనుల కనులకు మిరుమిట్లు గొల్పుచు, అంధ కార ప్రాయమే యనుట శాంకర పక్షము. ఆర్త్తులగు ప్రపన్నులు మోక్షార్థులై, భగవంతుని శరణు జొచ్చినచో, వారి కభయ మిచ్చి, పదయుఁడగు దేవుఁడు కాపాడునను అనుభవసిద్ధ మగు సత్యము శాంకర దర్శనమున మఱుగు పడినది. కష్ట దశలందు భక్తులకు భగవంతునియెడగల్గు మైత్రీభావము అనఁగా - జీవత్మాహ చర్య భావము శాంకర దర్శనమున పరామర్శింపఁబడలేదు. శ్రీ శంకరులు 'స్వీయ రక్ష' యనఁగా - 'పర బ్రహ్మ సాగరమున మునిఁగిపోవుటయే' యని ప్రవచించిరి. బౌద్ధులు 'శూన్యం తత్త్వం' అనియు, 'విజ్ఞాన సంతాన మాత్మా' అనియు చెప్పిరి. ఆత్మ స్థైర్య మును వీ రంగీకరింప లేదు. నైరాత్మ్య వాదమును వీరు బోధించిరి. అట్టి సమయమున శ్రీ శంకరు లవతరించి, అవైదిక మగు బౌద్ధ వాదమును నిరసించి, ఆత్మాస్తిత్వమును, ఆత్మ స్థైర్యమును సిద్ధాంతీక రించిరి. కుమారిలభట్టుచే పరాజితులు కాఁగా, మిగిలిన బౌద్ధులను శ్రీ శంకరులు నిర్జించిరి. తరువాత భగవద్రామానుజులు - 'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా, జీవో బ్రహ్మైవ నాపరః' అను శాంకర పక్ష మును నిరసించి, చిదచిదీశ్వర తత్త్వముల స్థాపించిరి. తరువాత ఆనందతీర్థ మతస్థులు సత్యవాదము నవలంబించి, 'అ తత్త్వ మసి' అని ఔపనిషద మహా వాక్యమునకు పద విభాగము చేసిరి. జీవ బ్రహ్మలకు భేదము కల్పించిరి. భగవద్రామానుజులు - జీవునికి, అచిత్తునకు పృథక్సత్త లే దనియు, భగవ చ్ఛరీరభూతములనియు, నారాయణ పరబ్రహ్మమునకు ఇవి ప్రకారములనియు, పరబ్రహ్మ చిదచి ద్విశిష్టు డనియు విశిష్ట వస్తువునకు విశిష్ట రూపమున ఐక్యమును ప్రవచించిరి.

బౌద్ధులు ఆత్మను సున్న చుట్టగా, శ్రీ శంకరులు భారతీయుల వారి యాత్మలను తిరిగి యొసంగిరి. భగవ ద్రామానుజులు మోక్ష మనఁగా - బ్రహ్మయందు ఆత్మ మునిఁగిపోవుట కాదు జీవ వ్యక్తిత్వము ఈశ్వరాధీన సత్తాక మని నుడివి, సాయుజ మోక్షమును ప్రతిపాదించిరి. మాధ్వులు జీవ బ్రహ్మలకు భేదముఁ సిద్ధాంతీకరించిరి. ఇట్టి తాత్త్విక పూర్వరంగమున ఈ దర్శనవ ఉద్భవిల్లినవి. ఇందు శ్రీ రామానుజ దర్శనము మధ్యే మార్గవ నవలంబించి, అటు ముముక్షువులకును, ఇటు జటిల మనస్కులకుఁ ఉపాయమైనది. ఉపనిష, దాగమ, పురాణ, దివ్యప్రబంధములనుం భావ పరంపరలు యతీంద్ర మనోదర్పణమున ప్రతిబింబించినవి భగ ద్రామానుజులు తాత్త్విక దృష్టి సంపన్నులు, భక్తి భావ ప పూర్ణులు, జగదుజ్జీవన మత స్థాపనోత్సుకులు, భక్తి - తర్కములన విశిష్టాద్వైత వేదాంతమున మేళవించిన మహనీయులు.

## బ్రహ్మ సూత్రములు

వేదాంత శాస్త్రము ఉపనిషన్మూలము, భగవద్గీతోద్భవము బ్రహ్మ సూత్ర నిస్సృతము. అనఁగా - ప్రస్థాన త్రయ ప్రాతి ఖ్యాతము, ప్రశస్త తమము. మానవాళికి భారతదేశ మిచ్చిన బహ మతియే వేదాంతశాస్త్రము. ఇది అనుత్తమము * 'ఏక విజ్ఞానేన సర విజ్ఞానమ్' అను ప్రతిజ్ఞయే వేదాంత సారము. బ్రహ్మ విజ్ఞానమ సర్వ విజ్ఞాన ప్రదము. బాదరాయణుల వేదాంత సూత్రములు ఔపనిషద సిద్ధాంత దర్పణములు, ప్రామాణికములునై యున్నవి స్థూల దృష్ట్యా - ఉపనిష ద్వాక్యములు స్వవచన వ్యాఘాతములుగను

* దేనికంటె మేలైనది లేదో - అది. శ్రేష్ఠ మైనది.

— సంపాదకుఁడు

తర్క దూరములుగను గాన్పించును. కాని, వ్యాసులు (శాదరాయణులు) స్వీయ సమన్వయ శక్తిచే ఔపనిషద వచన సమన్వయము గావించి, సూత్రీకరించిరి తత్త్వశాస్త్ర చింతనమును ఆధ్యాత్మిక యోజనలతో మేళవించుటయే సూత్రకారాభిప్రాయము. బ్రహ్మసూత్రములు ముముక్షువుయొక్క బ్రహ్మజిజ్ఞాసతో మొదలై, ముక్త పురుషుని బ్రహ్మానుభవముతో పరిపూర్తి నందును.

వేదాంత సూత్రములు నాల్గు అధ్యాయములు గలవి, 16 పాదములు గలవి. ప్రతిపాదమునందును అధికరణము లున్నవి. ఈ యధికరణములు వేదాంతపరములు. శాంకర మతమున 555 సూత్రములు, శ్రీ పూర్ణప్రజ్ఞ మతమున 564 సూత్రములు, శ్రీ రామానుజ సిద్ధాంతమున 545 సూత్రములు కలవు. ప్రథమాధ్యాయమున ఔపనిషద కారణ వాక్యము లాధారముగ చిదచిత్తత్త్వముల కాత్మభూతుఁడగు పరబ్రహ్మ స్వరూపము విశదీకరింపఁబడినది. ద్వితీయాధ్యాయమున శ్రీవ్యాసులు వేదాంత శాస్త్రేతర వాదములను (అవిరోధాధ్యాయమును) ఖండించి, ప్రథమాధ్యాయ విషయములను ధ్రువీకరించిరి. మూఁడవ అధ్యాయమున బ్రహ్మప్రాప్తి సాధనములు సమగ్రముగ చర్చింపఁబడినవి. చివరి అధ్యాయమున(ఫలాధ్యాయమున) వ్యాసమహర్షి వేదాంత శాస్త్ర గమ్య మగు మోక్ష స్వరూపము నావిష్కరించిరి. ఈ చతుస్సూత్రి వేదాంత సారమే. అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత సిద్ధాంతములు ప్రస్తుత కాలమున లోకములో ఆచరింపబడుచున్నవి. నింబార్క, భేదాభేద,శ్రీకర సిద్ధాంతములు తెరచాటయినవి. అద్వైతము లోక విదితము. ద్వైత విశిష్టాద్వైతములు ఇటీవల శాగుగా వ్యాప్తి నందుచున్నవి. విశిష్టాద్వైతము సర్వ జనాదరణీయము, భగవంతుఁ డందరిలో నున్నాఁడని బోధించును. పర బ్రహ్మ మగు నారాయణుఁడు ప్రేమ స్వరూపుఁడని తెలుపును,

## శ్రీ రామానుజ గ్రంథములు

భగవద్రామానుజులు (1) శ్రీభాష్యము (2) వేదాంత సారము (3) వేదాంత దీపము (4) వేదార్థ సంగ్రహము (5) గీతా భాష్యము (6,7,8) గద్యత్రయము (శరణాగతి, వైకుంఠ, శ్రీరంగ గద్యములు) (9) నిత్య గ్రంథము అను తొమ్మిది గ్రంథములను రచించిరి. వీరు ద్రావిడ భాషలో (తమిళమున) నొక్క గ్రంథ మేని రచింపలేదు. అంతమాత్రమున వీరు ద్రావిడభాషాభిమానులు కారని తలంపరాదు. శ్రీ శఠకోపమునీంద్రులు యోగ దశలో నాథమునులకు ప్రసాదించిన నాలాయిర దివ్య ప్రబంధ సూక్తుల నాధారముగా గొనియే శ్రీ భాష్యమును వీరు రచించిరి. ఆ కాలమున విద్వాంసులచే శాస్త్ర చర్చలలో వాడబడిన భాష - దేవ భాష యైయుండున, శాస్త్రగ్రంథము లగు శ్రీభాష్యాదులను యతిసార్వభౌములు గీర్వాణభాషలో వ్రాసిరి. అంతియేకాని, వేరు కాదు. ద్రావిడ మన్ననో, 'స్వగోష్ఠీ నిష్ఠః సమయః' అనున ట్లుండెను. కాశ్మీరమున శారదాపీఠమునందు - శైలిలో 'శాస్త్ర కాదంబరి' యనఁదగు 'శ్రీభాష్యము' సమాదరింపఁ బడినది. అగస్త్య భాష (తమిళము), దేవభాష (సంస్కృతము) అనునవి రెండును శిరోధార్యములే. ఈ విషయమున విప్రతిపత్తి తగదు. ఉభయ వేదాంతములు విశిష్టాద్వైత మూలస్తంభములు.

శ్రీ రామానుజులు 120 వర్షములు జీవించి, జ్యోతిష దత్త జీవితము ననుభవించిరి. (క్రీ. శ. 1017 - 1137) అనేక మహా కార్యముల గావించిరి. ప్రాచీన వేదాంతశాస్త్ర ప్రవర్తకు లగు టంక, గుహదేవ, ద్రమిడ, కపర్ది, భారుచి సంప్రదాయముల ననుసరించిరి, బోధాయనవృత్తి ననుసరించిరి, పూర్వోత్తర మీమాంసా శాస్త్రముల కైకకంఠ్యమును బోధించిరి, విశిష్టాద్వైత సిద్ధాంతమును నెలకొల్పిరి. బాదరాయణ సిద్ధాంతము భగవద్రామానుజ సిద్ధాంతముతో సమ

న్వయించు నని, విమర్శక శిరోమణి యగు థీబో (Thbaut) పండితుని నిశ్చితాభిప్రాయము. నాథోపజ్ఞ మగు విశిష్టాద్వైతము కేవల తత్త్వశాస్త్రము కాదు, కేవల మతము కాదు, తత్త్వ శాస్త్ర సంపుటిత మగు మతము, దార్శనిక మతము, పాశ్చాత్య తత్త్వయోజన కాదు, మతపర మగు మూఢ విశ్వాసము కాను - తార్కిక విశ్వాస మని చెప్ప నొప్పును. ప్రత్యక్షానుమాన ప్రమాణజన్య జ్ఞానములను తర్క శాస్త్రమునుచే పరీక్షించును. అంతియ కాదు - వైదిక విశ్వాసములను క్రాంతదర్శులగు మహర్షుల యనుభవములనుకూడ తర్కాను గృహీతములఁ జేయును.

## జ్ఞాన సిద్ధాంతము - Epistemology

*(Theaty of Knowledge)*

ప్రత్యక్షానుమాన శ్రుతులు ప్రమాణములు. ఏతత్ ప్రమాణ జన్య జ్ఞానముల సమన్వయమే దార్శనిక మత మగు విశిష్టాద్వైత హృదయము. 'బ్రహ్మవిదాప్నోతిపరం' అను తైత్తిరీయ ఉపనిష ద్వచనము వేదాంత సూత్రప్రోక్త మగు తత్త్వ హిత పురుషార్థముల సమన్వయించును తత్త్వ జ్ఞానము చిదచిచ్ఛరీరుఁడును, తదంత ర్యామియు నగు పరబ్రహ్మను విశదీకరించును. హిత మనఁగా - బ్రహ్మప్రాప్తికి నైతికాధ్యాత్మిక సాధనములఁ దెలుపునది. పురుషార్థ మనఁగా - నిశ్శ్రేయస పద బ్రహ్మప్రాప్తి.

జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము అను మూఁడు అంశము లున్నవి. ఆత్మ యొక్క ధర్మ భూతజ్ఞానము, అద్వైతులయొక్క అంతఃకరణము కంటె వేరై నదియు, స్వయంప్రకాశమును, వస్తుప్రకాశమునై యున్నది. బాహ్యవస్తువు అవిద్యావృత్తి కాదు. జ్ఞాత, అహంకారము

యొక్క అసత్యాత్మ కాదు. జ్ఞానము, జ్ఞాత, జ్ఞేయము సత్యములే. 'జ్ఞాతా అహ మర్థ ఏ వాత్మా' అహ మర్థమే ప్రత్యగాత్మ. త దంత ర్యామి పరమాత్మ. 'నేను ఆలోచించుచున్నాను' అనఁగా - 'నాయం దంతర్యామిగా నున్న పరబ్రహ్మ ఆలోచించుచున్నాఁ' డని యర్థము.

## ధర్మభూతజ్ఞాన స్వరూపము

ధర్మభూతజ్ఞానము ప్రధానమగు సిద్ధాంతము. త త్త్వము నిది విశదీకరించును. యతీంద్ర మత దీపికయం దీ సిద్ధాంతము బాగుగా తెలుపఁబడినది జ్ఞానము తన్ను తా నెఱుఁగదు. అది ఆత్మయొక్క గుణము జ్ఞానము జ్ఞాత కాదు. త త్త్వము కాదు - 'నేతి నేతి' పద్ధతి శుద్ధ చైతన్యమును తద్గుణమగు జ్ఞానమునుండి వేరు చేసి, చైతన్య మునే 'కాదు - లేదు' అనుచున్నది. ఇది అసంగతము.

ద్రవ్యము గుణము గలది. సన్మాత్రమే వస్తువైనచో, అది బౌద్ధ వాదమే. ధర్మము, ధర్మి, ఇత రేతర సాపేక్షములు. అవిద్యాధి ష్ఠాన విషయమున ద్రవ్య గుణముల నంగీకరింపక తప్పదు. అజడ ద్రవ్యము స్వప్రకాశము. దేశకాలపరిచ్ఛిన్న మగు ప్రపంచము జడము. ఆత్మ జ్ఞానస్వరూపము, జ్ఞాన గుణకము. ఆత్మ ధర్మభూత జ్ఞానము, ఆత్మరూప ప్రదర్శకము. తర్క దృష్ట్యా, ఈ ధర్మభూత జ్ఞానము స్వయంప్రకాశకము, అర్థప్రకాశమువైనది. దీనికి మతి, శేముషి, ప్రజ్ఞ, సంవిత్ అని నామాంతరము లున్నవి. చేతన, జడ పదార్థముల కిది మధ్యస్థము. ఏలన, చేతనమువలె స్వప్రకాశము, అర్థ ప్రకాశముకదా! అయినను, ఇది ఆత్మకొఱకు ప్రకాశముగాన, అచే తనమును పోలియున్నది. భౌతిక దీపము వలె నిజవస్తు దర్శకము, వస్తు జ్ఞాత కాదు. ఇది ఆత్మాశ్రయము. ఆత్మకును, జ్ఞానమునకునుఁ గల సంబంధము - దీపమునకును, దీప ప్రకాశమునకునుఁగల సంబం

ధము వంటిది. ఆత్మ జ్ఞాత, జ్ఞానమాత్రమే కాదు. జ్ఞానము స్వయం సిద్ధము. స్వతః ప్రమాణము అత్యల్ప స్వాభావిక ప్రేరణ (Instance) మొదలు అత్యున్నత భక్తి అవస్థ వఱకుఁగల మధ్యావస్థలగు వివేకము, ప్రత్యక్షము, అనుమానము, శబ్దము అన్నియు జ్ఞానావస్థలే. ప్రత్యగాత్మ అణుస్వరూపము అయినను, తత్ జ్ఞానము విభు స్వరూపమే. మూర్ఛ గాఢ సుషుప్తులయందు ఆత్మ అనువర్తించును. 'నేను బాగుగా నిద్రించితిని' అను తరువాతి యనుభవము ఈ యంశమును ధ్రువీకరించును గదా ! నిద్రావస్థలో జ్ఞానముయొక్క ప్రకాశకశక్తి తమోఽభిభూత మగునుగాని, అదృశ్యము కాదు నిద్రావస్థలో జ్ఞానానుభవము తదభావమును సాధింపదు. స్మృతి (Memory) పూర్వ జ్ఞానానుభావమును నిరసించును. ఈశ్వర విజ్ఞానము బద్ధ జీవుని విజ్ఞానము వంటిది కాదు. అది నిత్యము, విభుస్వరూపము ధర్మభూత జ్ఞానము స్వయంప్రకాశము, వస్తు ప్రకాశకము. అది - ద్రవ్యము, గుణము. సూర్య ప్రభ, దీప కాంతి, వస్తు వస్తుప్రకాశకములు, ద్రవ్య మాశ్రయించిన గుణములు కూడ. ఆత్మయొక్క ముఖ్యము, నిత్యము అగు గుణము, జ్ఞానము కర్మప్రభావమునకు లోనై, ద్రవ్యము వలె జ్ఞానము, సంకోచ, వికాసములకు ఆస్పదము , వికారములకు అధిష్ఠానమును అగును కనుక, ద్రవ్యమని చెప్ప నొప్పును. కర్మ బంధముచే నిత్య విజ్ఞానము వికారమునకు లోనగును. ముక్తావస్థలో ఇంద్రియ సంనికర్ష విముక్త మగుటచే, స్వోచ్ఛస్థితి నందును. ఇట్లు జ్ఞానము - వికారి, అవికారి, ద్రవ్యము, గుణము అయియున్నది. ఇది ఆత్మయొక్క ప్రత్యేక విశిష్ట గుణము. నిర్విశేష వస్తువు ప్రమాణ సిద్ధము కాదు.

"ప్రత్యక్షస్య నిర్వికల్పక సవికల్పక భేద భిన్నస్య న నిర్విశేష వస్తుని ప్రమాణ భావః."

—(శ్రీ భాష్యము 1-1-1.)

తత్త్వము సవిశేషము, సవికల్పకము, నిర్వికల్పకము కాదు. ఏకజాతి ద్రవ్యములందు ప్రథమపిండ గ్రహణము నిర్వికల్పక ప్రత్యక్షము. ద్వితీయాది పిండగ్రహణము సవికల్పకమే. నిరాశ్రయము - నిర్విషయము నగు సంవిదాకాశ పుష్పాయమానము, అనూహ్యము.సంవిత్ స్వయం సిద్ధమైన, అట్టి స్వయంసిద్ధి గుణమేకదా !

ఏకజాతిద్రవ్యములందు ప్రథమ పిండగ్రహణము నిర్వికల్పకము. ఇది నిర్విశేషము కాదు. వివేక, భేదము లిట గ్రహింపఁబడును. ద్వితీయాది పిండగ్రహణము సవికల్పకము. 'ఇది యొక ఆవు' అను మొదటి వచనము అనిశ్చితమైనను, నిర్విశేషము కాదు. 'ఇది కూడ ఆవే' అను రెండవ వచనము ఆకారసాదృశ్యముపై ఆధారపడిన స్మృతి. రెండును సవిశేషములే, నిర్విశేషములు కావు. జాతి వ్యక్తి యందు దృశ్యము సంస్థానమే (Form, Pattern) జాతినైయాయికుల సామాన్యమే (Genus) సంస్థానము, ఆకృతి విశేషజ్ఞానము సవికల్పక నిర్వికల్పక ప్రత్యక్షములకు విరోధము లేదు. నిర్వికల్పక ప్రత్యక్షము వలన నిర్విశేష చిన్మాత్ర బ్రహ్మము సిద్ధింపదు.

"నిర్వికల్పకం నామ కేనచి ద్విశేషేణ వియుక్తస్య గ్రహణం, న సర్వ విశేష రహితస్య."

—(శ్రీభాష్యము)

వేదార్థసంగ్రహమున శ్రీరామానుజులు —

"భిన్నప్రవృత్తి నిమిత్తానాం శబ్దానాం ఏకస్మిన్ అర్థే వృత్తిః సామానాధికరణ్యమ్."

'ఇది యొక చెట్టు' అను వచనమున. 'ఇది' వ్యక్తి సూచకము, 'చెట్టు' జాతి సూచకము, ఈ రెండు మాటలు వేరు వేరు ప్రయోజ

నములు గలవి, భిన్న ప్రవృత్తి నిమిత్తములు. కాని, అవి ఏక వస్తు సూచకములు. విరుద్ధ గుణములు ఏక కాలమున, ఏక దేశమున నుండవు. వేరు వేరు గుణములు అవిరుద్ధములైనవి ఒకే వస్తుగుణములు కావచ్చును. 'ఈ వ్యక్తి ఆ దేవదత్తుడే' అను వాక్యము ఏక వస్తు సూచకము. వేరు వేరు సందర్భములందు చూడబడిన ఒక దేవదత్తుని సూచించును. అద్వైతముకూడ భేద రాహిత్యమును సూచింపదు.

చిదచిత్తులు వేరైనవికాని, పరబ్రహ్మప్రకారములు కనుక నొక్కటియే. ప్రకారి ప్రకార సంబంధము, కుసుమ, తత్సౌరభ సంబంధ తుల్యము. అచ్చుకు హల్లుకు గల సంబంధము వంటిది, శరీరి శరీర సంబంధము వంటిది. చిన చిదంతర్యామి, తత్ పోషకుడు పరమాత్మ. విశిష్టాద్వైతము గణితము కాదు. ఒకటి రెండు చేర్చుట కాదు. ఒకటిగో రెండున్నవి. ఇది తత్త్వము. జీవుడు పరమాత్మ ప్రకారము, అపృథక్ సిద్ధ విశేషణము. అయినను, సత్తాశూన్యుడు కాడు, పరమాత్మ చిదచి దంతర్యామి.

పరం తత్త్వము (Reality) జ్ఞాన గ్రాహ్యము అని విశిష్టాద్వైత జ్ఞాన సిద్ధాంతము.

"సర్వం విజ్ఞానజాతం యథార్థమ్ "

అను శ్రీభాష్య సూక్తి దీనిని ధ్రువీకరించును. ఉన్న వస్తువే జ్ఞానముచే గ్రహింపబడును. శ్రీమద్రామానుజుల సత్ఖ్యాతి సిద్ధాంతము ఈ విషయమునే స్థాపించును.

"ఆత్మఖ్యాతి రసత్ ఖ్యాతిః
అఖ్యాతిః ఖ్యాతి రన్యథా
తథాఽనిర్వచనీయ ఖ్యాతిః
ఇత్యేతత్ ఖ్యాతి పంచకమ్."

ఈ ఖ్యాతులను శ్రీరామానుజు లంగీకరింపరు. ద్రవ్యాస్తిత్వము అస్త దాదుల నిరపేక్షము. వస్తువు ఉన్నది కనుక, జ్ఞేయ మగును జ్ఞేయ మైనది కాన, 'ఉన్నది' అనరాదు. ప్రకృతి సంవిత్తుచే తెలిసికొన బడును. సంవిత్తు కొలకు ఉన్నది సంవిత్తులో ఊహా మాత్రము కాదు

శ్రీరామానుజులు సృష్టి మాయకా దందురు రజ్జు సర్ప భ్రాంతిలో - అగ్ని, నీరు, పృథివి కలియుటచే, సర్ప రజ్జువు లేర్పడి నవిగాన, త్రాడులో సర్ప లక్షణములు గలవు ఈ నిజమైన సాధా రణ సదృశ ధర్మములనే రజ్జు సర్ప భ్రాంతిలో మనము గ్రహింతుము ఈ ధర్మము లున్నవియే, లేనివి కావు. అసత్య వస్తువును 'త్రాడు పాము భ్రమ'లో మనము చూడలేదు. ప్రతి వస్తు లక్షణముల ప్రతి యితర వస్తువులో నున్నందున, భ్రమలో సత్య మున్నది. ఈ త్రివృత్కరణ సిద్ధాంతము ఆధునిక సత్యతావాదులు (Moder Realists) అగు 'బూదిన్' (Boodin) మొదలైన తాత్త్వికుల సిద్ధాం తమును పోలియున్నది. 'ష్రోడింగర్' - 'క్వాంటమ్' సిద్ధాంత (Schrodinger quautum theory) మాధారముగ 'బూదిన్' (Boodin అపరోక్షానుభవ జన్య జ్ఞాన మంతయు సత్యమే యగును 'క్వాంటమ్' (Quantum) సిద్ధాంతానుసారముగ భౌతిక వస్తు గతమైన ఎలక్ట్రానులు (Electrons) ప్రపంచ వ్యాప్తములు, కనుక, ప్రతి వస్తువు - ప్రతి యితర వస్తువునం దున్నది. 'యథార్థం జ్ఞానం' అను శ్రీ రామానుజ సిద్ధాంత మిట్లు ఆధునిక భౌతిక, తత్త్వశాస్త్ర సంమతమై రాణించు చున్నది.

## సత్యత్వ సిద్ధాంతము

*(Theary of Truth)*

సమన్వయ సిద్ధాంత మగు విశిష్టాద్వైతము ప్రత్యక్షానుమాన శబ్దజన్యానుభవ సమగ్రతను అంగీకరించును ఏలన, జ్ఞానము స్వతః

ప్రమాణము, యథార్థము. సద్వస్తువే జ్ఞాన గ్రాహ్యము. అసద్వస్తువు జ్ఞాన గ్రాహ్యము కాదు. 'బ్రహ్మసత్యం జగన్మిథ్యా' అయిన యెడల, జ్ఞాన మసంభవము. నిశిత అద్వైత తర్కము - బ్రహ్మ, మాయలకు సాహచర్యము సహాస్తిత్వము సంగీకరింపఁజాలదు.

శ్రీ రామానుజులకు బ్రహ్మము సత్ పదార్థము; పరమ సత్యము, సర్వాంతర్యామి. ప్రపంచము మాయా తిరోహిత మగు బ్రహ్మ కాదు, అది బ్రహ్మ మయము, తత్ భాసితము. అది బ్రహ్మాంతర్గతము. బ్రహ్మ కాదు. పరతత్త్వము బ్రహ్మ రూపమున చిదచి దంతర్యామి. అచిత్ - వికారి, నశ్వరము, అనిత్యము, అసత్యము. చిత్ - నిత్యము, ప్రకృతి భిన్నము, సత్యము. పరబ్రహ్మము సత్యముల కెల్ల సత్యమైనది. అనఁగా - వాసుదేవ పరబ్రహ్మమే.

'ప్రమా' అనఁగా - 'యథావస్థిత వ్యవహారానుగుణ జ్ఞాన' మని యతీంద్ర మత దీపికాకారుని నిర్వచనము. సంశయ, విపర్యయాతీతము. ఈ విశద నిర్వచనము 'స్థాణు ర్వా పురుషో వా' అను చోట సంశయము. 'త్రాడా? పామా?' అను తావున విపర్యయము. విజ్ఞానము సర్వము యథార్థము. అనుభవముతో సంవదింపవలయును. అంతియే. అభావము (Nonexsience) తో కూడిన ప్రత్యక్షము (Perception), ఉపమాన (Analogy or Comarison) అర్థాపత్తు (Presunption) లతో కూడిన అనుమానము (Inference) శబ్దము (Sevip!wre) అను ప్రమాణ త్రయమును భగవద్రామానుజు లంగీకరించిరి. ప్రత్యక్షమున ఇంద్రియార్థ సంనికర్షమువలన, వస్తు అపరోక్ష జ్ఞానము కల్గును. కార్య కారణ నిరంతర అవ్యభిచారి సాహచర్యమను వ్యాప్తి జ్ఞానము వలన అనుమానము సిద్ధించును. 'సర్వతో వహ్నిమాన్', 'ధూమవత్వాత్', 'యత్ర యత్ర వహ్నిః తత్ర తత్ర ధూమః యథా మహానసే.' అను మూఁడు అవయవములు కలది

అనుమానము. పంచావయవి కావలసిన యవసరము లేదు అనుమానము లేక తర్కము సామాన్య సత్యమునుండి ప్రత్యేక సత్యమును సాధింపవచ్చును. దీనిని 'డిడక్షన్' (Deduction) అందురు ప్రత్యేక సత్యమునుండి సామాన్య సత్యమును అనుమానింపవచ్చును. ఇది - 'విశ్వజనీనతా సాధనము' (Induction) అనంబడును.

అనుమానము విరుద్ధ, అన్యోన్యాశ్రయ, అనవస్థ లనెడు నిగ్రహస్థానములకు లోను కారాదు. శ్రుతి నిత్యము, అపౌరుషేయము, సత్యము. ప్రత్యక్షమునకు జ్ఞానము పునాది. తర్కము లేక అనుమానము ప్రత్యక్ష మూలము. ప్రత్యక్షమును త్రోసిరాజనదు. సర్వ విజ్ఞాన సారము, శిఖరాయమానము శ్రుతి. కాని, శ్రుతి ప్రత్యక్ష విరుద్ధము కారాదు.

"శాస్త్రస్య ప్రత్యక్షేణ విరోధే సతి దుర్బలత్వాత్."

## సత్యార్థ ఖ్యాతి

*(Theory of Error)*

సత్యము స్వతః ప్రమాణము. విజ్ఞాన మంతయు నిజమైనదిగాన, ఖ్యాతి వాదము (Theory of Knowledge & Error) అవసరము కాదు. ముక్తావస్థలో సత్యము జ్ఞానముయొక్క స్వాభావిక, సాధారణ ధర్మము. ప్రమా, భ్రమలకు అట భేదము లేదు. పరమాత్మ యొక్క జ్ఞానము సంకోచ వికాసములకు లోను కాదు. పరిశుద్ధము - సర్వోత్తమము, అవిద్యానభిభూతము. ప్రత్యగాత్మజ్ఞానము సంకోచ వికాసాస్పదము. అందుచే, తద్విభుత్వ పారిశుద్ధ్యములు సర్వము నష్టము లగును. దీనినే 'భ్రమ' (Error) అందురు. జ్ఞానము సాధారణముగ సత్యమే. 'వంగిన కఱ్ఱ' అసత్య జ్ఞానము అయినను, నిజముగ నట్లు గన్పట్టు చున్నదిగదా!

అబాధిత జ్ఞానము 'ప్రమ' యను అద్వైత వాదము సరియైనది కాదు. ఏలన, ఈ వాదము భ్రమ లేదను, తత్త్వము భ్రమ ప్రమాతీత మనును. పరబ్రహ్మను మాయ, అవిద్య తద్వికారములనుండి కాపాడుటయు, ఎట్లో అవిద్యచే సంసార బంధమున చిక్కుకున్న ప్రత్యగాత్మకే భ్రమప్రమాదము లాపాదించుటయు, సత్యార్థఖ్యాతి సిద్ధాంత విశేషము. వ్యావహారికానుభవ మసమగ్రము, పాక్షిక జ్ఞాన సముపేతము. ప్రమ పాక్షిక సత్యమే. కర్మబంధమున కతీత మగు జ్ఞానమునకు భ్రమ ప్రమాదులు లేవు.

భ్రమ పలు రకములు. ఉన్మాదజము, భ్రాంతి జన్యము, స్వాప్నికము. వీనిని మన స్తత్త్వ శాస్త్రము విశదపరచును. ఉన్మాదావస్థలో - లేని వస్తువు ఉన్నట్లు తోచును. భ్రాంతిమూల ప్రత్యక్షమున ఒక వస్తువు మఱి యొక వస్తువుగ గృహీత మగును. స్వప్నమున బాహ్య ప్రపంచమున లేనివస్తు అనుభూతి కల్గును. ఇవి సత్యకారణ జన్యములు గాన, సత్య కార్యములు. ద్విచంద్ర జ్ఞానము, పీత శంఖ జ్ఞానము, మఱియు - అలాత చక్రము వరుసగా చక్షురింద్రియ దోష, అనారోగ్య, వేగ భ్రమణ జన్యములు. నేత్ర దోషము లేక వ్రేలితో కంటి రెప్పపై వత్తుట వలన, నేత్ర పైత్యము, వ్యవధాన అగ్రహణము దీనికి కారణములు.

శుక్తి రజత రజ్జు సర్ప భ్రాంతులందు భగవద్రామానుజులు పాంచభౌతిక ప్రకృతి ఐక్యమును, ఇంద్రియజన్య జ్ఞానమున వేరుగా - ఒంటరిగా గ్రహింపబడిన వస్తువుల వస్తు తత్త్వము నంగీకరింతురు. మఱియు, ప్రమను (సత్య జ్ఞానమును) వస్తువుయొక్క అవసర ముఖ్యాంశముల గ్రహించుట యనియు, భ్రమ వీని అగ్రహణమే యనియు నిర్వచించిరి. పంచీకరణ సిద్ధాంత ప్రకారముగ ప్రతి వస్తువు పంచభూత మిశ్రమము. నిర్మాణ సాదృశ్య మున్నది కాని, వస్తు

వస్తుతత్త్వము మిశ్రమమున నధికముగ నే భూతాంశ మున్నదో, దానిచే నిర్ణీత మగుచున్నది. సాధారణ బాహ్యవస్తు ప్రత్యక్ష జ్ఞానమున, జ్ఞానము ముఖ్యావసర అంశమును గ్రహించును. ఇచట బుద్ధి వ్యాపారము లగు సవ్యాఖ్యాన గ్రహణము (Interpretation), వరణము (Selection) అనునవి కలవు.

శుక్తి, రజత భ్రాంతిలో శుక్తిసాదృశ్యయుత మగు రజతాంశము అనుభవ సామాగ్రినుండి అద్వితీయముగ గ్రహింపఁబడినది. అట్టి రజతాంశమునకు విపణి వీథిలో విలువలే దని తెలిసిన వెంటనే, భ్రమ తొలఁగును. ప్రతి వస్తువు పాంచ భౌతికము. సాక్షిక జ్ఞానము అవిద్యాకృతము కాదు. స్వప్నములు భావి సూచకములు స్వాప్నిక జగత్తు జీవ కర్మానుగుణ మగు భగవత్సృష్టి, ఆత్మ సాక్షికము, సర్వ సాధారణము కాదు. జ్ఞాన సిద్ధాంతము దార్శనిక మతముపై ఆధార పడినది.

## అవిద్యా విమర్శనము

అవిద్య సదస దనిర్వచనీయ మని శాంకర పక్షము. శుక్తి రజత భ్రాంతిలో - విపరీత జ్ఞానము అనిర్వచనీయము. మొదట సత్య మని తోచిన రజతము - తర్వాత అసత్య మగును. ఒక్కటే వస్తువు సత్యము, అసత్యము కాజాలదు కదా! ఇదియే అధ్యాసము (Superimposition), 'ఇది' అను శుక్తి జ్ఞానముపై రజత జ్ఞానము అధ్యారోపింపఁబడినది. ఈ భ్రమ అనిర్వచనీయము. అద్వైతు లిత రుల విమర్శింతురు. శూన్యవాదులు (అసత్ ఖ్యాతి) శూన్యము, ద్రవ్యము వలె, అటఁగా - భ్రమాధిష్ఠానమువలె తెలియవచ్చు నందురు. వీరి దృష్టిలో భ్రమ నిరధిష్ఠానము. సర్వము శూన్యము. శుక్తి రజత భ్రాంతిలో రజతము తుచ్ఛము, లేనిది. కాని, శూన్యము

తెలియరానిది. విజ్ఞాన వాదుల ఆత్మఖ్యాతి భ్రమను మానసిక మైనదిగాను, బయటనున్న దానివలె నగుపడుదానిగాను వర్ణించును. మీమాంసకుల అఖ్యాతి వాదము చూడబడిన శుక్త్యంశము జ్ఞాపక ముంచుకొనఁబడిన రజతాంశము రెండును నిజమే అని ఒప్పుకొనును. ఇంద్రియ దోషజమే భ్రమ యనును ఈ దోషము వలన రజతాంశము స్మృతము అను విషయమును మనము గ్రహింపము ఇదియే భ్రమ 'అఖ్యాతి' యనఁగా - అగ్రహణము (Nonapprehension) వలన కలుగును. నైయాయికుల అన్యథా ఖ్యాతి యందు శుక్తి రజతాంశములు రెండును సత్యములే. శుక్తి ఉన్నట్లు గాక, వేరొకదానివలె రజితముగా గృహీతము. ఇతర వస్తుభావము అనగా - శుక్తి అభాసము అనగా - రజత భావము. ఈ భ్రమ ఆత్మ సాక్షికమే (Subjective) ప్రాభాకర, నైయాయిక, సౌత్రాంతిక, వైభాషిక వాదములు సత్యతా వాదములు (Realistic Theories)

భగవద్రామానుజ సిద్ధాంతము సత్యతా వాదమే. అద్వైతులు బాహ్య వస్తువు లేదని పూర్వ పక్షము చేయుదురు. వారి దృష్టిలో శుద్ధ చైతన్య మొక్కటియే ఉన్నది. అద్వైతుల అనిర్వచనీయ ఖ్యాతి వితండ (Cavil) వాద మగును. అన్ని వాదముల విమర్శించి, తమ వాదము అనిర్వచనీయమని యనుట – 'స్థాపనా హీనో వితండః' అను నిర్వచనోదాహరణమే.

అద్వైతుల అవిద్య శుద్ధ చైతన్యమును ఆంతర సంతమసాభిభూతము సేయును. అవిద్యా తిరోహిత బ్రహ్మ - ప్రపంచముగాఁ గన్పట్టును. అవిద్య – ఆంతర భ్రమ, అనాది, విచిత్ర విక్షేపకరి, అనిర్వచనీయము. కాని, జ్ఞాన బాధ్యము. అవిద్య వలన సచ్చిదానంద పరబ్రహ్మము - అనృత, జడ, దుఃఖ స్వరూప మగు వ్యావహారికాత్మగా భావింపఁబడి, ఈ యధ్యాసము సంసార బంధము కల్గించును.

అవిద్యా కారణమును పేదకూట అయుక్తము. ఏలన, శాంకర సిద్ధాంతము అవిద్యాకృతమే శుద్ధ చైతన్యము అవిద్యాశ్రయము కాని, స్వప్రకాశ చైతన్యమును అవిద్య నిజముగా దాగలేదు. అవిద్య జీవాశ్రయము కాదు. జీవుఁడవిద్యా కార్యము గదా! పొగమంచుచే అభిభూతుఁడు కాక ప్రకాశించు సూర్యుని వలె, ఆత్మ స్వయంజ్యోతి. అది అవిద్యా ప్రభావితము కాదు. అవిద్య ఎట్లో బ్రహ్మను నాశ్రయించినది. ఎందులకో మనకు తెలియదు. మన శేముషి, మన బుద్ధి కతీత మగు విషయమును తెలిసికొనఁజాలదు. అవిద్య అనిర్వచనీయము; సత్యము కాదు, అసత్యము కాదు, రెండును కాదు. ముక్తావస్థలో అవిద్య ఉండదుగాన, అసత్యము. ఇపు డున్నది గాన, సత్యము. కాని, సత్యాసత్య మగుట కుదురదు. రెండు కాదు. జీవిత వైరుధ్య పర్యవసానమే అద్వైతము. బ్రహ్మ వీని కతీతము.

అవిద్య అనిర్వచనీయమైనను, దీనిని విశద పరచు సిద్ధాంతములు ప్రచలితములైనవి. దీని పుట్టుక స్వభావముల గురించిన వాదములు (Post Sankara Dialectics) శ్రీ శంకరుల తర్వాత ప్రబలినవి. ప్రతిబింబవాదానుసారముగ జీవుఁడు అంతఃకరణమునందలి బ్రహ్మ ప్రతిబింబము. ఇది అవిద్యాకృతము. ప్రపంచము మిథ్య. జీవుఁడు ఆభాసము. అవిద్య ఎట్లో బ్రహ్మను తిరోహితము సేయునని సురేశ్వరునొక వాదము. అవిద్య జ్ఞానాత్మకము. గగన కుసుమము కాదు. జగత్తు అసత్యమే కాని, కేవల భ్రమ కాదు. జీవునకు అనుభవ సిద్ధుఁడు, ఊహామాత్రుఁడు కాదు. జగత్తునకు వ్యావహారిక సత్యత్వమున్నది. జగత్ బ్రహ్మల సంబంధ మనూహ్యము. ఇది వ్యావహారిక సత్యతా వాదము (Phenonem Zenon Theory) అనఁబడును. మండనుని వాదము పై వాదము నొప్పుకొనదు. బాహ్య వస్తువులు సాక్షి చైతన్య వృత్తులు.

ఈశ్వరుఁడు జీవాధికుఁడు. నాల్గవ వాదము అవిద్య లే దనును. ఉన్నచో, రెం డవస్థలు సత్య మని అంగీకరింపవలసి వచ్చును. జ్ఞానము, అజ్ఞానము. కాన, అవిద్యకు ప్రత్యేక ప్రతిపత్తిస్థితి అంగీకరింపరాదు. బ్రహ్మ నిత్యము. అవిద్య వంధ్యాసుతప్రాయము అనఁగా-లేనిది. వివిధ అద్వైత సంఘలు అన్నియు స్థూలముగా సంసార దుఃఖ కారణము అవిద్య యనుచున్నవి. అనాది యయినను, అవిద్య సాంతము. ముక్తియం దవిద్య లేదు. అద్వైత వేదాంతమునందలి అవిద్యా సిద్ధాంతము. ద్వైత వాదముల అసంపూర్ణత్వమును చూపును. కాని, అవిద్య అనిర్వచనీయము.

భగవద్రామానుజులు తమ శ్రీభాష్యమున లఘు సిద్ధాంత మహా సిద్ధాంతములందు ఈ యవిద్యా వాదమును నిశితముగ విమర్శించిరి సప్తవిధానుపపత్తు లనఁబడు ఈ విమర్శ – తర్క– జటిలమై, విద్వన్మనోరంజకమై యలరారుచున్నది. (1) ఆశ్రయానుపపత్తి (2) తిరోధానానుపపత్తి (3) స్వరూపానుపపత్తి (4) అనిర్వచనీయానుపపత్తి (5) ప్రమాణానుపపత్తి (6) నివర్తకానుపపత్తి (7) నివృత్తి అనుపపత్తి అనునవియే సప్తవిధానుపపత్తులు. వీని వివరణ మిది

### *(1) ఆశ్రయానుపపత్తి :-*

అవిద్యాకల్పన నిరాధారము. మాయావాది అవిద్య కధిష్ఠానమును చూపించి, మాధ్యమిక శూన్యవాదము నుండి తప్పించుకొనఁ జూచుచున్నాఁడు జీవ బ్రహ్మలు అవిద్యాశ్రయములు కాఁజాలవు. అవిద్యాకార్యమగు జీవుఁడు అవిద్యాశ్రయము కాదు. సర్వదా స్వప్రకాశమగు బ్రహ్మ - అవిద్యాభిభూతము కాదు. అవిద్యాశ్రయము జీవుఁడని, జీవుఁ డవిద్యాశ్రయుఁడని అనుట అన్యోన్యాశ్రయ నిగ్రహ

స్థాన మగును. అద్వితీయ చిన్మాత్ర బ్రహ్మ మెట్లు ద్వైత వ్యూహ మున చిక్కు వడెనో, తెలియరాని సమస్య. ద్రవ్య ఆశ్రయ సిద్ధాంత ముల నిరసించు అద్వైతము వానినే తాను ఉపయోగించుట అనుచి తము. నిరాశ్రయమగు అవిద్య లేనిదే.

## (2) తిరోధానానుపపత్తి :-

బ్రహ్మ తిరోధాన మసంగతము. బ్రహ్మ జ్ఞాన స్వరూపము స్వప్రకాశము. బ్రహ్మ శుద్ధచైతన్యమా ? కాదా ? శుద్ధ చైతన్య మైనచో, అవిద్యాభిభవనాఽసర్హ్యము, తిరోహితము కాదు. అభిభూత మైన స్వరూప నాశమే అగును. ఎట్లు స్వప్రకాశమగు చిన్మాత్ర బ్రహ్మము అవిద్యా తిరస్కృత మగునో, అద్వైత వేదాంతము చెప్పదు, చెప్పలేదు. ఇది గొప్ప లోపము.

## (3) స్వరూపానుపపత్తి :-

అవిద్య నిజమా ? అబద్ధమా ? భావ (Entity) రూపమైనచో, బ్రహ్మయందు మూలావిద్యగ మిగులును. అది నశింపదు. రెండు సత్యములు – బ్రహ్మ, అవిద్య ఉన్నచో, అద్వైతము సిద్ధింపదు. అవిద్య లేనిచో- మూలావిద్య ఒకటిగాను, పెక్కుగాను లేనే లేదు.

## (4) అనిర్వచనీయానుపపత్తి :-

సదసదనిర్వాచనీయ మనుట అర్థ రహితము. బాలిశ భాషితము. అనిర్వాచనీయమగు అవిద్య బ్రహ్మను ఆవరించిన, అది జ్ఞాన బాధ్యము కాదు. అనిర్వాచనీయ మనుటలో అతి వినయము సూచితము. అన్ని సిద్ధాంతముల కాదని అద్వైతులు తమ సిద్ధాంతము చెప్పక తప్పించు కొనుట హాస్యాస్పదము. అవిద్య అసత్య మనియు, భ్రమ యనియు చెప్పి, గట్టిగ అడిగినపుడు అనిర్వచనీయ మని అద్వైతు లందురు.

### (5) ప్రమాణానుపపత్తి :-

అవిద్య శాస్త్రసిద్ధము కాదు ఇతర ప్రమాణ సిద్ధము కాదు. భ్రమ అసాధారణ మానసిక ప్రవృత్తి వేదాంత శాస్త్రమునకు నాంది కాజాలదు. అసత్యము, నాస్తి అనుపదములు - సత్యము, అస్తి అను పదములకు ప్రతియోగులు. అవి అసత్య, అభావ పదార్థములు సూచింపవు. జడ పదార్థముల సూచించును.

### (6) నివర్తకానుపపత్తి :-

ఈ యనుపపత్తి - అవిద్యాబాధ్య మను వాదమును విమర్శించును.

'జ్ఞానరూపం పరం బ్రహ్మ, తన్నివర్త్యం మృషాత్మకమ్
అజ్ఞానంచే త్తిరస్కుర్యాత్, కః ప్రభుః తన్నివర్తకః."

అని పూర్వాచార్య సూక్తి. జ్ఞాన మవిద్యను బాధింపజాలదు. జ్ఞాన మజ్ఞాన ఫలము కదా ! ఆధ్యాత్మిక నియమములచే తప్ప. బ్రహ్మైకత్వ విజ్ఞానముచే, అవిద్య బాధ్యము కాదు. బ్రహ్మ నిత్యమై, శాశ్వతమై, ఎల్లప్పుడు ఉన్నవాడైనచో, అవిద్య లేని దైనచో - ముముక్షుత్వ మను మాట అర్థ రహిత మగును.

### (7) నివృత్త్యనుపపత్తి :-

ఈ నివృత్త్యనుపపత్తి - అద్వైత మోక్ష సిద్ధాంత విమర్శయే. అద్వైతుల బ్రహ్మజ్ఞానము బ్రహ్మను గురించిన జ్ఞానము కాదు, బ్రహ్మమే యగు జ్ఞానము. జ్ఞాన మజ్ఞానమును బోధించి, తానుకూడ నశించును అందురు. అటులయిన, జ్ఞానము ఆధ్యాత్మిక ఆత్మహత్యయే. అవిద్యా తిరోధానముతోబాటు - జగత్తు ఈశ్వరుడుకూడ తిరోహితము లగును. అద్వైతము శూన్య వాదప్రాయమే యగును,

## సగుణ నిర్గుణ బ్రహ్మలు

అద్వైత వేదాంత మొక్కటియే సగుణ నిర్గుణ బ్రహ్మల ప్రతిపాదించును. ఆనందమయ బ్రహ్మము సగుణము. భాస్కరు డీ విభాగము నొప్పుకొనడు. తైత్తిరీయోపనిషత్తు బ్రహ్మ మానంద మనును. అనందమే బ్రహ్మ యనుటలోగాని, ఆనందమయుడు బ్రహ్మ యనుటలోగాని న్యూనత, ఆధిక్యత లేవు. మొదటి వాని కంటెను రెండవది తక్కువ కాదు. 'ఆనందం బ్రహ్మణో విద్వాన్' (తై ఆ) అను కావున, ఉపనిష ద్వచనము బ్రహ్మజ్ఞానముతో మొదలై, బ్రహ్మానందము జీవిత పరమ పురుషార్థ మని నిగమనము సూచించును. కావున, సగుణ నిర్గుణ భేదము ఇట వ్యర్థము. నిర్గుణ శ్రుతులు బ్రహ్మకు హేయ గుణములు లేవని చెప్పును. నిఖిల హేయ ప్రత్యనీకమే బ్రహ్మ యని చెప్పును. సకల కల్యాణ గుణ పరిపూర్ణుడు బ్రహ్మ యని సగుణ శ్రుతుల తాత్పర్యము. ఘటక శ్రుతు లీ రెంటికిని సామరస్యము నొడగూర్చును. బ్రహ్మ కల్యాణ గుణ పరిపూర్ణుడని చెప్పి, తరువాత వానిని తొలగించుట శ్రుతి తాత్పర్యము కాదు. 'నేతి' పద్ధతి తర్కము బ్రహ్మను సాధింపదని మాత్రమే యనును. శాంకర వ్యావహారికాద్వైతము విశిష్టాద్వైత సగుణ బ్రహ్మోపాసన సదృశములే. శ్రీ శంకరులు అద్వైత వాదము కంటె చాల గొప్ప వ్యక్తి. బ్రహ్మ ధ్యానపరము ఆధ్యాత్మిక నియమ సంపూర్ణ మగు వ్యావహారికాద్వైతమున శ్రీ శంకరులు శుద్ధ అద్వైత సిద్ధాంతమును త్రోసిరా జనిరి. 'సూత్ర భాష్య' కర్తకంటెను 'భజగోవింద' కర్త గొప్పవాడు.

శ్రీ శంకరులు తమ వ్యావహారికాద్వైతమున బాదరాయణుల సిద్ధాంతము నంగీకరించి, శూన్య వాదుల 'నేతి' సిద్ధాంతమును నిరసించినచో, అప్పు డద్వైతము విశిష్టాద్వైతమునకు దూర సిద్ధాంతము

కాదు. శంకరులు పారమార్థిక (బ్రహ్మ), వ్యావహారిక (జగత్), ప్రాతిభాసిక (రజ్జుసర్ప) సత్య త్రయమును ప్రతిపాదింతురు. కాని, 'బొసాన్ క్వే' (Bosanquet) అను పాశ్చాత్య తాత్త్వికుడు 'లాజిక్' (Logic) అను తన గ్రంథమున, సత్య వైవిధ్యమును నిరసించెను. *

శ్రుతుల ప్రమాణము లనవలసివచ్చును. సగుణ శ్రుతులే ప్రమాణము లన్న, నిర్గుణ శ్రుతు లప్రమాణము లగును. ఘటక శ్రుతు లాధారముగ, నిర్గుణ శ్రుతులు బ్రహ్మ సకల కల్యాణ గుణాకరుడని చెప్పననియు సమన్వయము చేసిన విశిష్టాద్వైతము చాల గొప్ప సిద్ధాంతము. దీనివలన, వేద మంతయు ప్రామాణిక మగును. ఇది సమంజస మగు సిద్ధాంతము. అద్వైత శ్రుతులు బహుత్వమును నిషేధింపవు.

జీవులలో బ్రహ్మ అంతర్యామిత్వేన సర్వ జీవైక్యమును సూచించును. ఇంతియే.

సగుణ బ్రహ్మము, విదేహ ముక్తి, సత్యార్థ ఖ్యాతి విశిష్టాద్వైత ముఖ్యసిద్ధాంతములలో కొన్ని. అద్వైతుల వివర్త వాదము, ఏక జీవ వాదము, నిర్గుణ బ్రహ్మము అనిర్వచనీయ ఖ్యాతియు విశిష్టాద్వైతుల కనభిమతములు.

అద్వైతుల వివర్త మనఁగా - 'వస్తునః తదసమ సత్తాకో అన్యథా భావః' అని అప్పయ్య దీక్షితులవారి నిర్వచనము. ఒక వస్తువు మఱియొక వస్తువుగా మారినపుడు, కారణ సత్త కార్యమున నుండదు. బ్రహ్మ జగత్తుగా వివర్తించును. (త్రాఁగునందు పామువలె) (Capprent Transformation) నిజముగా బ్రహ్మ జగత్తుగా మారదు. ఆ భాస

* There are no degress of truth and not in the end or in the end & not in nothing which is truth in the begining and the begining.

— *'Logic' Vol . 2 p 281.*

మాత్రమే మార్పు. 'వస్తు నః త త్సమ సత్తాకో అన్యథా భావః పరిణామః' (Real Transformation) ఇట వస్తువు నిజముగా పాలు పెరుగు వలె మారును. కారణ సత్త కార్యమున నుండును. పరిణామము వలన కార్య దోషము లు కారణమును కాపాదింపవు. జగత్తు - అచిత్ బ్రహ్మ శరీరభూతమే కదా! అంతర్యామిత్వేన నుండు పరమాత్మకు అచిద్దోష మాపాదింపదు.

మఱి కొన్ని ముఖ్య విషయము లేవన, బ్రహ్మ జగదాధారుఁడు గను, నియంతగను. రక్షకుఁడుగను, శేషిగను, భువన సుందరుఁడుగను (aesthetic absolute) శరీరిగను, అనఁగా - చిదచిత్ శరీరుఁడుగను భావింపఁబడుచున్నాఁడు.

## భక్తి యోగము (Devotion)

భక్తి యోగము యమ నియమ ఆసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధి రూప మగు అష్టాంగములతో కూడినది, తైలధార వలె అవిచ్ఛిన్న స్మృతి సంతానరూపమైనది. ముక్తి మార్గమున కర్మ జ్ఞాన భక్తి యోగములు మూఁడు మెట్ల వంటివి. కర్మ యోగ మనఁగా - నిష్కామ కర్మ.

"కర్మణ్యే వాధికార స్తే, మా ఫలేషు కదాచన "

ఫలాభిసంధి రహిత మగు కర్మ చేయు మని గీత శాసించు చున్నది. జ్ఞాన యోగము ఆత్మ సాక్షాత్కారఫలము, ఇందు ప్రేమ మృగ్యము. 'ఉపాసన' లేక భక్తి ధ్రువానుస్మృతి, నమస్కార త్యాగ సమన్వితము, అహంకార రహితము, భగవ ద్విశ్లేషాఽసహము. మహనీయ విషయమునం దలి ప్రీతియే భక్తి. కర్మ జ్ఞాన యోగములు భక్తి యోగము ద్వారా ముక్తిని సాధించును. భక్తి యోగము సాక్షాన్ముక్తి సాధనము. అరవిందుఁడు భక్తిని గుఱించి తన గీతలో

(V I I p 144) వివరించుచు - 'ఆత్మ పరిపూర్ణత నందుటకు మకుటాయమైన సాధనము భక్తి' యని నిర్వచించినాఁడు.

ప్రతి దర్శనము నిశ్శ్రేయస ప్రాప్తినే కాంక్షించును. ప్రస్థానములు మాత్రము భిన్నములు. భగవద్రామానుజులు భక్తి మార్గమును బోధించిరి

"చోదనా లక్షణోఽర్థో ధర్మః."
'ఇత్థం కరు' - 'ఇత్థం మా కార్షీః.'

అను వేదానుశాసనముచే విశ్వసింపఁబడిన వైదిక ధర్మాచరణమే జీవిత పరమావధి యని మీమాంసక మతము.

అద్వైతము జ్ఞాన మార్గము నవలంబించును. కాని, శ్రీ శంకరులు తమ 'వివేకచూడామణి'లో -

"మోక్షసాధన సామగ్ర్యాం భక్తి రేవ గరీయసీ."

అని సూచించినారు. బ్రహ్మ సూత్రములు, భగవద్గీత భగవద్రామానుజ సిద్ధాంతమునకు ఉపోద్బలకము లనియు, శ్రీ శంకరుల సిద్ధాంతమును ఉపనిషత్తులు బలపరచుననియు చెప్పు నవీన దార్శనిక విమర్శకుల వక్కాణ సమంజసము కాదు. ఏలన, భగవద్రామానుజుల సప్తవిధానుపపత్తులు ఈనాఁటికిని ఏ అద్వైతిచేతను నిరాకరింపఁబడలేదు. భజగోవిందకర్త యగు శ్రీ శంకరుల భక్తి పారవశ్యము నెవ్వరును కాదనఁ జాలరు. శంకరభగవత్పాదులు మాయావాదు లనుటకంటె, బ్రహ్మవాదు లనుట యుక్తమేమో !

విశిష్టాద్వైత వేదాంతము — ఔపనిషద బ్రహ్మసూత్రోదిత పరబ్రహ్మము, భగవద్గీతోక్త వాసుదేవుఁడు, పాంచరాత్ర ప్రోక్త

భగవానుఁడు, ఆళ్వారుల అర్చా రూపము ఒక్కటియే యని స్థాపించినది, భక్తియోగము బ్రహ్మప్రాప్తికి సాక్షాత్ సాధన మని కూడ సిద్ధాంతీకరించినది. సగుణ బ్రహ్మోపాసన జన సామాన్యమున కనియు, నిర్గుణ బ్రహ్మము విద్వాంసుల కొఱకనుటయు అనుచితము. ద్వంద్వ ప్రమాణము పాండిత్య ప్రదర్శక నిగ్రహ స్థానము (Learned-error). సత్యముగ నబద్ధము (Truelie). భక్తిరూపాపన్న జ్ఞాన సిద్ధాంతముచే, భగవద్రామానుజులు అందఱను మెప్పించిరి, ఆకర్షించిరి. విశిష్టాద్వైత భక్తికి సాధన సప్తక మవసరము. అద్వైతుల సాధన చతుష్టయము కంటె నిది వేరైనది. శాంకర, రామానుజ భాష్య నాందీ (ప్రతిజ్ఞా) వచనములు వారి వేదాంత సిద్ధాంతములను సూచించును. శారీరక మీమాంస ప్రయోజనము, అధ్యాస నిరాస ద్వారా బ్రహ్మాత్మైక్యము నెఱుంగుట. ఇది శాంకర మతము.

భగవద్రామానుజ శ్రీ భాష్యమున బ్రహ్మము జీవ శరీరుఁడనియు, ప్రాపకుఁడు - ప్రాపకము అనియు, సాధన సప్తకము భక్తి సాధన మనియు వక్కాణ. వివేక, విమోక, అభ్యాస, క్రియా, కల్యాణ, అనవసాద, అనురుద్ధర్ష ములు సాధన సప్తక మనఁబడును. ఇవి భక్తి సాధనములు. ధ్యాన మనగా - ఏకాగ్ర చిత్తత. ధ్యానమే, వేదనమే ఉపాసన, తైలధారవలె అవిచ్ఛిన్న స్మృతిసంతానరూపము. పరమాత్మ దర్శన సమాకారి మగుట - ఈ భక్తికి ఫలము. 'శేషి' నుపాసించి, శేషము 'సోఽహం' నుండి 'దాసోఽహము'నకు అధిగమించును. ఇది జీవన్ముక్తి కంటెను ప్రశస్త తరము. 'జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్' అని చెప్పినట్లు, భగవంతుఁడు భక్తుని తిరిగి ప్రేమించి, భగవద్భక్తికి ఫలమును భక్తున కొసంగు చున్నాఁడు. ఇది పరమైకాంత భక్తి.

## ప్రపత్తి (Self Surrender)

కలి యుగమున భక్తి యోగము కూడ కష్ట సాధ్యమే. ఇది (Conation, Cagnition, fealing) కర్మ జ్ఞాన భోగ సమన్వయము ద్వారా భక్తిరూపాపన్న జ్ఞానమునకు దారితీయును. ఈ ప్రపత్తి వేదాంతమునకు క్రొత్త కాదు. న్యాసవిద్య యనఁబడు ఈ ప్రపత్తి సూత్రకారోపదిష్టమే, శ్రీ శఠకోప మునీంద్ర ప్రసాదితమే. పశ్చాత్తాపము, హృదయ పరివర్తన, రక్షకుని యందు మహా విశ్వాసము ప్రపత్తికి కావలసినవి. ప్రపత్తి ప్రారబ్ధ కర్మను దహించును. సర్వ వర్ణములవారికి నిది ఆచరణ యోగ్యము. సర్వాధికారత్వము, సుకరత, సకృత్, కర్తృవ్యత, అవిలంబ ఫలత్వము దీని గుణములు. మూల (తిరు) మంత్ర, ద్వయ, చరమ శ్లోకములు ప్రపత్తి అంతరార్థ ద్యోతకములే భగవంతునికి ఆత్మ నివేదనమే ప్రపత్తి.

"న ధర్మ నిష్ఠోఽస్మి న చాత్మవేదీ
న భక్తిమాన్ త్వ చ్చరణారవిందే
అకించనో ఽనన్యగతి శ్శరణ్యం
త్వ త్పాదమూలం శరణం ప్రపద్యే."

అను శ్రీ యామునాచార్య స్తోత్రరత్నసూక్తి - ప్రపత్తి హృదయము నావిష్కరించును. శ్రీ భగవ ద్రామానుజులవారి శరణాగతిగద్య ప్రపత్తిమయము.

"సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ
అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః."

అను గీతాచార్యసూక్తి ప్రపత్తి సారభూతమైనది,

"యమే వైష వృణుతే తేన లభ్యః."

అన్నట్లు ఈ ప్రపత్తి కూడ భగవత్కటాక్ష సాధ్యమే. కర్మత్యాగ మనఁగా - 'అహంకార బుద్ధితో కర్మ చేయరాదు' అని తాత్పర్యము. విధి విహితమగు కర్మ - నిరాసము కాదు. భగవంతుఁడు ప్రాప్యము, ప్రాపకము, ఉపాయము, ఉపేయము అని తెలియనగును.

ప్రపత్తికి ఆఱు అంగము లున్నవి. 1) ఆనుకూల్య సంకల్పము 2) ప్రాతికూల్య వర్జనము 3) మహా విశ్వాసము 4) కార్పణ్యము 5) గోప్తృత్వ వరణము 6) ఆత్మ నిక్షేపము. ఆరవది అంగి, మిగిలిన ఐదును అంగములు అని కూడ అందురు. ప్రపత్తి ఫల సమర్పణ, భర సమర్పణ, స్వరూపసమర్పణరూపమైనది. శ్రీమద్రామాయణము శరణాగతి వేద మనఁబడును. విభీషణ శరణాగతి శ్రీరామునిచే అభయప్రదానము, తదంతర్గత మగు ఉపనిషత్తు - ఉపక్రమ, ఉపసంహార, అభ్యాస, అపూర్వత్వ, అర్థవాద, ఉపపత్తులను ఆఱు మీమాంసా సూత్రముల ఉపనయము ద్వారా జీవుని శరణాగతి పరమ హితము. మానుష, పశు, పక్షి, మృగాదులు, దేవ - అసురాదులునైతము భగవత్పాదముల వద్ద శరణాగతి చేసిన, రక్షింపఁబడుదురు. కాకాసుర, అహల్య, గజేంద్ర, సుగ్రీవ, విభీషణశరణాగతి వృత్తాంతములు - భగవంతునిచే వారికి అభయ ప్రదానములు జగద్విదితములు గదా ! ఇట్లు ప్రపత్తి సులభోపాయము. ప్రపత్తికి దేశ కాల నియమము లేదు. ఏకవస్త్ర రజస్వల యయ్యు, ద్రౌపది శ్రీకృష్ణుని శరణుజొచ్చి రక్ష నందినదిగదా !

## శ్రీభాష్య మతము - ఉభయ వేదాంతము

.. శారీరక శాస్త్రమునకు ఒక క్రొత్త అర్థమును మహామహోపాధ్యాయ - కపిస్థలం దేశికాచార్యులవా రిచ్చిరి. 'ప్రతి అధికరము

తత్త్వశాస్త్ర రీత్యా, ఏ బ్రహ్మమైతే సర్వ చిదచిన్మూలమో, ఆ బ్రహ్మమే మానవుని మతపరమైన ఆరాధ్య దైవము' అని యాశయము. ప్రతి అధికరణము కేవల తర్కానుగృహీత మగుటయే గాక, మానవునికి ఆధ్యాత్మిక మతపరమైన తృప్తి నిచ్చును. ఈ సమన్వయ సూత్రదృష్టి, వేదాంత సూత్రములు కేవల సిద్ధాంత పరము లగు శాస్త్ర సిబరీ సము లగు విశిష్టాద్వైత ప్రవచనములనియు, శ్రీనమ్మాళ్వారుల భగవద్విషయము అనుష్ఠాన పర మగు ఆధ్యాత్మిక అనుభవ మనియు ప్రచలితమైన సాధారణాభిప్రాయమును సరిదిద్ది, విశిష్టాద్వైతము ఉభయ వేదాంత మని సాధించును. వేదాంతదేశికులు తమ సూత్ర సమన్వయ దృష్ట్యా, ప్రతి అధికరణము భగవద్గుణానుభవమే, శ్రీ శఠకోప మునీంద్రుల 'తిరువాయిమొళి' వంటి భక్త్యమృత వర్షమే యని విశదపఱచుట ఒక విశేషము. తర్కానుగృహీత మగు తత్త్వము, తర్కప్రమాణసిద్ధ మగు తత్త్వము, ఆధ్యాత్మిక మత పరమయిన విలువలుగల తత్త్వము నొక్కటియే. 'వేదాంతము - మతము' (Philosophy of Religion) అను దానికి ఒక క్రొత్త యర్థమును దేశికులు సూచించిరి. తమ న్యాయసిద్ధాంతమార్తాండమున, స్వామి ప్రతి అధికరణము ఒక కల్యాణ గుణమును - ఒక తత్త్వశాస్త్ర సత్యమును మేళవించి, ఋజువు చేయునని సాయించిరి. నారాయణుడే శ్రీనివాసుడు. వేదాంతసూత్రములందలి 156 అధికరణములు భక్తిచే కూర్చబడిన 156 భగవత్కల్యాణ గుణ రత్నముల మాల ద్వాత్రింశత్ (32) ఔపనిషద విద్యలు బ్రహ్మయొక్క సత్య, జ్ఞాన ఆనంద, అనంత, అమల గుణోపాసనాత్మకములే. బ్రహ్మ సూత్రముల శుద్ధ విశిష్టాద్వైత తర్క తత్త్వము భగవద్విషయ భక్తి తత్త్వమొక్కటియే యని పిండితార్థము.

## ముక్తి (Liberation)

మోక్షము పరమపురుషార్థము పరిపూర్ణ బ్రహ్మానుభవము. ఇందు అనిష్ట నివృత్తి, ఇష్ట ప్రాప్తి ఉన్నవి. భగవన్నిగ్రహ నివృత్తియే అనిష్ట నివృత్తి. అనఁగా - సర్వ కర్మ నివృత్తి. ఇష్ట ప్రాప్తి యనఁగా - స్వాభావిక జ్ఞాన వికాస లాభము, జ్ఞాన సంకోచ నివృత్తి యనియు చెప్పఁదగును. ముక్తావస్థలో - అపహత పాప్మత్వాది గుణముల విషయములోను, ఆనందము విషయమునను సామ్యము జీవబ్రహ్మల కున్నది. అయితే, త్రాసులో నుంచిన సువర్ణ - పాషాణములకు వలెనే, 'భోగ మాత్ర సామ్య లింగాత్', 'జగ ద్వ్యాపార వర్జం' అను సూత్రములచే ముక్తునికి పరబ్రహ్మతో భోగసామ్యమున్నది. జగ ద్వ్యాపార నియమనములు లేవు.

లోకమున ఉత్తము లగు స్వామి భృత్యులు ఆత్మ సంపదలు పరస్పరార్థమే అని భావించునటుల, భగవంతుఁడు కూడ సర్వము ఆశ్రిత భక్తార్థమే యని తలంచును. భక్తుఁడు తన సర్వస్వము భగవదర్థ మని భావించును. ఇట్లు ఉభయులు నిరతిశయ సౌహార్ద యుతులు.

'సేవ దుఃఖ హేతువు' అను కుయుక్తి ఇట అనవసరము, అప్రస్తుతము. భగవత్సేవ పరార్థైక ప్రవణ మనస్తత్వము కనుక, నిరతిశయానుకూలము, ముక్తుని భగవత్కైంకర్యము, నిరతిశయానందము, సాయుజ్య మోక్షము ప్రశస్త తరము. కైవల్యము స్వాత్మానుభవ మాత్ర రూపము, అనభిలషణీయము.

ముక్తుఁడు స్వరాట్ అగును. అనఁగా - అకర్మవశ్యుఁ డగును. స్వేచ్ఛగా సర్వలోక సంచారి యగును. కర్మ వశుఁడై కాడు. స్వసంకల్ప బలముచే సదేహుఁడు, విదేహుఁడు, అనేక దేహుఁడు

కాఁగలఁడు. జగ దనుగ్రహము కొఱకు భరత, బలభద్రాదులవలె నవతరించును. అమేయ మగు ఆనంద మనుభవించును. 'న చ పునరా వర్తతే' ఇత్యుక్త రీత్యా, మఱల కర్మబద్ధుఁడు కాఁడు. అత్యర్థప్రియుఁ డగు జ్ఞానిని పొంది, భగవంతుఁడు తిరిగి వానిని సంసారమున ఆవర్తింపఁ జేయఁడు. ముక్త పురుషుఁడు కూడ నిరతిశయానందరూప సవిశేషణ భగవత్ వ్యతిరిక్త వస్తు నిరపేక్షుఁడై, తనంతట తాను సంసార బంధమున చిక్కుకొనఁడు.

శ్రీ రామానుజ మతము లోక వేదానుకూలము. సకల చిద చిదాకార నారాయణాఖ్య తత్త్వము ఏకము. చిత్త్వము జీవ రూపము. అచిత్తు సత్త్వరింశాత్మకము. భక్తి ప్రపత్తులు. హితములు, ముక్తి సాధనములు

## విశిష్ట విశేషము

'విశిష్టస్య విశిష్ట రూపేణ అద్వైతం' అని, విశిష్టాద్వైతపద వ్యుత్పత్తిని శ్రీవేదాంతి దేశికులు తమ 'న్యాయ సిద్ధాంజనము'న తెల్పిరి. కారణావస్థలో బ్రహ్మము మొదట నామరూపవిభాగానర్హ సూక్ష్మ చిదచి ద్విశిష్టము. అదియే కార్యావస్థలో - నామరూప విభాగ విభక్త స్థూల చిదచి ద్విశిష్ట మగును. ఇట్లు విశిష్టములైన బ్రహ్మములు రెంటికిని అద్వైతము అనఁగా - అభేదము గనుక, ఇది విశిష్టాద్వైత మనఁబడును.

"అవస్థాంతరాప త్తి రేవ హి కార్యతా."

అని సిద్ధాంతము. బ్రహ్మము స్వరూప పరిణామము నందురు, దోష రహితము. చిదచిత్తులే పరిణామము నందును, దోషము కలవి యగును.

సర్వ దర్శన సంగ్రహమున మాధవాచార్యులు

"ఈశ్వరః చిదచిత్ చేతి, పదార్థ త్రితయం హరిః
ఈశ్వరః చిదచిత్ ప్రోక్తః, జీవో దృశ్యం అచి ద్వపుః."

అను శ్లోకములో - విశిష్టాద్వైతమున ఈశ్వరుఁడు, జీవుఁడు, అచిత్ అను తత్త్వములు మూఁడు కలవని చెప్పిరి.

## ఈశ్వరుఁడు (God)

విశిష్టాద్వైత సిద్ధాంతమున శ్రీమన్నారాయణుఁడే పరతత్త్వము. ఆతఁడు లక్ష్మీ విశిష్టుఁడు, చిదచిత్ శరీరుఁడు, చిదచిదంతర్యామి. చిదచిత్తులు ఈశ్వరుని అపృథక్ సిద్ధ విశేషణములు. పరమ పదము సత్త్వమయము.

## జీవుఁడు (Soul)

జీవు లనేకులు, నిత్యులు. అణుస్వరూపుఁడు జీవుఁడు, జ్ఞానవంతుఁడు, పరమ పురుషాధీన సత్తకలవాఁడు. జీవుని జ్ఞానము స్వాభావికము. అయినను, కర్మానుగుణముగ సంకోచ వికాసములకు లోనగును. ముక్తావస్థలో వికసించును. బద్ధ - నిత్య - ముక్తులలో, నిత్య - ముక్తులు పరమపదవాసులు. అనంత గరుడ విష్వక్సేనాదులు నిత్యులు. ముండకోపనిషత్తులో -

"నిరంజనః పరమం సామ్య ముపైతి మమ సాధర్మ్య మాగతాః."

"ఉత్తమః పురుష స్త్వన్యః"

ముక్తులు భగవత్స్వరూపము నందుదు రని చెప్పఁబడినది.

## అచిత్ (Matter)

(1) ప్రకృతి (2) శుద్ధ సత్త్వము (3) కాలము అని, అచిత్తు మూఁడు విధములు ప్రకృతి - సత్త్వ రజ స్తమోగుణ యుతము;

జడము. ఇం దుండి మహ దహంకార, ఏకాదశేంద్రియాదులు కల్గును. చతుర్వింశతి తత్త్వము లున్నవి. సాంఖ్య మత మిట అంగీకృతము. (1) ప్రకృతి (2) మహత్ (3) అహంకారము (4) ఏకాదశేంద్రియములు (5) సూక్ష్మ పంచతన్మాత్రలు (6) పంచ భూతములు

## చతుస్సూత్రి పరమార్థము

వేదాంతసూత్ర సార మంతయు - మొదటి నాల్గు సూత్రము లలో నిమిడి యున్నది కనుక, వానినిఁగూర్చి తెలిసికొనుట ఎంతేని ఆవశ్యకము.

## *(1) అథాతో బ్రహ్మ జిజ్ఞాసా*

**'అథ'** - అటు తరువాత అని యర్థము. కర్మ విచారానంతర మని తాత్పర్యము. కర్మ ఫల మశాశ్వత మని తెలిసిన తర్వాత, శాశ్వత నిశ్శ్రేయస ఫలద మగు బ్రహ్మ జిజ్ఞాస కర్తవ్యము.

**'అతః'** - కర్మ విచార మల్పాస్థిర ఫలదము కనుక. బ్రహ్మ విచార కర్తవ్యము. ఏలన, బ్రహ్మ విచారమూలము. అనంత స్థిర ఫలదము. 'బ్రహ్మ' నిరతిశయోత్కృష్ట విశిష్టుడఁగు శ్రియఃపతిని గుఱించిన

**'జిజ్ఞాసా'** - వేదాంత వాక్యార్థ విచారాత్మక లఘుతర్కము కర్తవ్యము.

## *(2) జన్మాద్యస్య యతః*

ఎవని వలన జన్మాదులు కల్గుచున్నవో, ఆ బ్రహ్మ - జిజ్ఞాస్య మని అన్వయము.

"యతో వా ఇమాని భూతాని జాయన్తే, ఏన జాతాని జీవన్తి, య త్ప్రయం త్యభిసంవిశన్తి, త ద్విజిజ్ఞాసస్వ, త ద్బ్రహ్మేతి."

ఈ తైత్తిరీయోపనిషద ద్వాక్యములే ఈ సూత్రమున కాధారములు.

## (3) శాస్త్ర యోనిత్వాత్

వేద శాస్త్రము దేనికి ప్రమాణమో, అది శాస్త్రయోని. త ద్భావమే శాస్త్ర యోనిత్వము. బ్రహ్మ విషయమున శాస్త్ర ప్రామాణ్యము శాస్త్రేతర ప్రమాణాఽగోచరత్వమువలన సిద్ధించునని భావము.

## (4) తత్తు సమన్వయాత్

కుమారిల భట్టు ఇట్లు చెప్పెను.

"ప్రవృత్తి ర్వా నివృత్తి ర్వా నిత్యేన కృతకేన వా
పుంసాం యేనోపదిశ్యేత తత్ శాస్త్ర మభిధీయతే"

బ్రహ్మము సిద్ధవస్తువు. శాస్త్రము ప్రవృత్తి - నివృత్తి రూపముగాన శాస్త్రము బ్రహ్మ విషయమున అన్వయింపదు' అని ఆక్షేపము. దీనికి సమాధాన మిది - శాస్త్ర ప్రమాణకత్వము సిద్ధించును; బ్రహ్మ శాస్త్ర ప్రమాణకము. జ్యోతిష్టోమ యాగము వలె శాస్త్ర జన్య బోధానుకూలత్వము కల్గియుండు విషయ మగుట వలనను శ్రుతులు పురుషార్థములలో బ్రహ్మమును మించిన పురుషార్థము లేదని చెప్పుట వలనను, అనఁగా - బ్రహ్మ పరమ పురుషార్థ మనుట వలనను శాస్త్ర ప్రమాణ మగును.

## గీతా భాష్యము.

శ్రీ భాష్యము తరువాత గీతా భాష్యము భగవద్రామానుజ విరచిత ముఖ్య గ్రంథము. గీతా శాస్త్ర నైతిక, మత ప్రాముఖ్యత - శ్రీ భాష్యకార తర్క- శేముషీ విభవ తేజోద్దీప్తమై, శ్రీరంగనాథ భక్త భక్తిభావోద్వేగ పూర్ణమై, గీతా భాష్యమున విలసిల్లుచున్నది. భక్తిభావోద్వేగయుత సార్వజనీన మతమునుండి తత్త్వదర్శనోదయమును సాధించిన జయశీలి ప్రథమ భారతీయ తాత్త్వికుడు భగవద్రామానుజులే. భగవద్గీత ప్రామాణిక గ్రంథము. వైష్ణవ దర్శనములకు మూలాధారము. శాంకరదర్శనము కూడ గీతా నిరపేక్షము కాలేదు.

శ్రీ యామునులు తమ 'గీతార్థ సంగ్రహము'న, భక్తిసిద్ధాంతమును బోధించిరి. భగవద్రామానుజ ప్రోక్త శరీర శరీరి భావము గొప్ప సిద్ధాంతము. గీతా భాష్యము శ్రీభాష్యముతో శ్రుతి కలుపును. గీత స్మృతి, శ్రుతికి ఉపబృంహణము. శ్రీరామానుజులు గీతపై సమగ్రముగ వ్యాఖ్యానించిరి. ఉపనిషత్తులపై కాదు కాని, ఔపనిషద వైరుధ్యముల సమన్వయించిరి. గీతార్థ సంగ్రహము గీతాభాష్యమునకు మూలము.

శ్రీభాష్యమున గీతాశ్లోకము లుదహరింపబడినవి. శ్రీభాష్య, గీతాభాష్య భక్తి సిద్ధాంతములు సదృశములే. గీతాభాష్య సమీరిత పరబ్రహ్మ శ్రీమన్నారాయణుడే. గీతాచార్యుని హృదయము రామానుజ భాష్యముచే బాగుగ ఆవిష్కృతమైన దనుట నిర్వివాదము. వేదాంత పరబ్రహ్మము - సిద్ధాంత, మత పరమగు ఈశ్వర సిద్ధాంతము రామానుజ భాష్యమున సమన్వయించినవి. భక్తియే అనగా - ఈశ్వర ప్రేమయే మోక్షసాధనమని గీతాభాష్యసారము.

ఆధునిక పాండిత్యము కూడ భగవద్రామానుజులవలె గీతా హృదయము నావిష్కరింపజాలదని, శ్రీమద్రామానుజ గీతాభాష్యము ఆంగ్లములో ననువదించిన 'వాన్ బుటినెన్'(Van Buitenen) పండితు అభిప్రాయము. గీతాచార్యులచే నారంభింపఁబడిన 'తాత్త్విక దర్శన మత' సామరస్యము, సమన్వయము శ్రీరామానుజులచే సఫలీకృతము గావింపఁబడినది.

## భువన సుందర మూర్తి

భగవద్రామానుజులు యాదవ ప్రకాశుల యొద్ద అంతేవాసి యున్నప్పటి విశిష్ట సంఘటన యొకటి యతిసార్వభౌమ శేముషీ విభవమునకు ఉజ్జ్వలమగు దృష్టాంతముగా చెప్పనొప్పును. యాదవప్రకాశు 'తస్య కప్యాసం పుండరీక మేవ మక్షిణి' అను ఛాందోగ్య ఉపనిషద్వచనమును వ్యాఖ్యానించుచు, మర్కట పశ్చాద్భాగమువలె, పురుషోత్తముని కన్నులు ఎఱ్ఱగా నున్నవని యర్థము చెప్పెను. రామానుజులీ యర్థ మనుచిత మని ఉద్ఘాటించి, ఈ క్రింది విధముగ సరియైన అర్థమును వక్కాణించిరి :-

"గంభీరాంభ స్సముద్భూత సుమృష్ట నాళ రవికర వికసిత పుండరీక దళామలాయతేక్షణః."

లోతు నీటిలో పుట్టి, బాగుగా పుష్టి నందిన కాడ గల్గి, కిరణములచే వికసింపజేయబడిన కమలము (సితాంభోజము) వంటి నిర్మలమైన కన్నులు కలవాడు. 'కప్యాసం' శబ్ద వ్యుత్పత్తి ఇది. కం = జలం పిబతి = త్రాగువాడు. కపిః = సూర్యుడు. తేన అసత = ఆ రవి వికసిత మగు పుండరీకము. (కం=ఉదకం, ప్యాసం ఆసనం ఉద్భవో వా యస్యేతి = నాళం తస్మిన్ ఆసనం యస్యేతి.' ఈ యర్థము సర్వాంగ సుందరము. తర్క వ్యాకరణానుగృహీతము. విశిష్టాద్వైత సిద్ధాంత

నుసారముగ బ్రహ్మ భువనసుందరమూర్తికదా! భాగవత హృదయము కూడ నిదియే.

"తేషా మావిరభూత్ శౌరిః, స్మయమాన ముఖాంబుజః
పీతాంబర ధరః స్రగ్వీ, సాక్షాత్ మన్మథ మన్మథః."

అని, శ్రీకృష్ణ పరబ్రహ్మ దివ్య మంగళ విగ్రహ మభివర్ణితము

"పుంసాం మోహన రూపాయ
పుణ్య శ్లోకాయ మంగళమ్."

అని, శ్రీరాముని దివ్యసుందర విగ్రహము మధుమయఫణితీ మార్గదర్శియగు వాల్మీకి మహర్షిచే వర్ణింపబడినది. తదనుగుణమే శ్రీరామానుజులచే చెప్పబడిన శ్రుత్యర్థము. ఇది ఉపనిషదము కూడ. ఏలన, బ్రహ్మ నిఖిలహేయ గుణ ప్రత్యనీకుఁడుగదా!

"య ఏషో అంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే. ఆ ప్రణఖాత్ సర్వ ఏవ హిరణ్మయః హిరణ్య కేశః హిరణ్య శ్మశ్రుః."

అని శ్రుతి - హేమ సుందరుఁడుగ బ్రహ్మను అభివర్ణించినది. 'బ్రహ్మ జ్యోతిషాం జ్యోతిః' అని ముండకోపనిషద్వర్ణన, బృందావనము నందలి త్రైలోక్య కాంత శ్రీకృష్ణరూపము శ్రీమద్భాగవతమున అభివర్ణితము. వేదాంతాలంకార శాస్త్రములకు సాన్నిహిత్య మున్నది. శ్రీ నమ్మాళ్వారుల భగవ త్సౌందర్య రసానుభూతి ఇట అనుసంధేయము. ఈభగవ త్ప్రేమ పరిశుద్ధము, మహోన్నతము, భక్తి పరాకాష్ఠ, శృంగార రసము రసరాజ్ఞి. ఆండాళ్, రాధల విషయమున ఈ శృంగార రసము భక్తిగా పరిణతి నందినది. భౌమవిషయ కామము, భక్త భగవ త్కామ రూప పరిణామము నందినది. శృంగార రసము బ్రహ్మ రసము బ్రహ్మ

నందముగా పరిపక్వమై, ధన్యత గాంచినది. మిథునానందము కన్న బ్రహ్మానందము శత సహస్రాధిక మని ఔపనిషద సూక్తి. బ్రహ్మానందము నిరుపమానము, విషయ కామముల కంటెను భగవ త్ప్రేమ గొప్పది. ఔపనిష దానందవల్లి, భూమవిద్య మధువిద్యలందు ఈ భగవ ద్రతి, ప్రీతి, భక్తి అనుత్తమ కావ్య ఫణితిలో వర్ణింపబడినది. తైత్తిరీ యోపనిషత్తులో -

"ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్ ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే. ఆనందేన జాతాని జీవంతి. ఆనందం ప్రయం త్యభిసంవిశంతి.''

— (ఆనందవల్లి)

బ్రహ్మ ఆనందమయుఁ డనియు, సర్వప్రాణులు ఆనందమునఁ బుట్టి, జీవించి, ఆనందములో ప్రవేశించుచున్నవనియు దీని తాత్పర్యము.

ఈవిధముగా బ్రహ్మ - అనఁగా, శ్రియఃపతి భువనసుందర మూర్తి యని సిద్ధాంతీకరింపబడినది. గద్యత్రయమున భగవద్రామానుజులు ఈ యంశమునే స్తోత్ర రూపమున విశదీకరించిరి.

## సింహావలోకనము

భారతీయ తత్త్వశాస్త్ర సంప్రదాయానుసారముగ, భారతీయ దార్శనికులు పూర్వపక్ష వాదముల నిరసించి,స్వమతస్థాపన మొనర్చుట పరిపాటి. ఈ వాదావహము నిష్పక్షపాత బుద్ధితో, సభా మర్యాదానుసారముగ, పద వాక్య ప్రమాణ శాస్త్ర పద్ధతుల ప్రకారము జరిగెడిది. జూటుదనమున సభ లెక్క చొరవకాండ్రకు స్థానము లేదు. శేముషీ ప్రతిభా వ్యుత్పత్తులు, నైతిక - ఆధ్యాత్మిక విలువలు ఆనాటి వాదులకు కలవు. విజితుఁడు విజేతకు శిష్యుఁ డగుచుండెను. ఇది వారి నిజాయితికి ప్రబల నిదర్శనము బుద్ధ, శంకర, రామానుజ, పూర్ణ

ప్రజ్ఞ, చైతన్యాదులచే నొనర్పబడిన మతము యొక్క మార్పులు విజేతయందుగల గౌరవ, విశ్వాస ఫలములేగాని, బలాత్కృతములు కావు, హృదయ పరివర్తన జనితములు.

పూర్వ దర్శనములు కొన్ని అదృశ్యమగుటకు కారణము భాస్కరుని భేదాభేద సిద్ధాంతములు వంటివి - అవి క్షోదక్షమములు కాకపోవుటయే. అద్వైత విశిష్టాద్వైత వేదాంతములు నేటికిని వ్యాప్తిలో నుండుటకు, వాని అంతస్సారము కారణము, పండిత పామర జన రంజకము లగుట కారణము. ఉజ్జ్వలమైన ఆచార్య పరంపర కల్గియుండుటచే, విశిష్టాద్వైతము కాల గర్భమున లీనము కాలేదు. ఇక ఈ మతవ్యాప్తి, ఈ మతానుయాయులపై ఆధారపడి యున్నది. శ్రీమద్రామానుజులు ప్రప్రథమాజ్ఞ - శ్రీ భాష్య పఠనము, ప్రవచనము, తత్ వ్యాప్తియే కదా! శ్రీ వేదాంత దేశికులు శ్రీ భాష్యము ముప్పదిసార్లు పఠించిరట!

విశిష్టాద్వైత ప్రమాణ సిద్ధాంతము శ్రుతి యుక్తుల సమన్వయించును. కేవల మూఢవిశ్వాసాత్మకము కాదు, శేముషీ స్ఫోరక మాత్రమే కాదు, మధ్యే మార్గము నవలంబించును. వేదము పరబ్రహ్మ ఆధ్యాత్మిక అపౌరుషేయ సత్య సమన్వితము, నిశ్వసితము, యుక్తి యుక్తము, క్రాంత దర్శుల అనుభవ సిద్ధము, శ్రుతి యుక్తి అనుభవము అపూర్వమగు కలయిక - వామదేవ, శ్వేతకేతు, బోధాయన, ప్రహ్లాద, నమ్మాళ్వారు ప్రాచీన సంప్రదాయ సిద్ధము. చిదచిత్తులు బ్రహ్మవలన అర్థవంతములు. సర్వ విజ్ఞానము యథార్థమే. భ్రమాది జన్య జ్ఞానమున నిజమున్నది.

బ్రహ్మము సగుణము. సద్గుణాలకు నిలయమై, సర్వవ్యాపి, సర్వాధారము, ఈశ్వరరూపి [illegible] నియంతయై, కర్మ [illegible]ల నను

భవింపఁజేయును. చిదచిత్తులకు, బ్రహ్మకు శరీర,శరీరి సంబంధ మున్నది. సర్వాంతర్యామి బ్రహ్మ.

చిదచి చ్ఛరీరుడు బ్రహ్మ. సత్కార్యవాదానుసారముగ సత్ పదార్థము నామ రూప వ్యాకరణము చేయుచు, సృష్టికి పూర్వము చిదచిత్తులు సూక్ష్మరూపమున బ్రహ్మలో నుండెను. సృష్టికి పూర్వము, తర్వాత చిదచిత్తులు బ్రహ్మప్రకారము లే.

జీవు లనేకులు, నిత్యులు, జ్ఞానవిశిష్టులు, అణుస్వరూపులు. జీవుని జ్ఞానము అనంతమైనను, సంసార దశలో కర్మబద్ధము. జీవుఁడు - విశేష్యము, విశేషణము, బ్రహ్మయొక్క అపృథక్ సిద్ధ విశేషణము, అంశ. జీవితమునందలి దుఃఖములు జీవుని అవిద్యవలన గల్గినవి.

బ్రహ్మ పరిశుద్ధుఁడు. బ్రహ్మ జీవుల జ్ఞానము సదృశము. సాంసారిక సాగరము దాటవలచిన తత్త్వవేత్త ముముక్షు వగుచున్నాఁడు. స్వర్గ భోగములు అస్థిరములు - కనుక, అతనికి సరిపడవు. భక్తి అతని పరమ సాధనము, కర్మ జ్ఞాన భక్తియోగములు సోపాన త్రయము. కర్మ యోగమున ఫలాభిసంధిరహితకర్మ - నిష్కామకర్మ యగును. (Renunciation in action and not of action).

వేదార్థసంగ్రహమున శ్రీమద్రామానుజులు - వర్ణాశ్రమ ధర్మానుగుణ కర్మాచరణము కర్తవ్య మని బోధించిరి. అయితే, భగవదర్పితముగ చేయవలెను. ఆగామికర్మ మన చేతిలోనిది. ప్రారబ్ధము అనుభోక్తవ్యము మొదట పురుష ప్రకృతి వివేకము. ఆంతర యోగాభ్యాసము రెండవది. వాసనల శాంతింపఁజేసి, సమాధిపరుఁడగును. ఇది ఆరూఢుని కైవల్య దశ. అనఁగా - ముక్తి ప్రాంగణము.

భక్తిలో స్వార్థము భగవదర్థ మగును. సాధన సప్తకము, అష్టాంగయోగము సహాయకారులుగ భక్తుడు ముప్పదిరెండు (32)

ఉపాసనారీతులలో నొకదాని ననుష్ఠించి, బ్రహ్మను స్వశరీరిగ ధ్యానించును. భక్తి ప్రీతిపూర్వక జననాంతర సౌహృదయత బ్రహ్మో పాసన. భక్తి - త్రైవర్ణికాధికారము ప్రపత్తి - సర్వాధికారము. పశు పక్షి మృగాదులకుగూడ ననుష్ఠేయము. భగవదనుగ్రహము నిర్వ్యాజ మనియు, సవ్యాజమనియు స్వల్ప సిద్ధాంతభేద మున్నది. 1. మార్జాల 2. మర్కట కిశోరన్యాయము లిట అన్వయించును.

(1) Justification by faith, 2 Justification by works) (1. Self Surrender Theory (2) volitional Theory)

శ్రీమన్నారాయణుడు ఉపాయము, ఉపేయము అను విషయ మున విప్రతిపత్తి లేదు. (God is Law & Love) నమ్మాళ్వారుల భగ వత్ తన్మయత్వము, పారవశ్యము భక్తి ప్రపత్తుల మేలు కలయిక, ఒక విశిష్టాద్వైతానుభవము. ఆళ్వారుల భగవద్విరహము శరీర శరీరి భావమునకు చక్కని వ్యాఖ్యానము. ఆత్మ లేక శరీర ముండదు. ఆత్మ, అంతర్యామి లేక ఉండదు ఆర్త ప్రపన్నుడు ముక్త ప్రాయుడు. బ్రహ్మ జ్ఞాన లక్ష్యము బ్రహ్మానందము. ఆ బ్రహ్మానంద లోకము జ్ఞాపనిషద వర్ణనాతీతము. కావ్య ఉపమా లక్షణా సామాగ్రీ సహా యమున దిజ్ మాత్రముగ సూచితము. ప్రపన్నుడు శేషికైంకర్యమున పరమ తృప్తుడగును. ఆళ్వారాచార్యులు క్రాంతదర్శులై, బ్రహ్మ సాక్షాత్కారము నందిరి.

## ఆక్షేప, సమాధానములు

1) పాంచరాత్ర, ప్రబంధములు అవైదికములుకాన, వానిని ప్రమాణముగా గొన్న విశిష్టాద్వైత మెట్లు ప్రామాణిక మగును?

తత్త్వశాస్త్రమున సత్యముయొక్క మూలముకన్న విలువ గొప్పది. పాంచరాత్రాగమము భగవద్వచనము, ఉపనిషత్సారము.

"కమ ప్యాద్యం గురుం వందే కమలా గృహమేధినమ్
ప్రవక్తా ఛందసాం వక్తా పాంచరాత్రస్య యః స్వయమ్."

అనునదియే ఇందులకు పరమ ప్రమాణము. కనుక, ప్రామాణికమే. శ్రీయామునాచార్యులు 'ఆగమ ప్రామాణ్యము'నందును, శ్రీవేదాంత దేశికులు 'పాంచరాత్రరక్ష' యందును ఈ పాంచరాత్రాగమము ప్రామాణిక మని బహు భంగుల నిరూపించిరి. దివ్య ప్రబంధము బ్రహ్మసాక్షాత్కారము నందిన క్రాంతదర్శుల యనుభవము గాన, వేదతుల్యమే.

(౭) అద్వయ పరబ్రహ్మము సగుణము, నిర్గుణశ్రుతులు హేయ గుణ అవధూననపర మనుట ఎట్లు పొసగును ?

నిర్గుణ వస్తువు ప్రమాణసిద్ధము కాదు. భావాతీతము. దార్శనిక మత మగు విశిష్టాద్వైతము - వేదాంత శాస్త్ర పరబ్రహ్మము, మత రీత్యా ఆరాధ్య దైవ మగు ఈశ్వరుడు ఒక్కరే యని ఉద్బోధించును. ఇద్దరు బ్రహ్మల నంగీకరింపదు.

(౮) శరీరి శరీర సిద్ధాంతమున బ్రహ్మ చిదచిద్విశిష్ట జగత్తునకు అభిన్న నిమిత్తోపాదన కారణ మెట్లగును? చిదచిత్తులు బ్రహ్మశరీరము, అవి జగదుపాదాన కారణమైన, పరమాత్మ నిమిత్తకారణ మేకదా ?

ఈ శంక తప్పు. విశిష్టాద్వైతము గణితశాస్త్రము కాదు. విశిష్టాద్వైత తత్త్వ మవగాహన చేసికొననివారి కుశ్శంక ఇది. సృష్టికి పూర్వము బ్రహ్మలో సూక్ష్మ రూపమున నున్న చిదచిత్తులు సృష్టిలో స్థూల రూపము దాల్చుట బ్రహ్మ సంకల్పమే; బ్రహ్మ అభిన్న నిమిత్తోపాదానకారణమే. శరీర శరీరి భావ తాత్పర్యము. తత్త్వము విశిష్ట అద్వైత మని చెప్పుటయే. నిర్వికారబ్రహ్మము

వికారప్రపంచ మగుట శాస్త్రప్రసిద్ధము. అనఁగా— బ్రహ్మముప్రపంచము కాలేదు, ప్రపంచములో అంతర్యామి మాత్రమే. సృష్టి - లీలార్థమే.

(4) బ్రహ్మ చిదచి చ్ఛరీరుఁ డయిన శరీర బాధలు సోకవా ? సంసారి కాఁడా ?

శరీర శరీరి భావము సరిగా అర్థముచేసికొన్న, ఈ శంక రాదు. బ్రహ్మ, జగత్, అంతర్యామి తత్ అతీతుఁడు. శరీర శరీరి భావ మాత్మీయతా ద్యోతకము. అట్లు కాకున్న, శారీరక శాస్త్రమే లేదు.

(5) జీవునకు అనంత విభు రూప ధర్మ జ్ఞానమె ట్లుండును ?

దీపము, తత్ప్రకాశము వలెనే, అనంత అంతరాళము, అణువు, తుల్య ఆనంత్య గుణకములే. ముక్త వామదేవ జ్ఞానము అనంతము. అట్లే, జీవునకు అనంత జ్ఞాన ప్రభవ మగు శక్తి (Potemtiality) ఉన్నది. నానాజీవ అద్వైత వాదముల కిది సమన్వయము. ఏక జీవ వాదమున ఒకఁడు జీవన్ముక్తుఁ డయిన, బ్రహ్మలో ఐక్యమైన, మిగిలిన జీవు లుండుట ఎట్లు ? కాన, అద్వైతవాదముకంటె నిది యుక్తి యుక్తము. శాస్త్రానుభవములు విశిష్టాద్వైతమున కుపోద్బలకములు.

(6) జీవునకు స్వేచ్ఛ కలదా ?

ప్రకృతి గుణములు గాని, భగవత్సంకల్పముగాని జీవస్వేచ్ఛను నియమించును. కాని, నైతికముగ స్వేచ్ఛ యున్నది. జీవుఁడు గుణముల స్వసంకల్ప బలముచే అతిక్రమింపవచ్చును భగవదానుకూల్యము నందవచ్చును.

(7) కర్మయు, దైవ కృపయు ఎట్లు సమన్వయించును ?

ఇవి ద్వంద్వములు అయినను, ప్రేమ శాసనము (Law of Love) మతమున కలదుకదా! బ్రహ్మ ఒక్కఁడే యైనను ఈశ్వర - ఈశ్వరీ భావమున భక్తోద్ధరణ గావించును. ఈశ్వరునికి వైషమ్య నైర్ఘృణ్యములు లేవు. కర్మానుగుణముగ జీవులకు ఫల మొసంగును. 'శ్రీ' శ్రియఃపతి హృదయ రాజ్ఞి. ఈశ్వరుని ధర్మమునకు దయాగుణము వన్నె దెచ్చును. శ్రీవైష్ణవమత సిద్ధాంతము ఈశ్వర ధర్మ శాసనము, ప్రేమల మేలు కలయిక. ఈ ప్రేమ సామ్రాజ్యము అపూర్వ విశేషము. ముక్తి ఒక దానము, ఒక లాభ సముపార్జనకూడ, గురు ప్రసాద - ఈశ్వర కటాక్షములు లేక సిద్ధింపదు.

(8) విశిష్టాద్వైతమున భగవంతుఁడు ప్రేమ స్వరూపుఁడు. భక్తిరూపాపన్నజ్ఞానము మోక్షదాయకము. (Thought & feeling.) గీతాచార్యుఁడు భక్తుని జ్ఞాని యనుచున్నాఁడు. ప్రేమ అన్యోన్యము. రాసలీల పరమ పావనము. ద్రమిడాచార్యుఁ డిట్లనుచున్నాఁడు :-

"ఫలసంబిభత్సయా హి కర్మభి రాత్మానం పిప్రీషన్తి స ప్రీతో೭లం ఫలాయేతి శాస్త్రమర్యాదా."

ఫలమును పొందుటకై కర్మల నొనర్చి, పరమాత్మను సంతోషింపజేయుచున్నారు. పరమాత్మ సంతోషించిన చాలుననుకొనుచున్నాఁడు. ఇదియే శాస్త్రపద్ధతి.

పరిశుద్ధ హృదయయులు, కామ గంధము లేనివారే రాసలీలా మాహాత్మ్యము నెఱుంగగలరు. కూరత్తాళ్వాన్ ఈ విషయమునే తమ 'అతిమానుష స్తవము'న చమత్కార సహితముగ నిట్లు సాయించిరి:-

"యత్త్వ ప్రియం తదిహ పుణ్య మపుణ్య మన్యత్
నాన్య త్తయో ర్నృపతి లక్షణ మత్ర జాతు
ధూర్తాయితం తవ తు యత్కిల రాసగోష్ఠ్యాం
త త్కీర్తనం పరమపావన మామనన్తి."

నీకు ప్రియమైనదే పుణ్యము - నీ కప్రియమైనదే పాపము. ఆ పుణ్య పాపములు కింత కంటెను వేరు లక్షణ మెప్పుడును లేదు. రాసగోష్ఠి యందలి నీ ధూర్త చేష్టితమును కీర్తించుటయే పవిత్రమని చెప్పుచున్నారు."

'పుణ్య పాపే విధూయ' అని శ్రుతి, పుణ్య పాపముల నధిగమించిన తరువాతనే నిశ్శ్రేయస ప్రాప్తి యనుచున్నది.

(9) పరమపదము భూతలస్వర్గమని వర్ణించుటలోను, ఇంద్రియసుఖమనుటలోను మానుష భావము (Anthropomorphism) ఉన్నదికదా ?

స్వర్గలోక వాహినీ తీరప్రాంత వనములందు, ఫల భార నమ్ర తరుచ్ఛాయలలో – మందానిల సేవ్యమానులై, కార్తస్వర సూర్య కాంతిలో - ముక్తులు ఆడి, పాడి, తాత్త్విక వాద తత్పురుషులై సుఖింతురు' అను విమర్శ - సహృదయ కృతము కాదు, సరియైనది కాదు. కౌషీతకీ ఉపనిషన్మూలమే శ్రీరామానుజ కృత పరమపద వర్ణనము. కావున ఈ విమర్శ, ఆ ఉపనిషత్తుకే అన్వయింపవచ్చును. వివేక వైరాగ్యములు ముక్తిసోపానములు. పరమపదము దేశకాలానవచ్ఛిన్నము, తదతీతము. శుద్ధ భావాస్పదు లగు ముక్తులకే అనుభావ్యము. ఉపనిషత్తులు కావ్య లక్షణా, ఉపమా సామగ్రీ సాహాయ్యమున ఇంద్రియాతీత అనంత విషయమును వర్ణింపఁగా, ఈ విమర్శకు డధ్యాసవశుఁడై, అనంతములను (Infinite) ఐంద్రిక విషయములుగా భావించి పొరబడుచున్నాఁడు ఉపనిషత్తులు బ్రహ్మగంధ, బ్రహ్మరూప, బ్రహ్మరస, బ్రహ్మానందములు బ్రహ్మానుభవ అపర పర్యాయములుగా సూచింప, అందలి గంధ – రూప – రస గ్రహణము మాత్రమే చేసి, బ్రహ్మను విస్మరించుట ఔపనిషదర్థప్రహాణమే యగును. బ్రహ్మానుభవ మానందపూర్ణము, అతి పవిత్రము.

(10) విశిష్టాద్వైతము సిద్ధాంత పరముగ అద్వైతము, అనుష్ఠాన పరముగ భగవ దస్తిత్వ వాదము, భేదాభేదవాద సదృశము. ఈ యంశము లెట్లు పొసగును ?

ఈ యాక్షేపము విశిష్టాద్వైతమునకు సంబంధించినది మాత్రమే కాదు- సామాన్యముగ సమన్వయ సిద్ధాంతములపై వచ్చు విమర్శయే. ఉత్తర దక్షిణ ధృవ దర్శనములు కలియవు సమన్వయమున నవి సంధిమార్గ మనియు, పరిష్కార పద్ధతి యనియు, సహనగుణ మనియు పెదవి విరచెదరు. విశిష్టాద్వైతము భేదాభేద, అద్వైతవాదములకు విరుద్ధమే. విరుద్ధ సామానాధికరణ్యము, ద్వైవిధ్య స్వభావమునకు చెడు నాపాదించుట, భేదాభేదవాదదోషములు విగ్రహ స్థానములు. అద్వైత నిర్గుణబ్రహ్మము, ఏక జీవవాదము, జీవన్ముక్తి, మాయావాదము, వివర్త వాదము, అనిర్వచనీయ ఖ్యాతి – విశిష్టాద్వైత మంగీకరింపదు. అనేక జీవ, సగుణ బ్రహ్మ సత్కార్య ఖ్యాతి, విదేహముక్తి వాదముల విశిష్టాద్వైత మంగీకరించును. ఇట్లు రెండును విరుద్ధములు. భగవంతుఁడు ప్రేమమూర్తి యని విశిష్టాద్వైత నిర్వచనము.

## ఉపసంహారము

"కాణాదం పాణినీయం చ సర్వ శాస్త్రోపకారకమ్."

అను సూక్తి ననుసరించి, న్యాయ – వైశేషిక దర్శనములు సర్వోపకారకములుకదా ! అవి యెట్లు భగవద్రామానుజులచే నిరస్తము ? అనఁగా – సమాధాన మిది –

గౌతమ మతము పూర్తిగా నిరాకరింపఁబడలేదు. యుక్తియుక్తము గ్రహింపఁబడినది. పరకల్పిత తటాక తీర్థము వలెనే,

తద్గత పంకము స్వీకరింపరుగదా! పరమాణు కారణత్వ సిద్ధాంతములు - సామాన్య విశేష సమవాయ పదార్థత్వము ఉపమానాదుల పృథక్ ప్రమాణత్వ కల్పన, సంఖ్యా పరిమాణ, పృథక్త్వ, పరత్వాపరత్వ, గురుత్వ ద్రవత్వాదుల పృథక్ గుణత్వ కల్పన, దిశద్రవ్యము కల్పన మొదలగు బ్రహ్మ సూత్రకార విరుద్ధ ప్రక్రియలను భగవద్రామానుజులు నిరాకరించిరి. కనుక, పై సూక్తి విరోధింపదు. ఇతర దర్శనములందలి యుక్తియుక్తాంశములు శ్రీమద్రామానుజులు గ్రహించిరి.

మొత్తముమీద శారీరక శాస్త్రము విశిష్టాద్వైతము ప్రశస్త వేదాంత సమన్వయము చేసినది, ఆపాతతః స్ఫురించు శ్రుతి వైరుధ్యమును ఘటక శ్రుతుల ద్వారా పరిష్కరించినది. శ్రీభాష్యకారులు పూర్వ పక్షముల నిరసించి, సిద్ధాంతమును స్థాపించిరి, విశిష్టాద్వైత దర్శన స్థాపన మొనరించి, మానవాళికి మార్గదర్శకులై, 'ఇతి సర్వం సమంజసమ్' అని మంగళాశాసనము గావించిరి

"శేషో వా సైన్యనాథో వా శ్రీపతిర్వేతి సాత్త్వికైః
వితర్క్యాయ మహాప్రాజ్ఞైః భాష్యకారాయ మంగళమ్"





# శ్రీ రామానుజ స్తుతి

## పూర్వకవి విరచితము



శ్రీ రామానుజ యోగిరాజ విహిత స్సిద్ధాంత నిర్వాహకా !
సారోదార విశేష భూరి సదయా ! స్వామీ ! జగద్రక్షకా !
శ్రీరంగేశ్వర నిత్యదాస్య విహితా ! శ్రీభాష్యకారా ! గురూ !
శ్రీరమోజ్జ్వల నిత్యసుందర ! నినుం జేమోడ్తు గోదాగ్రజా !

ఉభయ విభూతి నాయకుఁడు, నుత్తమ శేశవసూరిపుత్రుఁడున్,
శుభచరితుండుఁ, బూర్వపరసూరిజనాశ్రయుఁ, డున్నతోన్నతుం
డు, భవభయ ప్రదారుఁడు, దృఢోజ్జ్వలచిత్తుఁడు, దివ్యచేష్టుఁడుం
బ్రభువర మంత్రపూజ్యుఁడగు భాష్యగురుం డొగిఁ బ్రోచుఁగావుతన్ !

ముద్దు మొగంబుఁ, గెంజిగురుమోవి, దయారసమొల్కు కన్నులున్,
నిద్దపుఁజెక్కులున్, పసిఁడి సిగ్గులు దేఱెడి మేను, బాగుగా
దిద్దిన యూర్ధ్వపుండ్రమును, తెల్లని జన్నిదముం, త్రిదండముం
దద్దయు నొప్పు చిన్ని సిగ దాల్చిన మా యతిరాజు గొల్చెదన్.



# కవి పండిత పరిచయము

## *శ్రీమాన్ బృందావనం రంగాచార్యులు*



జననము 13-2-1929 జన్మ స్థానము-ప్రకాశంజిల్లా పరుచూరుకు సమీపమున గల వీరన్నపాలెము, జననీ జనకులు - రాఘువమ్మ, తాండవకృష్ణమాచార్యులు.

శ్రీమాన్ రంగాచార్యులుగారు తమ పితృపాదుల యొద్ద సంస్కృతాంధ్ర భాషలలో సుశిక్షితులై, అనంతరము తెనాలి - కోట లక్ష్మయ్యనాయుడు సంస్కృత కళాశాలలో నాల్గు సంవత్సరములు విద్యాభ్యాసము చేసి, 'భాషాప్రవీణ' పరీక్షలో ప్రథములుగా ఉత్తీర్ణులై, ఆంధ్ర విశ్వవిద్యాలయమున బంగారు పతకమును బహుమానముగా పొందిరి.

ఇప్పటికి 35 సంవత్సరముల నుండి వీరు పరుచూరులో యార్లగడ్డ రామన్న ఉన్నత పాఠశాలయందు ఆంధ్రోపాధ్యాయులుగా పని చేయుచు, వివిధ రంగములలో విఖ్యాతి నార్జించిరి.

రచనలు - (1) ఆదర్శమూర్తులు (2) త్యాగమూర్తులు (3) పుణ్యమూర్తులు (4) దివ్యమూర్తులు (5) తేజోమూర్తులు (ఇవి యైదును గద్యకావ్యములు) (6) భక్తపోతన (7) బాల నాటికలు (8) అప్పాజీ (ఈ మూడును నాటకములు) (9) దివ్య దీక్ష - అన్నమా

చార్య (టి.టి.డి. ప్రచురణ) (10) గుహుడు (ఆంధ్ర విశ్వ విద్యాలయమువారిచే, బి.ఏ, బి.కాం. తరగతులకు పాఠ్యముగా సంభావింపబడిన పద్యకావ్యము) (11) శబరి (శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయము వారిచే, బి ఏ. తెలుగు పాఠ్యభాగమునకు స్వీకరింపబడిన పద్య కావ్యము) ఇంకను - (12) పూజా పుష్పాలు (13) మురళి (14) బాలబోధ మొదలైన పద్యరచన లనేకములు. ఇట్లు వివిధ ప్రక్రియలలో - నేటి వరకు శ్రీ రంగాచార్య లేఖినినుండి వెలువడిన కృతి రత్నములు ముప్పదికి మించి యు డును.

విద్యార్థుల ఉపయోగార్థమై వీరిచే రచింపబడిన బాల నాటికలు, బాలబోధ, ఆంధ్ర వ్యాకరణము మున్నగునవి - అనేక పర్యాయములు ముద్రణ భాగ్యమును పొందినవి.

ఆంధ్రపత్రిక, ప్రభ, జ్యోతి, కృష్ణా వంటి ప్రముఖ పత్రికలలో వీరి గద్య పద్య రచన లనేకములు ప్రచురింపబడినవి.

శ్రీమాన్ రంగాచార్యులుగారు - ప్రముఖ కవి పండితులతో కలిసి, భువన విజయము, శ్రీనాథ విజయము, భారతావతరణము మొదలైన సాహిత్యరూపక ప్రదర్శనములలో పాల్గొని, పేరు గాంచిరి.

భాగ్యనగరమున ప్రపంచ తెలుగు మహాసభలు జరిగినపుడు వీరు భువనవిజయ మహాసభలో పాల్గొని, ప్రభుత్వ సమక్షమున ఘన సన్మానము పొందిరి.

తిరుపతి, సింహాచలము అన్నవరము, శ్రీశైలము మొదలగు ప్రముఖ దేవాలయములలో ఆధ్యాత్మిక ప్రసంగము లనేకములు చేసిరి.

ఆకాశవాణి విజయవాడ కేంద్రమునుండి, వీరి ప్రసంగములు, స్వీయ కవితలు ఎన్నియో ప్రసారములై, ప్రశంసలు పొందినవి.

1986 ఆగష్టు 4 - వ తేదీన వీరికి మద్రాసులో - యార్లగడ్డ రాజ్యలక్ష్మి వెంకన్న చౌదరి కళాపీఠమువారి అవార్డు లభించుట విశేషము. సాంస్కృతిక రంగమున విశిష్ట సేవలు చేసిన వారికి కళాపీఠము వారు ప్రతి సంవత్సరము అవార్డు యిచ్చు పదిమందిలో - ఈ సంవత్సరము శ్రీమాన్ రంగాచార్యులుగారు ఒకరుగా ఎన్నికయగుట - వీరి బహుముఖ ప్రజ్ఞా విశేషముల కొక తార్కాణము.

శ్రీమాన్ రంగాచార్యులుగారు సహృదయులుగా, సాహితీ సమారాధకులుగా, ఉత్తమ ఉపాధ్యాయులుగా, ప్రముఖ వక్తలుగా, మధుర కవులుగా సుప్రసిద్ధులు.

## శ్రీమాన్ కందాడై శ్రీనివాసాచార్యులు



జననము విజయనామస వత్సరము. (ది. 12-11-1953) జన్మస్థానము గుంటూరు జిల్లా పొన్నూరు. జననీ జనకులు - కమలమ్మ, వేంకట రాఘవాచార్యులు గారలు.

శ్రీమాన్ శ్రీనివాసాచార్యులు గారు ఉస్మానియా విశ్వవిద్యాలయమున బి. యస్.సి. డిగ్రీ పరీక్షలో ఉత్తీర్ణులై, ప్రస్తుతము హైదరాబాదులో - నిజాం సాయం కళాశాల యందు, రంగస్థల కళలో - పోస్టుగ్రాడ్యుయేట్ డిప్లొమా కోర్సును అధ్యయనము చేయుచు, హైదరాబాదులోనే, బాలానగరులో మల్హోత్రా సంస్థవారి ఇండోస్ప్రింగ్ లిమిటెడ్ రీసర్చి అండు డెవలప్‌మెంటు విభాగమున, రసాయన శాస్త్రజ్ఞులుగా ఉద్యోగము చేయుచున్నారు.

రామాయణ, భారత భాగవత, భగవద్గీతాదులందు వీరుకి అభిరుచి మెండు. భాగవత సత్సంగమునందు అభిలాష విశేషము. స్వాచార్యులు - శ్రీరంగ వాస్తవ్యులగు పూజశ్రీ - శ్రీరంగనారాయణ జీయరుస్వామివారు.

ధనుర్దాస విజయము, యతిరాజ విజయము అను రెండు శ్రవ్య నాటికలు వీరి లేఖినినుండి వెలువడినవి. వీనిలో - మొదటి నాటిక, హైదరాబాదు రేడియో కేంద్రమునుండి ప్రసారమై, శ్రోతల ప్రశంసలకు పాత్రమైనది. వీరి లేఖినుండి ముస్ముందు ఇంకను - సంప్రదాయ బద్ధములు, సాహిత్య నిబద్ధములు నగు ఉత్తమరచన లనేకములు రాగలవని మనము విశ్వసింపవచ్చును.

### *శ్రీమాన్ వెలమవెర్ల రంగాచార్యులు*



జననము 1912. జన్మస్థానము - కృష్ణాజిల్లా, ఉంగుటూరు జననీ జనకులు - వేంకటనరసమ్మ, శేషాచార్యులుగారలు.

వీరు మద్రాసు విశ్వ విద్యాలయమునకు సంబంధించిన 'వ్యాకరణ శిరోమణి,' 'విద్వాన్' పట్టముల నలంకరించిరి. ఉస్మాని యూ విశ్వ విద్యాలయమున తాళపత్రగ్రంథ పరిశోధకులుగా, ఓరుగల్లు నందలి ప్రభుత్వ కళాశాలలో సంస్కృతాంధ్రోపన్యాసకులుగా, మరల - ఉస్మానియా విశ్వవిద్యాలయమున సంస్కృతాంధ్రోపన్యాసకులుగా, రీడరుగా ఉద్యోగములను మిక్కిలి సమర్థతతో నిర్వహించి, పదవీ విరమణ గావించిన యనంతరము యు.జి.సి. వారిచే మరల ఆ విశ్వ విద్యాలయమందే ప్రాచార్యులుగా నియుక్తులైరి.

రచనలు ,- (1) హాలికుడు (నాటకము) (2) ఆంధ్రప్రతాపరుద్ర యశోభూషణము (అలంకారశాస్త్రము) (3) అలంకార వసంతము (4) ఆంధ్ర ముకుందమాల (5) ఆదర్శ భారత కథావళి (6) ఆంధ్ర లక్ష్మీ వైభవోదాహరణము (7) ఆంధ్ర లక్షణ రత్నాకరము (8) కావ్యోద్యానము (9) కావ్య పుష్పాంజలి (10) ఆంధ్ర వీరులు (బాల వాఙ్మయము) (11) కాళిదాస కావ్యోద్యానము (12) ఆంధ్రౌచిత్య విచార చర్చ (13) సోమనాద్రి విజయము (14) వాల్మీకి (15) భక్తభూషణ చంపువు (సంస్కృతము) (16) వ్యాఖ్యాతృ చక్రవర్తి మల్లినాథః (సంస్కృతము మున్నగునవి.

వీనిలో - హాలికుడు (నాటకము) మద్రాసు, బెనారస్ విశ్వ విద్యాలయములచే కొంత కాలము పాఠ్యగ్రంథముగా నిర్ణయింపబడినది. ఆంధ్రప్రతాపరుద్ర యశోభూషణము (అలంకార శాస్త్రము) ఆంధ్ర విశ్వ విద్యాలయముచే కొంత కాలము పాఠ్యగ్రంథముగా నిర్ణయింప బడినది.

ఏలూరులో రెండు సంవత్సరము లుండి, వేంకట్రామా అండు కో వారి కోరికపై, 'ఆంధ్ర శబ్ద రత్నాకరము' అను గొప్ప నిఘంటువును రచించిరి. ఇది రెండు భాగములుగా ప్రచురింపబడి, బహుళ ప్రచారము నందినది

వివిధ విషయములపై హైదరాబాదు రేడియో కేంద్రమునుండి వీరు చేసిన ప్రసంగములు - శ్రోతల ప్రశంసలకు పాత్రములైనవి. హైదరాబాదు సికిందరాబాదులలో గల అనేక సాహిత్య ఆధ్యాత్మిక సంస్థలందు వీరు సభ్యులుగా, ఉపాధ్యక్షులుగా, అధ్యక్షులుగా వివిధ పదవుల నధిష్ఠించి, ఆ యా సంస్థలను విశేషముగ విలసిల్ల జేసిరి.

1972 ఏప్రిల్ 14 - వ తేదీన, జంటనగరములలోని అనేక సాహితీ సంస్థలు, అనేక ఆధ్యాత్మిక సంస్థలు వీరికి షష్టి పూర్తి సందర్భమున ఘనముగా సమ్మానించినవి. అభిమానులు, బంధు మిత్రులు, కవి పండితులు, శిష్య ప్రశిష్యులు మున్నగువా రనేకులు వీరిని మహోన్నత స్థాయిలో సమ్మానించి, వీరియందు వారికిగల గౌరవ భావమును అభివ్యక్తము గావించిరి.

## శ్రీమాన్ చింపాపట్టణం శ్రీరంగాచార్యులు



జననము ధాతి నామసంవత్సర భాద్రపద బహుళ చవితి (6-10-193 ). జన్మస్థానము సిరిపురము, హుజూర్ నగర్ తాలుకా నల్లగొండ జిల్లా నివాసము తొండ, సూర్యాపేట తాలూకా, నల్లగొండ జిల్లా.

విద్యావ్యాసంగము :- ప్రాథమిక దశలో వీరు తండ్రిగారి వంత శ్రీవైష్ణవ సంప్రదాయము నెఱింగిరి. ఉన్నతి విద్యాభ్యాసము సూర్యాపేట ప్రభుత్వోన్నతపాఠశాలలో 1955 సంవత్సరమున H.S.C) మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణత, ఉస్మానియా విశ్వవిద్యాలయమున ఇంటర్మీడియట్ 1958 లో బి ఏ 1961 లో వరంగల్లులోగల ప్రభుత్వ శిక్షణాలయములో బి యిడి 1963 లో, ఉస్మానియా విశ్వవిద్యాలయమున 1966 లో ఎం. ఏ. అనంతరము ఉద్యోగ నిర్వహణ.

అధ్యాపకవృత్తిలో 16 సంవత్సరములు, జూనియర్ లెక్చరర్ గ 0 సంవత్సరములు. 1-1-81 నవంబరునుండి 1986 మే వరకు జడ్

నగ్లలో గల డాక్టర్ : బూరుగుల రామకృష్ణరావు ప్రభుత్వ డిగ్రీ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా 1986 జూన్ నుండి, మహబూబ్ నగరులోగల ప్రభుత్వ డిగ్రీకళాశాలయందును ఆంధ్రోపన్యాసకులుగా పదవీ నిర్వహణ.

పరిశోధనము - 'గుదిమెళ్ళ రామానుజాచార్యుల ఖండ కావ్యములు - సమగ్ర పరిశీలనము' అను అంశముపై వీరు - పి. హెచ్. డి. పట్టమునకై పరిశోధన వ్యాసమును రచించి, 1986 ఆగస్టులో - ఉస్మానియా విశ్వవిద్యాలయమున సమర్పించిరి.

విశేషాంశములు - ఆంధ్రభూమి, మూసి, జనధర్మ, సుజీవన్, భక్తినివేదన మున్నగు పత్రికలలో వివిధాంశములపై వీరి కవితలు, వ్యాసములు ప్రచురితములైనవి. వివిధ విషయములపై వీరి ప్రసంగములు, స్వీయకవితలు అనేకములు హైదరాబాదు రేడియో కేంద్రము నుండి ప్రసారితమైనవి. సాహిత్య సంగీతములందును, భగవద్భాగవత సంసేవనమునందును వీరికి ఆసక్తి మెండు.

## శ్రీమాన్ తిరుమల నరసింహాచార్యులు



జననము. 1894. జన్మస్థానము విజయనగరము. 1904నుండి1919 వఱకుమహారాజాంగ్ల కళాశాలలో జ ది వి, సంస్కృత మభిమాన కక్ష్యగ, మదరాసు విశ్వవిద్యాలయపు బి.ఏ. పట్టము నందిరి. 1919-20 లో రాజమహేంద్రవరమున యల్. టి. పట్టమునకు

జదివి, ఉత్తీర్ణులైరి. 1934 లో - మద్రాసు విశ్వవిద్యాలయపు సంస్కృతాంధ్రభాషలలో - ఎం.ఏ. పట్టభద్రులైరి. 1920 జులై మొదలు, విజయనగర మహారాజాంగ్ల కళాశాలలో, ఉన్నతపాఠశాల యందు ఆంగ్లాధ్యాపకులుగా, 1927 నవంబరునుండి అచటనే కళాశాల కక్ష్యలకు, సంస్కృతోపన్యాసకులుగా, (భాషాశాఖకు ప్రధానాచార్యులుగా), 1942 జులై నుండి మహారాజా సంస్కృత కళాశాలాధ్యక్షులుగా పని జేసి. 1955లో ఉద్యోగ విరమణ చేసిరి.

వీరు కొంతకాలము ఆంధ్ర విశ్వవిద్యాలయములో - సంస్కృతాంధ్రములందు, బోర్డు ఆఫ్ స్టడీస్ లో మెంబరుగా, ఛీఫ్ ఎగ్జామినర్ గా, ఛైర్ మన్ గా (Sanskrit) పని చేసిరి. 1942 లో - నెల్లూరు కాలేజీకి యూనివర్సిటీ కమీషన్ లు భాషా ప్రతినిధిగా ఒకపుడు, మునిసిపల్ కౌన్సిలర్ గా పదవుల నధిష్ఠించి, మిక్కిలి సమర్థతతో నిర్వహించిరి.

రచనలు - మాలవికాగ్నిమిత్రమునకు వ్యావహారికాంధ్రీకరణము, ఒకటి రెండు దృశ్యకావ్యకల్పనలు, జననీ మననము, దుహితృస్మృతి (ఖండ కావ్యము) వివిధ సందర్భములలో గూర్చిన చాటువులు మున్నగునవి.



# సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 7 | 13 | వెంకలుగా | లెంతలుగా |
| 9 | 9 | ఆ ద్య | ఆవిద్య |
| 16 | 26 | ముఖ్యముగా | ముఖ్యముగా |
| 21 | 10 | జాతిచ్య | ఔచిత్య |
| 32 | 8 | కమలము వలెను | కమలముల వలెను |
| 40 | .6 | ఏంబెరుమానారుల | ఎంబెరుమానారుల |
| 40 | 26 | తిరుప్పావై | తిరుప్పావై |
| 41 | 16 | చెసిన | చేసిన |
| 42 | 7 | య్ఞ మును | యజ్ఞమును |
| 50 | 14 | తస్యా శుతే | తస్యాః శ్రుతే |
| 51 | 4 | స్తోతరత్న | స్తోత్రరత్న |
| 55 | 4 | సమ్మతి చి | సమ్మతించి |
| 55 | 24 | ప్రసన్నామృతము | ప్రపన్నామృతము |
| 69 | 21 | గోష్ఠిపూరులు | గోష్ఠీ పూర్ణులు |
| 69 | 23 | గోష్ఠి, పుర్ణులకు | గోష్ఠీ పూర్ణులకు |
| 69 | 23 | గోష్ఠి, పురీశర్ | గోష్ఠీ పురీశర్ |
| 70 | 4 | కెగి | కేగి |
| 70 | 23 | గోష్ఠి, పూర్ణుల | గోష్ఠీపూర్ణుల |
| 71 | 9 | గోష్ఠి పూర్ణుల | గోష్ఠీపూర్ణుల |
| 71 | 19 | 1 10 - 1116 | 1010 - 1116 |
| 71 | 25 | స్తవములగాక | స్తవములనేగాక |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 72 | 19 | పజ్జనుడైనను | సజ్జనుడైనను |
| 73 | 15 | గోషిపూర్ణులను | గోష్ఠిపూర్ణులను |
| 73 | 21 | వంపగా | పంపగా |
| 75 | 18 | భార్య | భార్య |
| 85 | 10 | స్థితివి | స్థితిని |
| 86 | 12 | యాత | యాత్ర |
| 95 | 3 | నీలలకాప్సృత | నీలాలకాప్సృత |
| 134 | 1 | కీర్తికౌము | కీర్తికౌముది |
| 136 | 24 | దీపుల | దీప్తుల |
| 156 | 19 | వానిదై | వానిపై |
| 164 | 14 | యొక్క-చేయుచు | చేయుచు |
| 168 | 6 | Panasap: y | Philosophy |
| 171 | 12 | పాపములను | పాపములను |
| 176 | 8 | కరుఁడయు | కరుఁడయ్యు |
| 180 | 25 | నిరయింప | నిర్ణయింప |
| 184 | 16 | అరణనీయము | ఆదరణీయము |
| 199 | 10 | రజితముగా | రజతముగా |
| 210 | 25 | అధికరము | అధికరణము |

—※—

# శ్రీ రామానుజ కీర్తి కౌముది

### పోషకులు

| | |
|---|---|
| 1. శ్రీమాన్ నండూరి సత్యనారాయణాచార్యులు | గుడివాడ |

### సాధారణ సభ్యులు

| | |
|---|---|
| 1. శ్రీమాన్ వంగల వెంకటాచార్యులు | హైదరాబాదు |
| 2 ,, పట్వారు అనంత నారాయణాచార్యులు | పోలూరు |
| 3. ,, తిరుక్కోవళ్ళూరి అనంత లక్ష్మీ శయనం | గుంటూరు |
| 4. సర్వశ్రీ - ఎట్టంరెడ్డి బాలకృష్ణారెడ్డి | ఇందుకూరు పేట |

### విరాళములు

| | |
|---|---|
| 1. శ్రీమాన్ కిడాంబి వెంకట నరసింహాచార్యులు, పెంటపాడు | రు. 116 |
| 2. ,, శ్రీ పెరుంబూదూరు శ్రీరంగాచార్యులు, పాలెం | 100 |

## మా మాట

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ గ్రంథ ప్రచురణ మహోద్యమమిపుడు బహు వ్యయ ప్రయాసలకు లోనైయున్నందున, ఈ మహోద్యమ నిర్వహణమునకు టి.టి డి. వారు ఇతోధికముగా, గరిష్ఠ పరిమాణమున ఆర్థిక సహాయము గావింపవలెననియు, సంప్రదాయులు, సంప్రదాయాభిమానులు మా గ్రంథమాలలో సభ్యులగుట మూలమున సహకరింపవలెననియు షష్ఠి కౌముదిలో మనవి చేసియున్నాము. ఇందుకు ఫలముగా - టి టి డి.వారు ఈ సప్తమి కౌముదికి మరికొంత ఆర్థిక సహాయ మందించిరి. సంప్రదాయులు, సంప్రదాయాభిమానులు కొలదిమందిమాత్రమే సభ్యులుగా జేరి, సహకరించిరి. కాని, ఈ సహాయ సహకారములు స్వల్పము లగుటచే చాలవు. కావున, టి.టి డి. వారు ఇతోధికముగా గరిష్ఠ పరిమాణమున ఆర్థిక సహాయము గావింపవలెననియు, సంప్రదాయులు, సంప్రదాయాభిమానులు మా గ్రంథమాలలో విరివిగా, అధిక సంఖ్యలో సభ్యులుగా చేరుటమూలమున సహకరింపవలెననియు మరియొకసారి కోరుచున్నాము. ఇట్టి సహాయ సహకారములు సంపూర్ణముగా లభించిననేగాని, శ్రీ రామానుజ కీర్తి కౌముది షోడశ కళా పరిపూర్ణము కాజాలదు.

— ప్రకాశకులు

**అష్టమి కౌముదిలో**

# రామున్న రచనలు

1 శ్రీ వేంకటాద్రీశ్వర స్తుతి
*శ్రీమాన్ కోటభట్టరు శ్రీరంగాచార్యులు*

2. దివ్య ప్రబంధ నీరాజనము
*శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు*

3. భగవ ద్విషయము - త ద్విశేషము
*శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు*

4. శ్రీ రామానుజ దర్శనము
*శ్రీమాన్ తట్టా విజయ రాఘవాచార్యులు*

5. శ్రీ రామానుజ నవరత్నములు
*శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల వేంకట రాఘవాచార్యులు*

6 శ్రీమద్రామానుజులు - యోగవిద్యా రహస్యము
*శ్రీమాన్ చించాపట్టణం శ్రీరంగాచార్యులు*

7. ధనుర్దాసు
*శ్రీ పుతుంబాక శ్రీకృష్ణయ్య*

8 తిరునామములు - వైష్ణవ తత్త్వము
*డాక్టర్ కిడాంబి నరసింహాచార్యులు*

